“



ప్రెషర్ కుక్కర్స్ డీలర్‌నైన నేను, ఏది భద్రతగల కుక్కరో, ఏది మరింత భద్రతాయుక్తమైనదో చెప్పగలను.

**అయితే వాటి అన్నింటిలోను** అత్యంత భద్రమైనది న్యూ ప్రెస్టీజ్. కనుక మీరు మీ శ్రీమతికి న్యూ ప్రెస్టీజ్‌ని కొనిపెట్టారంటే, మీకు ఆమెపట్ల మిక్కిలి మక్కువ కలదని నిరూపిస్తున్నారన్న-మాట. మరియు ఆమె శ్రేయస్సుకే అత్యధిక ప్రాధాన్యాన్ని యిస్తున్నారన్న మాట-సర్వదా.

## న్యూ ప్రెస్టీజ్ ఎంత భద్రమైనదో చూడండి

**100% SAFE**

నూటికి నూరు పాళ్ళు భద్రతను చేకూర్చే అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టం (జి.ఆర్.ఎస్.) ఒక్క న్యూ ప్రెస్టీజ్‌కి మాత్రమే కలదు. 'వెయిట్ వెంట్' పూడుకొనిపోయినట్లయితే, కుక్కర్ లోపల మితిమించిన ఒత్తిడి ఏర్పడుతుంది.




ఇది కుక్కర్‌కు అత్యంత సమీపములో వున్న వ్యక్తికి ప్రమాదకరంగా పరిణమించవచ్చును.

న్యూ ప్రెస్టీజ్ **అయితే**, మితిమీరి ఏర్పడిన సీటి ఆవిరి జి.ఆర్.ఎస్‌ను బయటకు నెట్టుతుంది. తత్ఫలితంగా జి.ఆర్.ఎస్. ఆవిరిని భద్రంగా, రూఢిగా క్రిందికి విడిచిపెడుతుంది. గాస్కెట్‌ను ఒక స్పూన్‌తో **లోపలికి నెట్టండి.**



**అంతే**, ప్రెషర్ కుక్కర్ **తిరిగి** వినియోగానికి సిద్ధంగా వుంటుంది. న్యూ ప్రెస్టీజ్ **అయితే** ఎన్నడూ అణుమాత్రంకూడా ప్రమాదం వుండదు. అందుచేతనే ఎట్టి పరిస్థితులలోనైనప్పటికి అది అత్యంత భద్రమైనది- సర్వదా. ”

# భార్యపై నిజమైన ప్రేమగలవారు ప్రెస్టీజ్ వద్దని ఎట్లా అంటారు




**ప్రెస్టీజ్**




**ttk** తయారి.

న్యూ ప్రెస్టీజ్ ఒక్కటి మాత్రమే 100% భద్రమైనది. న్యూ ప్రెస్టీజ్ ఒక్కదానికి మాత్రమే జి.ఆర్.ఎస్. కలదు.

MAA (S) TTP 3B TEL 85

## ముఖచిత్రం

5-11 జూలై ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం మా అందాల తార జయప్రద ఫోటో అద్భుతంగా ఉంది. మమ్మల్ని రంజింపజేసింది.

ఉపద్రష్ట, జగన్నాథం, అయినాపురం.

★ ★ ★

అందాల తార అభినేత్రి 'రాధ' ముఖచిత్రం వేసినందుకు మీకు మా ధన్యవాదములు.

పి. బసంత్, కె. శ్రీధర్, కె. రాఘవేంద్ర
దామర్‌గిద్ద.

## సీరియల్స్

సీరియల్స్ రెండూ 'ముసురు వెలిసింది' 'శుశ్రుత నర్సింగ్ హోమ్' చాలా ఇంట్రస్టింగ్‌గా సాగుతున్నాయి.

కె. సోమశేఖర్, అనంతపురం.

★ ★ ★

28 జూన్, 4 జూలై 85 ఆంధ్రసచిత్రవారపత్రికకు నటి 'రాధ' అందాన్ని యిచ్చింది. డాక్టర్ కె. రవీంద్రబాబుగారి 'శుశ్రుత నర్సింగ్ హోమ్' చాలా ఆసక్తికరంగా ఉంది.

బాలిశెట్టి శంకరరావు, సంగంజాగర్లమూడి.

★ ★ ★

ది. 5-7-1985 జయప్రద ముఖచిత్రం ముగ్ధమనోహరంగా వుంది. 'జిగి బిగి' సీరియల్ చక్కని కథా గమనంతో చాలా ఆసక్తికరంగా నడుస్తూ మమ్మల్ని ఆనంద పరుస్తోంది. మల్లిక సీరియల్ సుమధురం, ముఖ్యంగా కొతినీడి గారి బొమ్మలు సహజ సిద్ధంగా చెప్ప లేనంతగా బాగుంటున్నాయి. కొతినీడి గార్కి ప్రత్యేక అభినందనలు.

సేలం కైలాసనాథ్‌బాబు, ఆకివీడు.




★ ★ ★

జయప్రద ముఖచిత్రం ఎంతో ఆకర్షణీయంగా ఉంది. "శుశ్రుత నర్సింగ్‌హోమ్" సీరియల్ చాలా బాగుంది. రచయితకు మా థ్యాంక్సు!

పి. రాము, పి. నిర్మల, గుంటూరు.

★ ★ ★

అభిమాన నటి రాధగారి ముఖచిత్రముతో వెలువడిన 28-6-85 సంచిక బాగుంది. మా అభిమాన తార రాధ ముఖచిత్రము ముద్రించినందుకు ధన్యవాదములు. కొత్తగా ప్రారంభించిన 'శుశ్రుత నర్సింగ్ హోమ్' సీరియల్ మాకు బాగా నచ్చినది. రచయిత గార్వైన డాక్టర్ కె. రవీంద్రబాబు గారికి మా ధన్యవాదములు.

జె. ఎస్. కుమార్‌రాజు, కోట.

## న్యూఢిల్లీ లేఖ

5-11 జూలై 85 పత్రికలో జయదుబాపీ గారు అన్నట్లు కూడికలూ, తీసివేతలూ, హెచ్చువేతలు, భాగాహారాలు చేసేవి కెలీక్యూటర్లు కానీ కంప్యూటర్లు కావు. కంప్యూటర్లు అతి క్లిష్టతరమైన గణిత సమస్యలు పరిష్కరిస్తాయి. మనము వైజ్ఞానికంగా అభివృద్ధి చెందడానికి, ముందుకు పురోగమించడానికి అవి ఎంతో అవసరము. మానవుని మెదడు కూడా ఒక పెద్ద కంప్యూటర్ అని మనము గుర్తించుకోవాలి.

పి. పట్టాభిరామయ్య, బరంపురం. □



**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)
శుక్రవారం : 2-8 ఆగస్టు, 1985
శ్రీ క్రోధన నామ సం. అధిక శ్రావణ. బ. విదియ
సంపుటము 77 : సంచిక 48
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు. 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు. 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003

### విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి : నళిని
(ఫోటో : పి. రవిచంద్ర)

కథలు :



సీరియల్ నవలలు:



వ్యాసాలు, శీర్షికలు :

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# 1985 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 6,600/-

ఎప్పటిమాదిరే ఈ సంవత్సరం కూడా దీపావళికి కథల పోటీ నిర్వహిస్తున్నాము. గత సంవత్సరంలాగే ఈసారి కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని ఆంధ్ర సచిత్ర వార పత్రిక దీపావళి సంచికలోనూ, ఆ తర్వాతి సంచికలోనూ ప్రచురిస్తాము. ఆటు తరువాత ఆ కథలపై **పాఠకుల బాలట్** నిర్వహిస్తాము.

**ముగింపు తేదీ : 24 ఆగస్టు 1985**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్క దానికి రు. 650 – చొప్పున బహుమతి లభిస్తుంది. ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు. 700/-, రు. 600/-, రు. 500/-లు వంతున అదనపు బహుమతులు అందజేస్తాము. మిగతా మూడు కథలకీ ఒక్కొక్క దానికీ రు. 300/-లు చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము.

**నిబంధనలు**

1. కథా వస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి.
2. కథ పన్నెండు అరతావులకి మించి ఉండరాదు (అరతావు అంటే ఎక్సర్సైజు పుస్తకం పేజీకి రెట్టింపు). కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి. కథ వ్రాతప్రతిపైన "1985 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి.
3. అనువాదాలు, అనుసరణలు, కాపీ కథలు పంపరాదు. గతంలో ప్రచురింపబడిన, రేడియోలో ప్రసారం అయిన కథలని, ఇతర పత్రికల పరిశీలనలో ఉన్న వాటిని పంపకూడదు. ఈ మేరకి తమ కథల వ్రాత ప్రతులతో పాటు రచయిత(త్రు)లు హామీ రాసి సంతకం చేసి పంపాలి. హామీ పత్రంలేని రచనలు పరిశీలింపబడవు.
4. రచయిత(త్రు)లు కలం పేరు వాడినా తమ అసలు పేరు, పూర్తి చిరునామా స్పష్టంగా రాయాలి.
5. సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలని ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము. బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలు ఫోటోలతో సహా తరువాత ప్రచురిస్తాము.
6. పోటీలో గెలుపొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫోటో, జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించాల్సి ఉంటుంది.
7. రచనలపై వచ్చే ఎటువంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది.
8. పోటీకి పంపే కథలు 24 ఆగస్టు 1985 నాటికి కానీ, ఆలోగా కానీ మా కార్యాలయానికి చేరాలి. ఆ తేదీ తరువాత అందిన కథలని సాధారణ ప్రచురణకి వీలు వెంబడి పరిశీలించడం జరుగుతుంది.
9. పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపడం జరగదు. కాబట్టి రచయిత(త్రు)లు వాటితో పాటు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లని జత పరచి పంపనవసరంలేదు.
10. పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వీలు వెంబడి వాటిని ప్రచురించడం జరుగుతుంది. ఆ విషయాన్ని ఉత్తరాల ద్వారా ఆయా రచయిత(త్రు)లకి తెలియజేస్తాము.
11. పోటీకి పంపే కథలని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు. కవరు పైభాగంలో "1985 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి.

రచయిత(త్రు)లందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

–సంపాదకుడు

# పంజాబ్‌లో పెరుగుతున్న అవగాహన

పాలం లేదా శాంతా క్రుజ్‌లతో పోలిస్తే చండీఘర్ విమానాశ్రయం చాలా చిన్నది. మమ్మల్ని ఢిల్లీ నించి అక్కడికి తీసుకువెళ్ళిన వాయుదూత్ ఆవ్రో విమానం ఒక ఆటబొమ్మలా వుంది. అది ఆకాశంలో కిందికీ పైకీ ఊగులాడుతూ గాలిపోతున్న బెలూన్‌లా ఎగురుతూ వెళ్ళి చండీఘర్‌లో దిగింది. అక్కడి టాక్సీ స్టాండులో ఓ అరడజను టాక్సీలు ఉన్నాయి. వాటిలో గడ్డాలూ, తలపాగాలూ ఉన్న ఆజానుబాహులైన సిక్కు డ్రైవర్లు ఉన్నారు. ఈ మధ్య చండీఘర్‌కి రద్దీ చాలా తక్కువగా ఉంటున్నది. మేము వెళ్ళిన విమానం కూడా చాలా భాగం ఖాళీగానే ఉంది. ఆ కారణంగా అక్కడున్న టాక్సీ డ్రైవర్లు మన దయాదాక్షిణ్యాల పైనే ఆధారపడి ఉన్నారనుకోవచ్చు. రెండురోజులపాటు నన్ను తన టాక్సీలో ఆ వూరంతా తిప్పిన వ్యక్తి సిక్కు అని నాకు రెండోరోజునగానీ తెలియలేదు. ఎందుకంటే అతను నున్నగా గడ్డం గీసుకున్నాడు, ఎంతో మంది పంజాబీలలా కాక చక్కని హిందీ మాట్లాడాడు. అతను పాటియాలాకి చెందిన ఒక వ్యవసాయదారుడి కుమారుడు. గడ్డం లేకపోయినా అతను అసలైన సర్దార్జీనే. అతనికి ఆసక్తి ఉందనిపించినా నేను అతనితో రాజకీయాల గురించి చర్చించలేదు. మనకి తెలియని వాళ్ళతో రాజకీయాల గురించి చర్చించకపోవడమే మంచిది. కానీ నేను ఎక్కడికి వెళ్ళినా అందరి మనసులలో రాజకీయాలే ప్రధానంగా చోటు చేసుకున్నట్లు కనిపించింది.

నేను దిగిన ఆ హోటల్‌లో ఏదో పెద్ద పార్టీ జరుగుతూ ఉన్నది. కాని అక్కడ గడ్డాలూ, తలపాగాల వంటివి ఏవీ నాకు కనిపించలేదు. ఇది అసహజంగా లేదా అని ఆ హోటల్ మేనేజర్‌ని అడిగాను. అలాంటిదేమీలేదని అన్నాడాయన. మరి కాసేపటిలోనే ఆ భవనంలోని మరొక చోట ఎన్నో తలపాగాలు కనిపించాయి. మనం సత్‌శ్రీ అకాల్ అనే లోగానే ఆ రెండు పార్టీలలోని వారు అటు వాళ్ళు ఇటూ, ఇటు వాళ్ళటూ కలివిడిగా తిరుగుతూ ఆ ప్రదేశం అంతా ఒక ఉత్సవం జరుగుతున్నట్లుగా తయారైంది. నేను ఢిల్లీలో విన్నవన్నీ కట్టుకథలే ననిపించింది – వాళ్ళని చూస్తుంటే. దేశంలో అత్యంత స్నేహపూర్వకమైన వాతావరణం చండీఘర్‌లో ఉన్నట్లు నాకు అనిపించింది.

ఈ హిందూ సిక్కు వ్యవహారం అన్నది చాలా అతిగా చేసినట్లు కనిపిస్తున్నది. ఇప్పుడు ఈ రెండు వర్గాల వారూ తాము ఒకరితో ఒకరు విడదీయరాని అనుబంధం కలిగి ఉన్నట్లు గుర్తించారు. కాబట్టి తిరిగి పూర్వపు సత్సంబంధాలని పునరుద్ధరించుకోవటం మినహా మార్గాంతరం లేదని వారు తెలుసుకున్నారు. తమని వేరుగా చూస్తున్నారన్నది చాలావరకూ వారివారి మానసిక స్థితిపై ఆధారపడి వుంటుంది. అటువంటి భ్రమతో కూడిన మానసిక స్థితి నించి వారు తిరిగి మామూలు స్థాయికి వస్తున్నట్లు కనిపించింది. అట్లాంటిక్ మహాసముద్రంలో ఎయిర్ ఇండియా విమానం కూలిపోయిన దుస్సంఘటన జరిగిన మూడు నాలుగు రోజుల తర్వాత నేను చండీఘర్ వెళ్ళాను. ఆ ఘోర విపత్తు రెండు వర్గాలలోని ఆవేశపరుల




లోని విచక్షణాజ్ఞానాన్ని తట్టిలేపి శాంతించేలా చేసింది. ఆ నగరంలో ఎక్కడ చూసినా విమాన ప్రమాదం గురించిన చర్చలే వినిపించాయి. నేను ఎక్కిన టాక్సీ డ్రైవర్ కూడా దానిని గురించి నా అభిప్రాయం తెలుసుకోవాలని అనుకున్నాడు. పరిస్థితులు చాలా దూరం వెళ్ళాయని, వాటిని తిరిగి మామూలు స్థితికి తీసుకురాకపోతే ఘోర విపత్తుకి దారి తీసే అవకాశం ఉందనే భావం సర్వత్రా కనిపించింది. ఇరువర్గాలవారూ దాదాపు దానిని విధ్వంసక చర్యగానే నిర్ణయించారు. ప్రమాదం జరిగిన రెండు వారాలకి కూడా దానికి కారణాలుతెలిపే గట్టిసాక్ష్యాధారాలు లభించనేలేదు. నేను కలుసుకున్నవారిలో చాలా మంది ఈ విధ్వంసక చర్యని తీవ్రంగా ఖండించారు. ఈ ఘోరప్రమాదం పంజాబ్ సమస్యని అతి ముఖ్యమైన మలుపు తిప్పుతుందనీ, విచక్షణకు గురి అవుతున్నామనుకుంటున్న ఆ వర్గం వారు తిరిగి జాతి జీవన స్రవంతిలో భాగం అయేందుకు సుముఖులని చేస్తుందని చండీఘర్ నించి వచ్చిన తర్వాత నాకు గట్టిగా అనిపించింది.

అక్కడ నేను చాలామందినే కలుసుకున్నాను. వారిలో చాలామంది ఇంజనీర్లు, అకౌంటెంట్‌లు, సైనికులు, పోలీసు ఉద్యోగులు మొదలైన వాళ్ళు ఉన్నారు. వాళ్ళు తాము చెప్పింది పత్రికలలో రాయడానికి కాదన్నారు కాబట్టి పేర్లు బయట పెట్టడంలేదు. వాళ్ల మనసులో ఉన్నది ఉన్నట్లుగా నాతో చెప్పకపోవచ్చు, కానీ నన్ను వాళ్ళ తప్పుదారి పట్టించడానికి ప్రయత్నించారని మాత్రం నేననుకోవడంలేదు. వాళ్ళింకా సందిగ్ధంగానే ఉన్నట్లు కనిపించింది. మనలాగే వారు కూడా కొంతమంది పరిస్థితులని బట్టి కొన్ని విషయాలని అతిగా నమ్మి ఉండవచ్చు. కానీ మంచి అన్నదే చివరికి నిలుస్తుంది. అది వారికి అప్పుడు బాగా అర్థం అవుతుంది. తీవ్రవాదులకీ, రాజకీయ వాదులకీ మధ్య మరో వర్గం కూడా ఉంది.

ఈ వర్గం వారి సానుభూతి ఇంకా ఎటూ మొగ్గలేదు. ప్రస్తుతం కల్లోల పరిస్థితి ద్వారా ప్రయోజనం పొందనిది కూడా ఈ వర్గమే. భింద్రన్‌వాలె జిన్నా వంటి వ్యక్తి కాదని, ఇప్పుడు ఉన్న పరిస్థితులు దేశవిభజన సమయంలో ఉన్న పరిస్థితులకి పూర్తిగా భిన్నమైనటువంటివని ఆ వర్గం గ్రహించింది. చరిత్ర పునరావృతం కావచ్చు కానీ రెండవసారి జరిగితే మాత్రం విషాదాంతమే అవుతుందది.

ఎన్నో కారణాలవల్ల ఈ వర్గం స్పష్టంగా తాను అనుకున్నది పైకి చెప్పలేకపోతున్నది. ఇప్పుడైనా అది ఆ స్థితిని అందుకోగలదా అన్నది నాకింకా సందేహంగానే ఉంది. అటువంటి పరిణతి చెందని రాజకీయ కీయేతర వర్గానికి ఎప్పుడూ శక్తికిమించిన సమస్యల పరిష్కారంలో చిక్కులు ఎదురవుతూనే ఉంటాయి. కానీ జాగ్రత్తగా వింటే ఆ మూడోవర్గం వారి అభిప్రాయాలు మనకి తెలుస్తాయి. వాటిని ఎవరూ పత్రికలలో ప్రతిబింబింప చేయడం జరగటం లేదు. ఎందుకంటే జోగిందర్‌సింగ్ లాంటి వారి ప్రసంగాలలా అవి పాఠకులకి అంత ఆకర్షణీయంగా కనిపించవు కాబట్టి. పంజాబ్ సమస్యకి జోగిందర్‌సింగ్, లోంగోవాల్ కన్నా కావలసింది చాలా ఉన్నది. అలానే నెహ్రూలు, కాంగ్రెసు కన్నా భారతదేశానికి కావలసింది ఎంతో ఉన్నది.

అక్కడి నించి ఢిల్లీ రావడానికి తిరిగి నేను

చండీఘర్ విమానాశ్రయానికి వచ్చాను. కానీ మేము ఎక్కవలసిన విమానం అప్పటివరకూ శ్రీనగర్ నించి బయలుదేరలేదని, అది చండీఘర్ రావడానికి మరో రెండు గంటలు పట్ట వచ్చని అన్నారు. ఆ చిన్న విమానాశ్రయం భవనం ప్రగతి మైదానంలో ఉండే స్టాల్‌లాగా ఉంది. అన్నీ అద్దాలే తప్ప గాలి అనేది లేదు. ఎండవల్ల విపరీతమైన తపనగా ఉంది. అదృష్టంకొద్దీ ఉన్నట్టుండి కుంభవృష్టి పడింది. బయట వాతావరణం ఒక్కసారిగా చల్లబడి ఆహ్లాద కరంగా మారింది. అందువల్ల మేము తిరిగి నగరంలోకి వెళ్దామని అనుకున్నాము.

అంత అప్తుడు కాకపోయినా కొన్ని సంవత్స రాలుగా నాకు తెలిసిన మిత్రుడు ఒకాయన నాతో ఒక విషయాన్ని మాట్లాడాలనుకున్నాడు. నేను పత్రికలలో రాసినవన్నీ ఆయన చదివాడు. వార్తా పత్రికలకి ఆయన ఎన్నో ఉత్తరాలు రాశాడు. నా ఆలోచనా ధోరణిలోనే ఆయన కూడా పత్రిక లలో ఉత్తరాల శీర్షికకి ఎన్నోసార్లు రాశాడట. కానీ ఒక్కటి కూడా పడలేదని అన్నాడు. ఆయన నాతో మాట్లాడుతూ ఈ ఆందోళన అంతా దేశం వెలుపలి శక్తుల ప్రోత్సాహంతోనే జరుగు తున్నదని, పాకిస్తాన్, అమెరికా సంయుక్త రాష్ట్రాల మద్దతు లేకపోతే ఒక్కరోజు కూడా అది నిలవదని అన్నాడు.

''ఇటుచూడండి'' అన్నాడాయన. ''రాజీవ్ అమెరికా సంయుక్తరాష్ట్రాలకి వెళ్లారు. అక్కడ ప్రచారంలో ఉన్న 'హిందీ అమ్రికీ భాయ్‌భాయ్' వ్యవహారం అంతా మోసం. ఆయన అక్కడినించి తిరిగివచ్చిన వారంలోపే ఘోరమైన విమాన ప్రమాదం జరిగి 329 మంది భారతీయులు దుర్మరణం పాలైనారు. ఈ విధ్వంసక చర్యకి కారణంగా భావించబడుతున్న వ్యక్తులు అమెరికన్ నిపుణుల చేత ఎఫ్.బి.ఐ. నిర్వహించే శిక్షణ కేంద్రంలో తర్ఫీదు పొందినవారే. డబ్బు కోసం తీవ్రవాదులకి శిక్షణ యిచ్చే ఆ దేశం తిరిగి వాళ్లే తమ విమానాలని దారి మళ్లించి, అందు లోని తమ పౌరులని బందీలుగా పట్టుకున్నప్పుడు వారివి దుయ్యబడుతూ ఉండటం మనం చూస్తూనే ఉన్నాము. అలాంటివాళ్లే పంజాబ్‌లో కలతలకి, కల్లోలాలకీ వెనుక ఉండి పాకిస్తాన్, తదితరచోట్ల ఉన్న తమ మిత్రుల ద్వారా చిచ్చు రగిలిస్తున్నారంటే నాకేమీ వింత అనిపించడం లేదు'' అన్నాడా మిత్రుడు.

ఆ స్నేహితుడు కూడా ఒక సిక్కే. పవిత్ర మైన మత సంబంధమైన నమ్మకాలు కలిగి ఉన్న వ్యక్తే. అయినా అతను తన మతాన్నికానీ, దేశాన్ని కానీ ఏదో ఒకదానినే కోరుకునే పరిస్థితి ఏర్పడితే మాత్రం నిస్సందేహంగా తాము దేశానికే ప్రాధాన్యత ఇస్తానని అన్నాడు. దేశం అన్నది ఉంటేనే కదా మీరూ, మీ గురుద్వారాలూ □

సీరియల్

# శుశ్రుత నర్సింగ్ హోమ్

## డాక్టర్ కె. రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

రవి ఒకో రోగిని పరీక్ష చేసి చూస్తుంటే మంజు కాసేపు అక్కడే వుండి చూచిందతనిని కొంచెం సేపున్నాక లోపల వున్న ఇన్ పేషెంట్లని చూచి వద్దామని బయల్దేరింది మంజు. ఇందుతో కాసేపు మాట్లాడదామని చంద్ర గది దగ్గరకు బయల్దేరింది చంద్ర ఆపరేషన్ బాగా తట్టుకున్నాడు. పల్స్ , బి. పి. టెంపరేచర్ అన్నీ మామూలుగా వున్నాయి.

సెలైన్ పెట్టిన చేయి పుచ్చుకుని అలాగే కూర్చుని వుంది ఇందు!

"ఇందూ! పొద్దుటి నుంచి అలాగే వున్నావా! కాసేపు నేను కూర్చుంటాను! నువ్వు రెస్టు తీసుకో" అంది మంజు

ఇందు మాట్లాడకుండా కుర్చీలోంచి లేచి గదిలో నాలుగు మార్లు అటూ యిటూ తిరిగింది కూర్చుని కూర్చుని ఆమెకు కాళ్ళూ చేతులూ నొప్పెట్టి పోయాయి

"ఇందూ! అమ్మ నిన్ను చూడాలని మరీ మరీ అనుకుంటున్నది. నేను చంద్రను చూస్తూ వుంటాను. నువ్వు యింటికి వెళ్ళి వేన్నీళ్ళు స్నానం చేసి బడలిక తీర్చుకునిరా! ఆ తర్వాత అందరం డాక్టర్ రవి వాళ్ళింటికి భోజనానికి వెళదాం! ఆ కాసేపూ చంద్ర దగ్గర ఎవరైనా నర్స్‌ని అట్టిపెడదాం!"

"అక్కా! చంద్రకు మెలకువ వచ్చినప్పుడు పక్కన నేను లేకపోతే బాధపడతాడు!"

"బహుశ యీ రాత్రికి అతనికి స్పృహ రాకపోవచ్చు! అయినా భోజనానికి వెళ్ళావని చెపితే అతనేం అనుకోడులే!"

"సరేనక్కా! ముందు మీ యింటికి వెళ్ళి ఆంటీని కాసేపు పలకరించి వస్తాను!

ఆమెను చూచి చాలా నలిలియింది

ఇందు అలా వెళ్ళగానే చంద్ర ఏదో అస్పష్టంగా గొణుగుతున్నట్లనిపించి దగ్గరకు వెళ్ళింది మంజు

"ఇందూ! ఇందూ! నన్ను వదలి వెళ్ళవు గదా! " సగం మగతలో కలవరిస్తున్నాడు చంద్ర

"లేదు చంద్రా! నిన్ను వదలి వెళ్ళను" ఇందు గొంతును ఇమిటేట్ చేస్తూ అంది మంజు.

"ప్రామిస్!"

"యస్! ప్రామిస్!"

మళ్ళీ చంద్రను మగత పూర్తిగా వశుద్ని చేసుకుందేమో అతని వద్ద నుండి ఏమీ మాటలు రాలేదు!

ఇందు చంద్ర ఒకరినొకరు ప్రేమించు కుంటున్నారన్నమాట! ఉదయం చంద్ర దగ్గర ఇందును చూడగానే మంజు అనుమానపడింది! ఇప్పుడు చంద్రమాటలు వినగానే ఆమె అనుమానం రూఢి అయింది

వయసులో వున్న యువతీ యువకులు ప్రేమలో పడడంలో అసహజం ఏమీ లేదు! ఇందు తనకంటే అయిదేళ్ళు చిన్నది అన్న సంగతి గుర్తురాగానే మంజుకు నవ్వు వచ్చింది యం బి. బి యస్. పాసవాలంటే వీళ్ళు దగ్గరపెట్టుకుని శ్రద్ధగా చదివినా ఆరేళ్ళు పడుతుంది అక్కడకూ ఎక్కడా పరీక్ష తప్పకుండా వస్తే! జీవితంలో విలువైన కాలం గడచిపోతుంది డిగ్రీ వచ్చాక వుద్యోగం కోసం ప్రయత్నం చేయడమో, ప్రాక్టీసు పెట్టుకోవడమో, పోస్టు గ్రాడ్యుఏషన్ చేయడమో మరికొంత సమయాన్ని తీసుకుంటవి.

తనకూ రవికీ ఇరవై ఎనిమిదేళ్ళు! తన స్నేహితులంతా వేలం వెర్రిగా వెళ్ళిపోతుంటే అమెరికా వెళ్ళింది అయిదేళ్ళనాడు. అప్పట్నుంచీ ఒకో స్థాయి అధిగమిస్తూ ఇప్పుడు కన్సల్టెంట్ స్థాయికి వచ్చింది గడచిన అయిదేళ్ళుగా క్షణం తీరిక లేకుండా వృత్తికి అంకితమై పోయింది. తీరా కొంచెం తీరిక దొరికి అమెరికా నుండి ఇండియా రావటానికి వీలు దొరకగానే ముందుగా గుర్తొచ్చాడు రవి యం బి. బి. యస్. చదువుతుండగా ఎంతో సన్నిహితంగా వుండేవాడు. తను వేసే జోక్స్‌కి పగలబడి నవ్వేవాడు!

ఉదయం తనను చూడగానే డస్సిపోయి వున్న అతని ముఖంలో కళాకాంతులు తళుకుమన్నాయి. తనంటే అతనికి ఎంతో అభిమానం! రవి గనుక తనతో పాటు అమెరికా వస్తేనా? వృత్తికి అంకితమైపోయిన అతనివంటి వారు ఎక్కడైనా పేరు తెచ్చుకుంటారు! జనరల్ సర్జన్ లేక తమ గ్రూప్ ప్రాక్టీసు దెబ్బతింటున్నది! డాక్టర్ రవిని తీసుకు వెళ్ళగలిగితే! కాని ఇక్కడ ఈ శుశ్రుత నర్సింగ్ హోమ్ ఇంత బాగా నడుపుతున్న రవి అమెరికా వస్తాడా?

"అక్కా! చంద్రకు మెలుకువ రాలేదుగదా?" ఇందు మాటలకు వులిక్కిపడింది

లేదు అన్నట్లు తల వూపింది మంజు. ఇందు తలస్నానం చేసి తెల్ల చీర కట్టుకుని తలలో గులాబి మొగ్గ తురుముకుని వచ్చింది. గులాబి మొగ్గ లాంటి

**జరిగిన కథ :–** 6 రచయిత, సర్జన్ అయిన రవితో రచయిత్రి, లెక్చరర్ అయిన ఇందువదనకు హైదరాబాదులో పరిచయం అయ్యింది. విజయవాడలో తన ఇంటికి వచ్చిన ఇందూకి చంద్రహాస్ నుంచి వచ్చిన ఉత్తరం సాక్షాత్కరించింది తనకి కడుపు నెప్పి ఎక్కువగా ఉందని, అందు మూలంగా గుంటూరులోని రవిగారి శుశ్రుతా నర్సింగ్‌హోమ్‌లో చేరానని రాసాడు ఇందుకి చంద్ర మొదట తనని ఎలా అల్లరి పెట్టిందీ తుదకు ఏ విధంగా ఆప్తమిత్రుడైనదీ గుర్తుకు వస్తుంది. చంద్రను చూడటానికి గుంటూరు వస్తుంది ఇందువదన. రవి ఇంట్లో దిగుతుంది. అక్కడి నుండి ఆ రాత్రే చంద్రను చూడను నర్సింగ్‌హోమ్‌కి వెళుతుంది. చంద్ర ఆమెను చూసి ధైర్యం తెచ్చుకుంటాడు. చంద్ర, రాకేష్ ఇందువదన పేరు కలవరించటం విన్న రవి మనసు కల్లోలం చెందుతుంది. రవికి మేనకోడలు గీతను పెళ్ళి చేసుకోవటం ఇష్టంలేదు. రవి క్లాస్‌మేట్ మంజు అమెరికా నుండి వచ్చింది. చంద్రహాస్‌కి అల్సర్ ఆపరేషన్ జరిగింది. ఇందు, మంజు అక్క చెల్లెళ్ళ పిల్లలని తెలుసుకుంటాడు రవి. ఇందు మంజు పినతల్లి కూతురని తెలియగానే రవి అమ్మమ్మకు ఇందుపై అభిమానం పెరిగింది.

ఇందు తలలో గులాబి మొగ్గ వెలాతెలా పోతున్నది! స్నిగ్ధసుకుమారి తన చెల్లి ఇందు రచయిత్రి. ఇంత అమాయకంగా కనపడే ఇందు ఎన్నో కఠిన జీవిత సత్యాలను అనేక దృక్కోణాల నుంచి నిశితంగా పరిశీలించి వ్రాస్తున్నది. ఇందు చంద్ర జోడీ బాగా వుంటుంది! చంద్ర మనసు నిండా ఇందునే వున్నది అన్నది నిస్సందేహం!

మరి ఇందు కూడా అతన్ని ప్రేమిస్తున్నదా? ఎంత వెర్రిదానిలా ఆలోచిస్తున్నది తను! చంద్రను ప్రేమించక పోతే ఇందు ఇంత దూరం వచ్చి యీ ఆపద సమయంలో అతనికి ఇలా సేవ చేస్తుందా?

పైకి ఎన్ని కారణాలు చెప్పినా తను ఇన్ని మైళ్ళు వచ్చింది రవికోసం కాదా? రవి విషయం తలుచుకుంటే తన హృదయంలో బయల్దేరే సంతోష తరంగాల ప్రకంపనలకు తన శరీరం తట్టుకోలేక పోతున్నది! అటువంటిది ఇందు చంద్రల ప్రేమను చూచి తను ఆనందపడకుండా ఎలా వుంటుంది.

"ఏమిటి మంజు అక్కా! అలా కూర్చుండి పోయావు!"

"ఓ! ఏం లేదమ్మా! రా యీ కుర్చీలో కూర్చో! నేను కింద్రకు వెళ్ళి రవికి అవుట్ పేషెంట్లను చూడడంలో సాయపడతాను.

పని అవగానే ముగ్గరం వెళ్ళి సావిత్రమ్మగారు వడ్డించినవి తినాలి. లేకపోతే ఆమె సరాసరి ఇక్కడకు వచ్చి మన వీపుమీద వడ్డిస్తుంది."

"మరి చంద్ర ఎలా?"

"నీ చంద్రకు ఏమీకాదులే చిట్టి చెల్లెలా! నువ్వు తిరిగి వచ్చేదాకా సరోజ ఇక్కడ వుండి అతన్ని చూస్తుంటుంది! సరేనా?"

"సరేనక్కా!"

మంజు కిందకు దిగి వెళ్ళేసరికి రవి దాదాపుగా వో. పి.లను చూడడం పూర్తయింది. ఇన్‌పేషెంట్ల నందరనూ చూచి వచ్చేసరికి తొమ్మిది దాటింది. సరోజను చంద్రను చూస్తుండటానికి అట్టి పెట్టి ఇందును కూడా తమ వెంట తీసుకుని ఇంటికి బయల్దేరారు.

సావిత్రమ్మ వాళ్ళను చూడగానే "అరే! ఇప్పటిదాకా రాలేదు మీరు! మంజు కిష్టం అని జంతికలు చేసాను! రండి! చేసిన వంటకాలు ఇప్పటికే చల్లారిపోతున్నాయి" అంటూ హడావిడి చేసి ముగ్గుర్నీ డైనింగ్ టేబిల్ వద్దకు తీసుకు వెళ్ళింది.

డైనింగ్ టేబిల్‌కు వొకవైపు రవి, మంజు, మరో వైపు ఇందు, గీత కూర్చొన్నారు. ఆవిర్లు గక్కే జంతికలు తెచ్చి అందరి పళ్ళాలలో వడ్డించింది సావిత్రమ్మ. పప్పు, నెయ్యి, బెల్లపుచారు, గోంగోరపులుసు వడ్డిస్తూ....

"తినమ్మా మంజూ! జంతికలంటే నీకు ప్రాణం. ఇన్నేళ్ళు అమెరికాలో వున్నావు అక్కడ ఎటుదిరిగీ నువ్వు జంతికలు తినివుండవు" అంది సావిత్రమ్మ.

"లేదండీ! అక్కడ నూడిల్స్ అని మన జంతికల మాదిరివే వుంటయి. వాటినే ఎక్కువగా తినేదాన్ని" అంది మంజ.

"జంతికలు తిన్న ఆడపిల్లకు తొలుచూరి మగపిల్లవాడు పుడతాడని సామెత వున్నది. తినమ్మా యిందూ! అన్నట్లు మర్చిపోయా! ఇందాక భూదేవి కాకరకాయ వేపుడు పంపింది. మధ్యాన్నం నువ్వు తినలేదట!" అంటూ ఇందు పళ్ళెంలో కాకరగాయ వేపుడు కూర వడ్డించింది.

కబుర్లు చెప్పుకుంటూ భోంచేస్తున్న వాళ్ళను చూడగానే సావిత్రమ్మకు ఏదో సంతోషం కలిగింది.

"మంజు, ఇందు ఇద్దరూ అక్క చెళ్ళెళ్ళ పిల్లలట. చక్కటి పిల్లలు. ఇందు మరీను! గులాబి మొగ్గలా వున్నది. ఇంట్లో గీత వుందని ఆరాటపడుతున్నాగాని లేకపోతే రవి మంజునిగాని, ఇందునిగాని పెళ్ళి చేసుకుంటే ఎంతో బాగుంటుంది!

అస్తమానం వాడికి ఆస్పత్రి పనులలో తీరిక లేకుండా వుంటున్నది. మంజును చేసికుంటే ఆస్పత్రి పనులలో సాయం చేస్తుంది.

పోనీ ఇందూను చేసుకుంటే మాత్రం ఏం? చక్కగా వాడికి ఇంటిదగ్గర మంచీ చెడూ అన్నీ అమర్చి పెడుతుంది! రవిలాగే ఆ అమ్మాయి రచయిత్రి అని









# శుశ్రుత నర్సింగ్ హోమ్

గీత చెప్పింది.

అయినా ఇదేమిటి ఇలా ఆలోచిస్తున్నది? తన్ను మాలిన ధర్మం లేదన్నారు! ఇంట్లో గీతను పెట్టుకుని ఇలా ఆలోచిస్తున్న దేమిటి?

వీలున్నంత త్వరలో మనుమడికి గీత నిచ్చి పెండ్లి చేయించి కృష్ణారామా అనుకుంటూ కాశీ, రామేశ్వరం, బదరి చూచివస్తే ఇక ఆ తర్వాత యీ పిడికెడు ప్రాణం బుగ్గిపాలయినా ఫర్వాలేదు. ఇనాళ్ళుగా విశ్రాంతి లేకుండా కూతురి కాపురం చెలాచెదురు కాకుండా హైరానా పడ్డాను! ఆ శుభకార్యం అయిందనిపిస్తే ఇక నేనేమైనా ఫరవాలేదు" అనుకోసాగింది సావిత్రమ్మ.

"ఇంట్లో పసిపిల్ల ఏడుపువిని ఎన్నేళ్ళయిందో? గీత కడుపున ఒక నలుసు పుడితే చూచి బంగారు వుగ్గు గిన్నెతో వాడికి వుగ్గుపట్టి..." ఎడ్వాన్సుగా ఆలోచించసాగింది సావిత్రమ్మ.

"అమ్మమ్మా! ఇందుకు కొంచెం చారు వడ్డించు! అరెరె! ఏమిటి! అలా వున్నావేం!"

రవి పరిగెత్తుకు వచ్చి పడిపోతున్న సావిత్రమ్మను పట్టుకున్నాడు! మనుమడి చేతిలో ఒరిగి పోతున్న సావిత్రమ్మ కళ్ళు మూసుకుపోసాగాయి! నోటి నుండి సొంగ రాసాగింది. నలుగురూ కలసి ఆమెను మంచం మీదకు జేర్చారు.

ఆమె కుడి చేయి, కుడికాలు కదలకుండా వుంటం చూసాడు రవి. బి.పి. చూసాడు. రెండు వందల ఇరవై వున్నది!

"స్ట్రోక్ వచ్చింది!" అన్నాడు రవి. అతని గొంతు బాధతో గద్గదమై పోయింది. రవి చిన్నప్పట్నుంచి అన్నీ తానే అయి పెంచిందామె. ఎప్పుడు జిర్రున చీది ఎరుగదు!

ఈ రోజు ఆకస్మికంగా ఆమె యిలా పక్షవాతం వచ్చి పడిపోవడం చూస్తే అతని మనసులో గాలం వేసి తిప్పినట్లు బాధ కలుగసాగింది.

మంజు ఆమెను పరీక్ష చేసి చూసి "బాధపడకు రవీ! ఆమెకు సెరెబ్రల్ థ్రాంబోసిస్ వచ్చింది. హెమరేజ్ కాదు. ఇప్పుడు ప్రమాదం ఏమీ వుండకపోవచ్చు! కొద్ది వారాలలో ఆమె మామూలు మనిషి అవటానికి అవకాశాలు వున్నాయి" అంది.

"నిజంగా అమ్మమ్మకు నయమవుతుందంటావా?" డాక్టరులా కాకుండా మామూలు మనిషిలా అడిగాడు రవి మంజును.

"అంతపెద్ద నర్సింగ్ హోమ్ నడుపుతున్నాడు. అమ్మమ్మకు స్ట్రోక్ వచ్చేసరికి మామూలు మనిషి కంటే అన్యాయంగా భయపడుతున్నాడు" అని మనసులో అనుకుని...

"తప్పకుండా నయమవుతుంది! నువ్వు ఇలా భయపడుతుంటే అక్కడ గీత చూడు ఎలా కుమిలి కుమిలి ఏడుస్తుందో" అంది మంజు.

ఆమె మాటలు విని తలఎత్తి చూచింది గీత.

నీళ్ళు నిండిన ఆమె కళ్ళలో ఏదో ఆశారేఖలు పొడసూపాయి.

దగ్గరకు వచ్చిన రవిని కావిలించుకుని "మామయ్యా! తాతమ్మకు నయమవుతుందా?" అని ఏడవసాగింది.

"తప్పకుండా నయమవుతుంది గీతా! ధైర్యంగా వుండు" అంటూ ఆమె వీపు నిమురుతూ వుండిపోయాడు. గీత ఏడుపు చూడగానే అతనికి కర్తవ్యం బోధపడిందిలా వుంది!

"గీతా! డన్‌లప్ పరుపు తీసుకునిరా! మామూలు పరుపుమీద అమ్మమ్మను పడుకోబెడితే, బెడ్‌సోర్స్ వస్తాయి" అంటూ ఫోన్ దగ్గరకు వెళ్ళి సిరింజిలు, ఇంజక్షన్‌లు తీసుకుని రమ్మని నర్సుకు ఫోన్ చేసాడు.

సావిత్రమ్మగారిని డన్‌లప్ పరుపు మీద పడుకోబెట్టి వాంతితో తడిచిన ఆమె చీర, రవిక మార్పించింది మంజు.

సావిత్రమ్మగారికి బి.పి. తగ్గటానికి, పక్షవాతానికి ఇంజక్షన్లు చేసింది మంజు.

కొంచెం సేపుండి "చంద్ర దగ్గరుండాలి! వెళ్తున్నా" అంటూ ఇందు వెళ్ళిపోయింది. ఆ రాత్రంతా దిగాలుగా అమ్మమ్మ మంచం పక్కన కూర్చుని వుండిపోయాడు రవి. వరుసగా కొన్ని రోజులుగా నిద్రలేదతనికి! శరీరం అంతా డస్సిపోయి వుంది. ఇప్పుడు అమ్మమ్మ పడిపోవటంతో అతని మనసు కుమిలిపోసాగింది. మనసు, శరీరం డస్సిపోవటంతో తెల్లవారేసరికి అతను లంఖణాల రోగిలా తయారయాడు.

సావిత్రమ్మగారు గీతను గారాబంగా పెంచింది. ఆమె చేత ఏ పనీ చేయించేది గాదు. గీతకు వంటింట్లో ఏ మూల ఏమున్నదీ తెలియదు! తెల్లవారిన దగ్గర్నుండి సావిత్రమ్మగారిని చూస్తూ కళ్ళ వెంట నీళ్ళు పెట్టుకోడం తప్ప ఆమె ఏ పనీ చేయలేకపోయింది!

మంజు వెళ్ళి వంట యిల్లంతా వెతికి చూచి ఏది ఏ మూల వున్నది తెలుసుకుని పాలవాడు ఇచ్చిన పాలతో కాఫీ కాచి రవికి, గీతకూ ఇచ్చింది. సావిత్రమ్మగారికి ఒకో స్పూనూ కాఫీ నోట్లో పోస్తూ ఆమె గుటక వేసిందని నిర్ధారించుకున్నాక నెమ్మదిగా కప్పు కాఫీ తాగించింది.

"రవీ! సావిత్రమ్మగారు కాఫీ తాగగలిగారు. కంప్లీట్ పెరాలిసిస్ కాదు. క్రమంగా ఆమె కోలుకుంటుంది. నువ్విలా దిగులుపడి కూర్చోక వెళ్ళి నర్సింగ్‌హోమ్ పని చూస్తూ వుండు. ఆమె సంగతి, ఇంటి సంగతి నేను చూచుకుంటాను" అంది మంజు.

ఆమె మాటలు రవికి ధైర్యం కలిగించాయి.

"అలాగే మంజూ! నేను ఇక్కడ వున్నా చేయగలిగిందేమీ లేదు! నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళి త్వరగా వస్తాను. ఏం కావాల్సి వచ్చినా నాకు ఫోన్

# శుశ్రుత నర్సింగ్ హోమ్

చేయి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

విషయం తెల్సుకుని భూదేవి వచ్చింది. సావిత్రమ్మ గారిని అలా చూడగానే ఆమె "అయ్యో ఎలా అయింది!" అంటూ "కష్ట సమయంలో ఒకళ్ళకొకళ్ళం నిలబడాలి! ఆయన పోయినప్పుడు సావిత్రత్తయ్య వచ్చి నిలబడి ఎంతో సాయం చేసింది! ఇప్పుడామె ఇలా పడిపోతే ఎలా వూరుకుంటాను" అంది.

"అమ్మా! ఆమె సంగతి నేను చూచుకుంటాను. నువ్వు వంట ప్రయత్నం చూడు" అంది మంజు. గీతను బతిమిలాడి ధైర్యం చెప్పి కాలేజికి పంపించింది భూదేవి.

నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళిన రవి లోపల వున్న ఇన్ పేషెంట్లందర్నీ చూడసాగాడు. అందరూ బాగున్నారు. ఎవరకూ ఏ విధమైన కాంప్లికేషన్లు రాలేదు!

రవి వెళ్ళేసరికి చంద్ర మంచం మీద లేచి కూర్చున్నాడు! రవిని చూడగానే.

"థాంక్యూ సార్! థాంక్యూ వెరీమచ్! ఇంక నాకు జన్మలో కడుపు నొప్పి రాదు అనుకుంటే ఎంత హాయిగా వుందో తెలుసా! మళ్ళీ జన్మ ఎత్తినట్లు వున్నది! ఈ జన్మలో మీ ఋణం తీర్చుకోలేను" అన్నాడతను.

"డోన్ట్ గెట్ ఇమోషనల్" అంటూ అవతల గదిలోకి వెళ్ళాడు రవి.

రాకేష్ లేచి కూర్చుని వున్నాడు. "సార్! నన్నెప్పుడు డిశ్చార్జి చేస్తారు" అంటూ తలకు కట్టిన బాండేజి తడుముకోసాగాడు.

రాకేష్ తల్లి వచ్చి "డాక్టరుగారిచలవన బతికి వున్నావు! ఇప్పుడే ఇక్కడ నుండి వెళ్ళేంజేస్తావు? పూర్తిగా నయమయాక వెళ్ళువుగాని" అంది.

"మిస్టర్ రాకేష్! నీకు ఆపరేషన్ చేయవలసి వచ్చింది! కుట్లు తీయాలంటే ఇంకా అయిదారు రోజులు పడుతుంది. అన్నీ బాగుంటే అప్పుడు ఇంటికి పంపుతాను" అన్నాడు రవి.

"అలాగా! తలకు ఏదైనా గాయం అయితే కుట్లు వేసారేమో ననుకున్నాను! ఆపరేషన్ చేసారన్న మాట" అంటూ మంచం మీద పడుకున్నాడు.

గర్భకోశం పగిలిపోతే హిస్టిరెక్టమీ చేసిన సుశీల బాగా వున్నది. ఆమెను కాఫీ, రొట్టి తీసుకోమన్నాడు రవి.

కన్సల్టింగ్ రూమ్‌కు తిరిగి వస్తూ మల్లిక గదిలోకి వెళ్ళాడు. ఆమె ఆరోగ్యం బాగా మెరుగయింది. జాజి మొగ్గల్లాంటి కళ్ళల్లోంచి కృతజ్ఞతాభావం నిండిన చూపులు రవిని ముంచెత్తాయి.

"సర్! వీరయ్య కల్లు తాగిన ఎలుగ్గొడ్డులా మండిపడుతున్నాడుట! సుబ్బుల్నింత అవమానం జేస్తుందా? ఇంటికి రానియ్యి దాన్ని నల్కికి పొగులు పెడతా" అని మల్లిక మీద కారాలు, మిరియాలు నూరుతున్నాడని మా తమ్ముడు చెప్పాడు.

ఇంటి మాట తలుచుకుంటేనే మల్లి గజగజలాడిపోతున్నది. మీరు కొంచెం ధైర్యం చెప్పండి" అంది సరోజ.

"మల్లికా! నీ యిష్టం లేకుండా నిన్నిక్కడ నుండి ఎవరూ తీసుకుని వెళ్ళలేరు! నీరసం తగ్గాక సరోజ వెంట వుండి ఆస్పత్రి పనుల్ను నేర్చుకో, ఇంతకీ నువ్వెంతదాకా చదువుకున్నావు?"

"పదో తరగతి వరకు చదివానండీ"

"సరే! దిగులు పడిన కొందీ భయపెడతాడు వీరయ్య. ధైర్యంగా నీ కాళ్ళ మీద నువ్వు నిలబడితే అతను నిన్నేమీ చేయలేడు" అని కన్సల్టింగ్ రూమ్‌కు వెళ్ళాడు రవి.

కుర్చీలో కూర్చోగానే అమ్మమ్మ గుర్తుకొచ్చి విచారం ముంచుకొచ్చింది. కుర్చీలోంచి లేచి వెళ్ళబోయాడు. లోపలకు ఒక్కొక్కరుగా వస్తున్న అవుట్ పేషెంట్లను చూడడంలో మరలా ఆ విషయం తాత్కాలికంగా మర్చిపోయాడు.

(ఇంకా ఉంది)

# వారఫలం

## 2-8-1985 శుక్రవారం మొదలు
## 8-8-1985 గురువారం వరకు

★ **మేషం** : ఏమనుకొంటే ఏంలాభం? శ్రమ ఎక్కువ, ఫలితం తక్కువ. వ్యాపారం మందకొడిగా సాగటం గమనించగలరు. ప్రయాసకు లోనుగాకండి, ఓర్పుతో మీతో సహకరించే వారిని కూడగట్టుక నడవండి. స్త్రీలకు : సుఖ, ధన, వాహనలాభం కొందరకు నిశ్చయం.

★ **వృషభం** : మాట మంచితో ప్రవర్తిస్తే ఎక్కడా యిబ్బందిలేదు. ఎవరయినా సాయం చేస్తారు. మీ శక్తిసామర్థ్యాలకన్నా చిత్తశుద్ధికి, నిజాయితీకి ప్రాధాన్యత, వ్యాపారం సాగించేలాగైతే లాభదాయకమే. స్త్రీలకు : వృత్తియందు వికాసం, ఉద్యోగాభివృద్ధి.

★ **మిధునం** : చికాకులు తొలగిపోతాయని ధైర్యంగా ఉండవచ్చు. ఆశించిన ధనం దొరుకుతుంది. ఒకవేళ అది అప్పులు వసూలు బాపతు కావచ్చు, ముద్రాపకులకు, గనులందు పనిపాటలు చేసేవారికి, బ్యాంకు ఉద్యోగస్థులకు అనుకూల వారం. స్త్రీలకు సోమ, మంగళవారాలు శుభదాయకాలు, లాభ ప్రదాయకాలు.

★ **కర్కాటకం** : మీ శ్రద్ధాసక్తులు నాలుగు విధాలా మీ ఆదాయపెంపునకు సహకారులు, బాగా శ్రమించట మీవంతు. అనుకోకుండా ఆదాయం కూడా చేకూరగలదు. వ్యవహార దక్షతకు నెలవైనవారం, అన్ని వారాలింతేఅని అనుకోకండి. స్త్రీలకు : నూతనోద్యోగప్రాప్తి కొందరకు, నూతన వస్తుసేకరణకు కొందరకు అవకాశం.

★ **సింహం** : నూతన విషయాలు ఉత్తరాల మూలంగా గ్రహించి ఆశ్చర్య చకితులు కాగలరు. 'బుధ, గురు' వారాలందు ఆరోగ్యలోపం ఏర్పడవచ్చు, జాగ్రత్త! వృత్తియందు ఏదో సంకటం అనుభవించనున్నారు. గ్రహించి మెలగండి. స్త్రీలకు : విద్యా వైజ్ఞానికంగా అనుకూలం, కటుంబానందం, ఉత్సాహజనకవారం.

★ **కన్య** : సాటివారి పోటీ వృత్తి రీత్యా, వ్యాపార రీత్యా మీరు ఎదుర్కొనవలసిన అగత్యమున్నది, ప్రశాంతంగా వారం గడపటం ఎంతైనా మేలు. అత్యవసర ప్రయాణాలకు అవకాశం, అయినా ప్రమాద సూచక వారంగాన జాగ్రత్త అవసరం. స్త్రీలకు : సభా .మర్యాద కొందరకు, పత్రికా లేఖనమందు నూత్నావకాశాలు కొందరకు లభ్యం కానున్నవి, గ్రహించండి.

★ **తుల** : ఎంతో కాలంగా తటాపటాయించే వ్యవహారం, ఈ వారం అనుకూలంగా, ఆనందదాయకంగా సానుకూలం కానున్నది. 'శుక్ర శనివారాలు' మరీ యోగదాయకాలు, కొందరు పోగొట్టుకున్న ఉద్యోగాలందు మరలా చేరగలుగుతారు. స్త్రీలకు : వృత్తియందు పెంపు.

★ **వృశ్చికం** : పెద్దలవలన మేలు జరుగుటకు, గృహోపకరణాలు చేకూర్చుకొనుటకు, అసాధ్య విషయం సాధన గావించుకొనుటకు, నూతన మిత్ర సందర్శనమునకు అనుకూలం. వ్యవహారం ఏదయినా యింకా పరిష్కారం కాకుంటే 'శనివారం' ముగియగలదని గ్రహించండి. స్త్రీలకు : ఉద్యోగాభివృద్ధి, ధనలబ్ధి.

★ **ధనుస్సు** : చాల కాలంగా పరిష్కారంకాని వ్యవహారం ఏదైనా ఉంటే వారాంతంలో పరిష్కారం కాగలదు. అవకాశవాదులను దాపున చేర్చకండి, వ్యాపారరీత్యా దూరప్రాంతాలకు ప్రయాణించే అవకాశమున్నది, గ్రహించండి. స్త్రీలకు : నగలు సేకరించుకొనుటకు, ఉద్యోగమందు పెంపునకు అవకాశం.

★ **మకరం** : ఇటీవల మీరాశించిన విధంగా ఉద్యోగ వృత్తులందు మేలు జరుగలేదు గదా! ఇకచూడండి. వారాం తంలో మీ అభీష్టం నెరవేరుతుంధి. కొందరకు నూతన మిత్ర సంపదయో, నూతన మార్గాన ధనలబ్ధియో చెప్పదగిన వారం. స్త్రీలకు : కొందరు సొంత యింటిలో చేరే అవకాశమున్నది.

★ **కుంభం** : గ్రహించండ, గ్రహానుకూలం తక్కువ. అనుకొన్నరీతి ఏది జరగక పోవటం గ్రహిస్తారు. ముఖ్యంగా కావలసిన వస్తుసేకరణకు అనుకూలం. అంతో యింతో ఆదాయం లభించకపోదు. బంధువులతో మనస్పాపం సమసిపోగలదు. స్త్రీలకు : సుఖశాంతులు, బంధువర్గీయులవలనఅనుకూలతకవకాశం.

★ **మీనం** : మీ ఆరోగ్యమందు లోపం గమనించ గలుగుతారు. ఔషధసేవ కొందరకు తప్పకపోవచ్చు. ఏదో ఒక విషయంలో సాయం చేస్తామన్నవారు చెప్పకుండా తప్పించుకొంటారు. నూతన వ్యాపారం చేయాలనే సంకల్పం సానుకూలమయ్యే వారం, గ్రహించండి. స్త్రీలకు : ఉద్యోగమందు కించిత్తు పెంపు లభ్యం కాగలదనే వార్తవింటారు.

—విద్వాన్ కోట ˘త్యరంగయ్యశాస్త్రి

# వ్యక్తిగతం



డాక్టర్ ఏరిల్ పాట్రిక్ బెన్‌సన్ (33) మిలాన్ నించి ఫిజియో థెరపీలో డాక్టరేట్ పట్టా పుచ్చు-కున్న వారు. టూటికోరిన్‌లో జన్మించిన ఈయన అక్టోబర్ 1979లో శ్రీలంకలోని జాఫ్నా నించి ప్రపంచ పాద యాత్రని మొదలు పెట్టారు.

వికలాంగుల సంక్షేమం కోసం ఈ పాద-యాత్రని జరుపుతున్నట్లు ఆయన అన్నారు. ప్రపంచరికార్డ్‌ని స్థాపించాలనీ, తన అను-భవాలని ఒక పుస్తకంగా రాయాల్లని వుందనీ ఆయన చెప్పారు. ఆయన ఇప్పటి వరకు భారత్, నేపాల్, భూటాన్, టిబెట్‌లని సందర్శించారు. దాదాపు 25,843 కి. మీ. దూరం ప్రయాణం చేశారు.

ఈ పాదయాత్రకి సాక్ష్యాధారాలుగా 3843 పోలీస్‌స్టేషన్‌లలో సంతకాలు చేసారు. ధన సహాయం అందినప్పుడు దానిని టూటికోరిన్ చిరునామాకి పంపిస్తున్నానని, ధాన్యం, బట్టలు, గృహోపకరణ వస్తువులూ దాతలు ఇచ్చినపుడు వాటిని పేదలకు పంచిపెడుతున్నా-నని ఆయన పేర్కొన్నారు. పవిత్రమైన ఈ ఆశయసిద్ధి కోసం తాను వివాహం కూడా చేసుకోకూడదని నిశ్చయించుకున్నట్లు తెలి పారు.

బెన్‌సన్ రోజుకి 65 నించి 100 కి.మీ. దూరం నడుస్తారు. ప్రస్తుతం పళ్ళు, బిస్కట్లు, ద్రవ రూపంలో ఉన్న ఆహారాన్ని మాత్రమే ఆయన తీసుకొంటున్నారు. లగేజ్‌ని మోయడానికి ఆయన ఒక సైకిల్‌ని కూడా వెంట తెచ్చు-కున్నారు!

పాకిస్తాన్‌ని దాటి పశ్చిమాసియా, యూరోప్‌కి వెళ్ళిపోతున్న బెన్‌సన్ 1995కి తిరిగి బంగ్లాదేశ్ చేరుకోవటంతో ఆయన ప్రపంచ పాద యాత్ర పూర్తి అవుతుంది ... ☐

# ఏకాంతసేవ

## కప్పగంతుల మల్లికార్జునరావు

టీవీ చూచి చూచి కళ్ళు గుంటలు పడ్డాయి సుధాంశుకు. మనసు మొద్దుబారింది.

పత్రికలు, పుస్తకాలు బల్లమీద చాలా వున్నాయి. కానీ వాటిని తాకాలంటే భయం వేస్తోంది. వార్తలన్నీ వక్రదంతాలు– బొమ్మలన్నీ అస్తి పంజరాలు–కధలు రక్త సిక్తాలు– నవలలు కామ శాస్త్రాలుగా కన్పిస్తున్నాయి.

'అమ్మో. వద్దు వద్దు' అనుకొంది సుధాంశు.

యీ పుస్తకాలు, పత్రికలు, టీవీ రేడియో ప్రోగ్రామ్‌ల నుంచి విముక్తి కావాలి. మనసుకు రిలీఫ్ కావాలి.

కానీ ఎలా? ఏదీ మార్గం?

ఆమె కిటికీలో నుంచి క్రిందికి చూచింది.

జనం....జనం.... పరుగులెత్తే జనం

వెర్రెత్తిన వాహనాలు.....

మనసులో మాట చెప్పుకోటానికి మనుష్యులే కరువవుతే ఎలా?

సుధాంశు అసలు సిసలు కోనసీమ గ్రామంలో పుట్టింది.

ఎటుచూచినా ఏపుగా ఎదిగిన కొబ్బరి చెట్లు..... పిల్ల కాలువలు.... పచ్చటి పైర్లు......

ఇరవై సంవత్సరాలు ఆ వాతావరణంలో పెరిగిన ఆమెకు వైవిధ్యం కావాలని పించింది. యింతలో తండ్రి ఆమెకు పెళ్ళి సంబంధాలు చూడసాగేడు.

ఆయన ధనవంతుడు. పైగా యిద్దరు కొడుకుల తర్వాత పుట్టిన ఏకైక పుత్రిక. గారాబాల పట్టి.

చుట్టుపక్కల గ్రామాలలో, బస్తీలలో వారి సంబంధాలు బోలెడన్ని వచ్చాయి. ఆస్తి పాస్తులకి లోటు లేదు. అందాలు సర్దుకోవచ్చు. కానీ వైవిధ్యం?

నాలుగైదు సంబంధాలు తిరగగొట్టింది.

తండ్రికి మతిపోయింది.

'నాన్నా, జీవితమంటే పిల్లకాలువలు..... కొబ్బరి చెట్లు.... వరి చేలేనా? ప్రపంచం చాలా పెద్దది నాన్నా. నేనింక యీగ్రామాలలో బ్రతకలేను. మహానగరాలలో శేషజీవితం 'ఎన్‌జాయ్' చేద్దామని వుంది' అంది తండ్రితో.

'అదేమిటే సుధా. వొక్కగానొక్క ఆడపిల్లవు. నిన్ను అంతంత దూరాలకు పంపించి మేం వుండగలమా?' తల్లి పాత్ర ప్రవేశించి రచయిత రాయని డైలాగ్ అంది.

'యిదమ్మా మీ అమ్మ వరస! వెంకటాపురం, సంకటాపురం సంబంధాలు నీకు చేయమని రాత్రిళ్ళు నన్ను నిద్ర పోనీయకుండా వొకటే అల్లరి చేస్తోంది మీ అమ్మ. అందుకే యీలాంటి సంబంధాలు తెచ్చాను. నాకసలు ఏ ఇంజనీర్నో అల్లుడు కావాలనివుంది. నా అల్లుడు , కూతురు, బొంబాయి, ఢిల్లీ, కలకత్తాలలో వున్నారని చెప్పుకోటం నాకు మాత్రం గొప్పకాదూ? యిక మీ అమ్మ మాటల్ని 'వీటో'చేసి పారేసి, నీ కోరిక, నా కోరిక తీరే సంబంధం తెస్తానుండు'

'కానీ అమ్మాయిని నెలకోసారైనా చూడందే నేనుండలేను. ఛస్తాను'

'చచ్చేవాళ్ళెవరూ ముందుగా నోటీసు యిచ్చి చావరు. నువ్వు అసలు చావవు. నువ్వు చస్తానన్నా నేను చావనివ్వను. ఆ భయం అక్కర్లేదు. అంతగా కావాలంటే వో హెలీకాప్టర్, మీ నాన్న నడిగి కొనుక్కో. వారం వారం బొంబాయో కలకత్తానో వెళ్ళి కూతుర్ని చూచుకొచ్చుకో. కావాలంటే నీకోసం నేనో త్యాగం చెయ్యగలను. ఆ విమానం నడపటం నేర్చుకొని నీ హెలీకాప్టర్‌కి పైలేట్ నయి నిన్ను అక్కడికీ యిక్కడికీ తిప్పుతాను. ఏం సరేనా? యిక నీ కందిరీగ వాయిద్యం ఆపు'.

'ట్రింగ్.... ట్రింగ్' ఫోను మోగింది.

'నాకు ఫోను చేసే నాధుడెవరబ్బా!' అనుకొంటూ కిటికీ దగ్గరి నుంచి కదిలింది.

ఏమో! నాధుడు–గురునాధుడే– ఫోను చేసే డేమో! హాయిగా కొంత కాలక్షేపం. ఫోను ఎత్తింది ఆశగా.

'హలో మిస్ కౌల్. రాత్రికి మన ఎంగేజ్‌మెంట్ గుర్తుందికదా? ఫైవ్ స్టార్‌లో రూమ్ బుక్ చేసేను. యీరాత్రి కొత్త రుచులు చూస్తావు. వస్తావుగా?' ఇంగ్లీషులో అవతల వో పురుషకంఠం మత్తుగా అంటోంది.

గుండె గుభేలు మంది. ఛటుక్కున ఫోను పెట్టేసింది. అమ్మో! ఫోనులో ఎనెన్ని ధుర్మార్గాలు జరిగిపోతుంటాయి?

అంతలోనే ఆమెకు 'బోరు' గుర్తొచ్చింది. చిన్న చిలిపి ఆలోచన వచ్చింది.

ఫోన్ ఎత్తి ఏవో కొన్ని నెంబర్లు తిప్పింది.

'హలో' వో ముసలి పురుషకంఠం పలికింది.

'హలో . దిస్ యీజ్ మిస్ కౌల్. రాత్రికి ఫైవ్ స్టార్‌లో రూమ్ బుక్‌చేసేవా తాతయ్యా?'

'ఫైవ్ స్టార్‌లో , రూమా? ఎందుకు?'

'వొక పురుషుడు స్త్రీని అడగాల్సిన ప్రశ్నకాదు తాతయ్యా అది ?

జీవితం......

రసం..... రసం....

నవరసం

నీకప్పుడే నీరసం

మరిచావా మన సరసం.....?"

'యింతకీ నువ్వెవరి వమ్మాయ్? నీ ఫోన్ నెంబరెంత? సర్దాగా మాట్లాడుతున్నావా?నిజంగానే మాట్లాడుతున్నావా?'

ముసలి ముండాకొడుక్కి ఎంత ఆశ?

నిజంగా మాట్లాడుతున్నానంటే ఏమంటాడో ?

'సారీ మిస్ కౌల్. కాస్తంత ముసలితనం వస్తోందికదూ? పైగా ఎందరు ఆడవాళ్ళతో ఎన్నెన్ని అనుభవాలో? ఎవరెవరోగుర్తుండి చావటం లేదు. నిన్ను చూస్తే గుర్తు పట్టగలనులే. రూమ్ బుక్‌చేసి ఫోను చేస్తాను. నీ నెంబరు చెప్పు. లేకపోతే యిప్పుడే మాయింటికి వచ్చేయ కూడదూ? యింట్లో యిప్పుడు నేనొంటరిగానే వున్నాను'

'షటప్.....' కోపంగా అనేసి ఫోను పెట్టేసింది సుధాంశు.

'యీ మగ**వారు** అంతా యింతే. చచ్చేముందు కూడా పరాయి ఆడది కన్పించి ప్రేమగా పలకరిస్తే లేచి కూర్చుని మీసాలు మెలేస్తారు. ఛీ ఛీ.....'

అటూ యిటూ అసహనంగా తిరుగుతుండగా ఆమెకు గురునాథం గుర్తొచ్చాడు.

తండ్రి ఏరికోరి తనకని తీసుకొచ్చిన భర్త అతను. పుట్టింది గ్రామంలో నే అయినా అయిదో సంవత్సరం వయస్సు వచ్చిన దగ్గరినుంచి అతను టౌన్లు, పట్టణాలు తప్ప గ్రామం మొహం చూడలేదు.

కాన్వెంట్ చదువులు.... ఇంగ్లీషు ఆలోచనలు.....

తెలుగు మర్చిపోయాననటం పెద్ద హోదాగా ఫీలవుతాడతను. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, చేస్తూ, బిజీగా వున్నట్లు నటించటం అతని హాబీ. గ్రామాలంటే– ఆ వాతావరణ మంటే, అతనికి అలెర్జీ, దుర్వాసనలు గల గాలి పీల్చందే అతని గుండె నిండదు. శబ్దాలు వినందే నిద్ర పట్టదు. ఎండాకాలమైనా సూటు వెసుకోనిదే స్వేచ్ఛగా వుండదు. వాతావరణ కాలుష్యానికి అలవాటు పడి పోల్యూటే అయిపోయిన జీవి!

అయితే అతని దగ్గర వొక్క గొప్ప లక్షణం వుంది.

తన జీవన విధానం గొప్పదని అతను అడిగినా

అడగక పోయినా అందరికీ చెప్తాడు తను గొప్పవాడినని అతనితో అతను మనస్ఫూర్తిగా అనుకొంటాడు అవసర మైనప్పుడు పైగా బల్లగుద్ది మరీ చెప్పుకొంటాడు.

సుధాంశు అతనిపై పై ఆకర్షణలకు లొంగి పోయింది.

బొంబాయి, కలకత్తా లాంటి మహానగర్వాల్లో జీవితాలను గురించి అతను వర్ణించి చెప్తుంటే, అతని భార్యగా, తన భవిష్యత్తును పంచరంగుల్లో చూచుకొంది

అతడికి భార్య అయింది

తండ్రి డబ్బుతో అతడితో 'హనీమూన్' ఎంజాయ్ చేసింది.

అంతవరకూ హాయిగానే వుంది

హనీమూన్ అయ్యాక నేరుగా బొంబాయి చేరేరిద్దరూ.

బొంబాయిలో వో కంపెనీలో ఇంజనీర్ వుద్యోగం




అతనిది. నెలకి నాలుగు వేల రూపాయల జీతం వస్తుంది

'నా మొగుడికి నాలుగు వేల రూపాయల జీతం తెల్సా? సంవత్సరానిక్కాదు నెలకు. ఆనెలలో ముప్పై రోజులున్నా ముప్పై వొక్క రోజులున్నా," ఇరవై తొమ్మిది , ఇరవై ఎనిమిది రోజులున్నా లెక్కలేదు నాలుగు వేలూ యిస్తారు. తెల్సా?' స్నేహితురాళ్లతో పెళ్లికి ముందు గొప్పగా చెప్పుకొంది సుధాంశు.

బొంబాయిలో ఆభవనాలు ఆ బస్సులు ఆ కార్లు. ఆ రోడ్లు.

టాక్సీలో కూర్చుని ఆ మహానగరాన్ని, తన గ్రామంతో పోల్చుకొని, తాను యీ నగర వాసి కాబోతున్నందుకు గర్వించింది

'యిదే మన భవనం' టాక్సీదిగి అన్నాడు గురునాధం-గర్వంగా

ఎదురుగ్గా వున్న ఆరంతస్తుల భవనం తనదే నన్నంత గొప్ప విశ్వాసంతో అన్నాడతను ఆక్షణంలో సుధాంశు కూడా ఆ భవనానిక తనే యజమానురాలయినట్లు ఫీలయింది

'లిఫ్ట్' ఎక్కేరు

ఆ లిఫ్ట్ పైకి వెళ్తున్నంత సేపూ తాను స్వర్గలోకానికి వెళ్తున్నట్లు ఫీలయింది ఆమె

'యిది అయిదో అంతస్తు అదుగో- అదే మన అపార్టుమెంటు-'

అపార్టుమెంట్ చిన్నదే కానీ అభావన ఆమెకు కలగలేదు మొదట్లో

ఆమె, గ్రామంలో తమ భవంతితో, ఆ అపార్టుమెంట్‌ని పోల్చుకొంది

బెడ్ రూమ్స్ రెండు- డ్రాయింగ్ రూమ్- కిచెన్. ఎక్కడికక్కడ పేర్చినట్లున్న వస్తువులు. ఫ్లవర్ వాజ్‌లు .. కార్పెట్లు .. టీవీ . టెలిఫోన్ .. ఫ్రిజ్.. సింక్‌లు

అధునాతనంగా వున్న యీ యింట్లో జీవించటం ఎంత అదృష్టం?

కాలికి మట్టి, కావాలన్నా అంటదే!

'డింగ్ డాంగ్ డింగ్ డాంగ్ ..' కాలింగ్ బెల్

శబ్దం విన్పించి ఆలోచన చెదిరింది. ఎలక్ట్రానిక్ గడియారం చూచింది.

యింకా మధ్యాహ్నం పన్నెండు గంటలయినా కాలేదు

మరో ఆరు గంటలు గడిస్తే కానీ గురునాథం యింటికి రాడు కదా? యిప్పుడు వచ్చిందెవరు?

'డోర్ –ఐ ' లొ నుంచి వాకిట్లోకి చూచింది ఎవరో యిద్దరు స్త్రీలు

అమ్మయ్య! ఎన్నాళ్ల కెన్నాళ్లకి తన యింటికి స్త్రీలంటూ వచ్చారు?

అసలు ఆడవాళ్లతో మాట్లాడి ఎన్నాళ్లయిందో?

ఎవరో వాళ్ళు? ఎవరయితేనేం? బహుశా పక్క అపార్టుమెంటులోవాళ్లో, లేకపోతే గురునాథం సహ వుద్యోగుల భార్యలో అయివుంటారు

ఏ పేరంటానికో పిలవటానికి వచ్చివుంటారు

సుధాంశు గుండె వొక్కక్షణం చెప్పరాని ఆనందంతో నిండి పోయింది.

ఆమెకు చిన్నప్పటి నుంచి గలగల మని స్నేహితు రాళ్లతో మాట్లాడే అలవాటు. పేరంటాలకు వెళ్లటం అంటే ఆమెకు పండుగే. అక్కడ వూళ్లో ఆడంగులంతా కలుస్తారు. కబుర్లకు కొరవే వుండదు.

ఏమైనా యిన్నాళ్లకు తన తలుపు తడుతున్న పేరంటాన్ని వదులుకోకూడదు. వెళ్లాలి. పరిచయాలు చేసుకోవాలి. సర్దాగా మాట్లాడాలి

తలుపు తెరిచిందామె.

'రండి రండి....' ఆమె అలవాటుకొద్దీ తెలుగులో అంది.

వచ్చిన వారిద్దరి మొహాలలో వెంటనే వచ్చిన మార్పు ఆమె కనిపెట్టింది.

'కమిన్ కమిన్.... వెల్‌కమ్....' ఇంగ్లీషులో అంది.

వారు నాలుగడుగులు వేసి లోపలికొచ్చారు.

'ప్లీజ్ టేక్ యువర్ సీట్. ఐ విల్ బ్రింగ్ సమ్ డ్రింక్స్....' హడావుడి పడిపోతూ అంది సుధాంశు.

'సారీ. ఎక్స్‌క్యూజ్ అజ్. నో టయిమ్. యిదిగో రసీదు. మిస్టర్ ఛటోపాధ్యాయ గారు ప్రామిస్ చేసిన చందా యిప్పిస్తే వెళ్తాం. మీదగ్గర కలెక్ట్ చేసుకోమని చెప్పేరు వారు. మేము.....'

మతిపోయింది సుధాంశుకు. హుషారు, వుత్సాహం అనే మంట మీద చల్లని నీళ్ళు కుమ్మరించినట్లయింది.

వాళ్లేదో సంక్షేమ సంఘానికి చెందిన వారు పేరంటానికి పిలవటానికి వచ్చిన వారుకాదు. మిస్టర్ ఛటోపాధ్యాయ యిస్తానన్న విరాళం వసూలు చేసుకోటానికి వచ్చిన వారు.

"మిస్టర్ ఛటోపాధ్యాయ! ఆయనెవరు?"

యిద్దరు స్త్రీలు మొహ మొహాలు చూచుకొన్నారు.

"యిది ఎన్నో ఫ్లోర్?"

"అయిదు."

"దెన్ –సారీ. ఆరో ఫ్లోర్ అనుకొన్నాం. టయిమ్ వేస్ట్..." గునగున నడుచుకొంటూ వెళ్లిపోయారు.

నీరసంగా కుర్చీలో కూలబడ్డ సుధాంశుకు కొంత సేపటికి కొత్త ఆలోచన వచ్చింది. కాలక్షేపానికి సర్దాగా 'కాలింగ్ బెల్' ఆట ఆడుకొంటే ఏం?

"ఆ భవనంలో అన్ని అపార్టుమెంట్సువున్నా పక్క అపార్టుమెంట్ వారితోనే పరిచయం కాలేదు ఆమెకు. నేమ్‌బోర్డ్సు చూచి ఫలానా వారిల్లు అనుకోవాల్సిందే. తనకి తానుగా పలకరిద్దామనుకొన్నా ప్రతివారు బిజీనే ఎప్పుడూ.

ఒక్కొక్క యింటికి వెళ్లి కాలింగ్ బెల్ నొక్కి వాళ్లకి కనపడకుండా దాక్కుంటేసరి. వాళ్ల బిజీ ఏమిటో తేలిపోతుంది. ఎవరు పిల్చారో తెలియక వెతుక్కొని ఛస్తారు. వాళ్లలా తికమకపడుతుంటే ఎంత సర్దాగా వుంటుంది?

ఆమె తలుపు తీసుకొని ఎదుటి అపార్టుమెంట్ సిన్హాగారి కాలింగ్ బెల్ నొక్కి ఛటుక్కున తన యింట్లో కొచ్చి తలుపు వేసుకొని డోర్ ఐ కన్నంలో నుంచి చూడసాగింది.

యిప్పుడు మిసెస్ సిన్హా బయటకు రావాలి. వచ్చి ఏం చేస్తుందో?

కానీ మిసెస్ సిన్హా ఎంతకీ బయటికి రాలేదు.

మళ్ళీ...మళ్ళీ...నాలుగు సార్లు కాలింగ్ బెల్ నొక్కాక ఆమెకు అనుమానం వచ్చింది. బోర్డు చూచింది.

మిస్టర్ అండ్ మిసెస్ సిన్హా 'అవుట్' –

మరి లోపల ఎవరున్నట్లు? వుండి తలుపు తియ్యకుండా ఏం చేస్తున్నట్లు? అలవాటైన గ్రామ పద్ధతిలో ఆమె తలుపుల్ని బాదింది.

తలుపు తెర్చుకొంది. వో నడివయస్సు స్త్రీ– జుత్తు చెదిరిపోయి, జాకెట్ హుక్స్ వూడిపోయి, రొప్పుతూ రోస్తూ...పనిమనిషో ఏంపాడో?

"మిస్టర్ అండ్ మిసెస్ సిన్హా యింట్లో లేరు. బయటికెళ్లేరు" హిందీలో అంది.

"నువ్వెవరు? యిన్నిసార్లు పిలిచినా పలకలేదు. ఏం చేస్తున్నావ్?"

"నిద్ర పోతున్నాను. నేనీ యింట్లో కుక్ ప్లస్ సర్వెంట్ మైడ్ ప్లస్ వాచ్‌మెన్ ప్లస్..."

"చాల్లాలు. అన్ని ప్లస్‌లు వద్దు. యింట్లో యింకా ఎవరో వున్నట్లుందే! మైనస్సా? ప్లస్సా? అద్దంలో చూచుకో. నీ మొహం నిద్ర పోయి లేచినట్లున్నదో, మరేం పని చేసినట్లుందో తెలుస్తుంది.

"అబ్బే..యింట్లో ఎవరున్నారు? ఎవరూ లేరు. నేను నిద్ర లేచి వస్తున్నాను. యింతకీ మీరెవరు? మేమ్‌సాబ్‌కు ఏం చెప్పమంటారు?"

"నువ్వేం చెప్పనక్కర్లేదు. చెప్పాల్సిందేదో నేనే చెప్తాలే" ఆమె తన అపార్టుమెంట్‌లోకి వచ్చి భళ్ళున తలుపు వేసింది.

"మహానగరంలో ఏ యిల్లు చూచినా ఏమున్నది గర్వకారణం? రంకు పురాణాలు. రంకు భాగవతాలేనా?" అనుకొంటూ తలుపు రంధ్రంలో గుండా చూచింది.

ఎవరో వో యాభై ఏళ్ల వ్యక్తి హడావుడిగా సిన్హా యింట్లో నుంచి బయటికి పోతుండటం కన్పించింది.

"ఛీ ఛీ..." అనుకొంటూ ఆమె వెళ్లి ఫోను ఎత్తి భర్తకు రింగ్ చేసింది. నెంబర్ ఎన్‌గేజ్డ్ –

"నాన్సెన్స్..." ఆమె కోపంగా అనుకొంది.

కొంత సేపటి క్రితం వరకు ఆమెకు బోర్ కొట్టూ వుంది. యిప్పుడు కోపంగా కూడా వుంది. మనసంతా అసహ్యంతో నిండింది. తనకి ఎవరో వో నరుడి తోడు కావాలి. తన అసహనాన్ని, కోపాన్ని, బోర్‌ను ఎవరికో చెప్పుకొని కడిగేసుకోవాలి.

ఆమె స్వభావసిద్ధంగా ఎక్స్‌ట్రోవర్ట్. చిన్నప్పటి నుంచి తోడు వుంటే కాని స్కూలు కెళ్లేదికాదు. అన్నం తినేదికాదు. సినిమాకి వెళ్లేది కాదు.

అలాంటిది బొంబాయి వచ్చాక –

అపార్టుమెంట్‌కు బందీ అయిపోయింది. ఏకాంత సేవ ఆరంభమయింది.

రాత్రి వండి ఫ్రిజ్‌లో దాచిన అన్నం తిని పొద్దున ఎనిమిది గంటలకల్లా కంపెనీకి వెళ్లిపోతాడు గురునాథం. మళ్లీ వచ్చేది ఆరు దాటితేనే. వొక్కోసారి పది, పన్నెండు కూడా దాటుతుంది. యింత సేపు ఏం పని చేస్తాడో?

'మా కంపెనీ యిక్కడ వుందనుకొన్నావేంటి?పాతిక మైళ్ల దూరంలో వుంది. వెళ్లాలి– రావాలి. పైగా నాదేమన్నా గుమాస్తా వుద్యోగం అనుకొన్నావా? ఇంజనీర్‌ని. వెరీ ఇంపార్టెంట్ పర్సన్‌ని. తెల్సా?'

"మీ ఇంపార్టెన్స్ మీరు చూచుకొంటే సరిపోతుందా? వొంటరిగా యీ గదిలో నా గతేమిటి?"

"గదా? యిది అపార్ట్‌మెంట్. ఫర్నిష్డ్ అపార్ట్‌మెంట్. హాయిగా టీవీ చూడవచ్చు. ఫేన్ వేసుకొని ఫోమ్‌బెడ్ మీద పడుకోవచ్చు. తినవచ్చు. తాగవచ్చు. నాకు అప్పుడప్పుడూ ఏమనిపిస్తుందో తెల్సా. హాయిగా ఆడపుట్టుక పుట్టినట్లయితే యింట్లో తిని తాగి నిద్రపోయి, యించక్కా పుస్తకాలు చదువుకొంటూ టీవీ చూస్తూ కొసెట్లు వింటూ కాలం గడిపేవాడిని కదా అని?"

యింత చదువుకొన్న యీ వ్యక్తి బుద్ధి యింత వంకరా? యింత హ్రస్వదృష్టా యీతనిది?

క్రమంగా అతడిని గురించి చాలా తెల్సుకొంది.

అపార్ట్‌మెంట్‌తో సహా యింట్లో వొక్క వస్తువూ అతని స్వంతం కాదు.

అద్దెకు తీసుకొన్న ఫర్నిష్డ్ అపార్టుమెంట్ అది. అతని జీతంలో సగం ఆ అపార్టుమెంటుకే పోతుంది. మిగతా డబ్బులో కొంత స్వంత ఖర్చుకు వుంచుకొంటాడు. మిగతాది తనకిస్తాడు. ఆ యిచ్చిన దానితో తాను యిల్లు గడపాలి.

పాలు ఖరీదు. పెరుగు, నెయ్యి అసలు దొరకనే

దొరకవు.

కూరలు కొనటం వొకసర్కస్

ఒక బకెట్టులో డబ్బు వేసి, ఏమేం కూరలు కావాలో స్లిప్ రాసి పెట్టి బండివాడు వచ్చే సమయానికి క్రిందికి వదలాలి. పుచ్చులో ఎచ్చులో ఏవో వొకటి ఎలాగోలాగు తూచి లిస్టు ప్రకారం బక్కెట్లో కుమ్మరిస్తాడు.

ఆ కూరల్ని వెంకటేశ్వరస్వామి ప్రసాదం కన్నా జాగ్రత్తగా ఫ్రిజ్‌లో దాచుకొని వారం రోజులు వాడుకోటం–

నాలుగు వేల జీతం అనిపేరు. అంతకన్నా తన గ్రామంలో ఎలిమెంటరీ స్కూలు టీచరు బతుకు నయం.

కానీ యీ బ్రతుకునే తెగపొగడుతాడు గురునాధం.

గురునాధానికి ఫస్టు రాదు ఎందులోనూ. అతను సెకండు ప్లేసును అంగీకరించడు. సెకండ్ ప్లేస్‌లో వుండి ప్రధమస్థానంలో వున్నట్లు ఫోజుకొట్టి తృప్తి పడటం అతనితత్వం.

కంపెనీలో అతన్ని మించిన ఇంజనీర్లు ఎందరో వున్నారు. వారికి లక్షణంగా కంపెనీయే క్వార్టర్లు యిచ్చింది. వారంతా హాయిగా వుంటారు.

"ఏమిటో! దూరపుకొండలు నునుపు" అనుకొన్నా గుర్నాధం తత్వంతో సరిపెట్టుకోక చేసేదేముంది?

కానీ యీ వొంటరితనం– బోర్.

వీటికి తోడు యీ రంకు భాగోతం వొకటి.

యింత మంది మగాళ్ళు యిలా వుంటే తన భర్త వొక్కడే పవిత్రంగా వుంటాడన్న దానికి దాఖలా ఏమిటి?

అయిదోసారి రింగ్ చేస్తే కంపెనీకి కనెక్షన్ అంది

"హలో. గుర్నాధంగారిని వొకసారి పిలుస్తారా?"

"సారీ. ఆయన యివాళ శెలవు పెట్టేరు."

శెలవు పెట్టేరా? పెట్టి ఎక్కడికెళ్లేరు?

సుధాంశుకు మరింత టెన్షన్ పెరిగింది.

బోర్ తప్పించు కోటానికి మార్గాలు అన్వేషిస్తుంటే యివాళంతా యిలా జరుగుతున్న దేమిటి?

ఆమెకు ఆలోచించ బుద్దేయలేదు. నిల్చో బుద్దేయలేదు.

కిటికీ దగ్గరి కెళ్లి నిల్చుంది.

కచ్చ... కోపం.... అసహనం... అసహ్యం....

భర్త వచ్చిందాకాకాలం గడపటం ఎలా?

ఏదో చెయ్యాలి. కోపం తీర్చుకోవాలి. మనస్సుకు విశ్రాంతి కావాలి.

ఆమెకు క్రింద ఎక్కడో పోయే బిజీ మనుష్యుల మీద కచ్చ పుట్టింది.

ఏమిటో వారి కంత బోడి బిజీ?

అయిదో అంతస్తునుంచి వారిమీదికి రాయి విసిరితే ఎలా వుంటుంది?

అది తగిలిన మనిషి ఏం చేస్తాడు? రీ ఏక్షన్ ఎలా వుంటుంది?

ఆ ఆలోచన ఆమెకు కొత్త వుత్సాహాన్నిచ్చింది.

గబగబా లోపలికెళ్ళి ఫ్రిజ్ తెర్చి రెండు టొమేటోలు, వొక బంగాళా దుంప తీసుకొన్నది. బైనాక్యులర్స్ పెట్టుకొని క్రిందికి చూచి టొమేటో క్రిందికి వదిలింది.

అది వెళ్లి వో కారు టాప్ పైన పడింది. అయ్యో.... వో టొమేటో వేస్ట్.

రెండో టొమేటో మోటార్ బైక్‌పైన వెళ్తున్న అతని నెత్తిన పడింది.

మొద్దు వెధవ . దాన్ని తుడుచుకోనన్నా తుడుచుకోకుండా అలాగే వెళ్లిపోయాడు. యీసారి గురి చూచి పొటేటోను వదిలింది.

అది నెత్తికి తగిలిన వ్యక్తి తల ఎత్తి చూచాడు. అటూ యిటూ చూచాడు. ఎవర్నో ఏదో అడిగేడు. క్లాస్సేపు రభస జరిగింది. పైగా ఆవ్యక్తిది బట్టబుర్ర

గుడ్ గుడ్... మంచి కాలక్షేపం యిది.

అయితే పొటేటోలు, టొమేటోలు వేస్ట్ చేస్తే చచ్చేచావు. చిన్న చిన్న గులకరాళ్ళు సంపాదిస్తే సరి! కానీ రాళ్ళు.... ఎలా... ఎక్కడ దొరుకుతాయి?

ఆమె తలుపులేసి ఎలివేటర్‌లో క్రిందికి దిగింది.

* * * * *

కష్టపడి గుప్పెడు గులక రాళ్ళు లాంటి రాళ్ళు సంపాదించేప్పటికి చీకటి పడింది. అమ్మయ్య! గురునాధం వచ్చివుంటాడు. చిన్నగా వోరోజు గడిచి పోయింది. రేపు యీ రాళ్లను వుపయోగిస్తూ కాలక్షేపం చేయవచ్చు.

కానీ రాళ్ళు ఏరుకొంటూ, రాళ్ళు విసురుకొంటూ, ఎన్నాళ్ళు వొంటరి బ్రతుకు? తనకేం కర్మేమిటి? హాయిగా తన గ్రామంలో తనకు లేనిదేమిటి?

పోనీ గుర్నాధం చేత వుద్యోగాన్ని మానిపించి తమ గ్రామానికి వెళ్లి పోతే? గుర్నాధంతో వోసారి యీ ప్రసక్తి తెస్తే గ్రామాలను గురించి చాలా హీనంగా మాట్లాడేడు. గ్రామాలు రాజకీయంగా ఎంత కలుషిత మయినా, ఆర్థికంగా ఎంత విలువలు దిగజారి పోయినా, ప్రకృతి సిద్ధమైన సహజ సౌందర్యం కలుషితం కాలేదని తెలీదా అతనికి?

'ఏమైనా యికతను యీ బొంబాయిలో వుండలేదు. ఎలాగైనా అతగాడిని వొప్పించాలి. ఆ బోడి వుద్యోగంతో సంపాదించి యిక్కడ సుఖపడుతున్న దేమిటి? యింతకన్నా తక్కువ సంపాదించుకొంటూ ఎక్కువ సుఖంగా బ్రతక వచ్చు–తమవూర్లో–' ఎలివేటర్ పైకి వెళ్తుండగా పదే పదే అనుకొంది. ఫిఫ్త్ ఫ్లోర్‌లో ఆగే సరికి ఆ ఆలోచన బలపడింది.

ఆమె తలుపు తీసి లోపలికి ప్రవేశించి ఎదురుగ్గా కన్పించిన దృశ్యాన్ని చూచి వులిక్కి పడింది.

బెడ్స్ తడిసి వున్నాయి. టెలివిజన్ తడిసి వుంది. యింకా ఎన్నో.....

సీలింగ్ వైపు చూచింది. సీలింగ్ లీక్ అవుతున్నది. పై అపార్టుమెంటులో వారి నీరు అయాచికంగా తమ యింట్లోకి వచ్చింది.

'యిదో న్యూసెన్సా? లంచాలు తిన మరిగిన ఆఫీసరు, కారటం ఆరంభించిన సీలింగ్ వూరు కొంటాయా? సీలింగ్ లీకేజ్‌ని అరికట్టటం ఎలా? ముందు యీ కొంపలో సామాను చెడిపోకుండా సర్దటం ఎలా? సామాను డేమేజ్ అవుతే చెవులు పిండి డబ్బు వసూలు చేస్తాడు యజమాని'

ఆమె మనసు వంకాయలా వుడికి పోతోంది.

రాత్రి పది గంటలు దాటేక వచ్చాడు గురునాధ్

నాలుగు ప్రశ్నలు వేసి అతను అబద్ధాలు



చెప్పున్నాడని గ్రహించింది.

'మీ ధోరణి కూడా యీ మహానగర జీవితం లాగేవుంది. అనవసరపు హంగామా – హడావుడి. బొంకు– రంకు. మీరీరోజు శలవు పెట్టేరు. అయినా యిప్పుడు వచ్చారు. యీ అపార్టు మెంట్‌లో వొంటరిగా నేనెలా బతకాలి? ఆ టీవీలు, ఫోనులు, పుస్తకాలు, రేడియోలు మనిషికి సాటా? మనిషి మాట్లాడుతాడు. మనిషి వింటాడు. అవి వినలేవు. మాట్లాడుతుంటే మనం వింటూ కూర్చోవాలి. నేనిక్కడ వుంటే మూగ దాన్నయిపోవటం ఖాయం. మీరు మరింత పోల్యూట్ కావటం అంతకన్నా ఖాయం యీమాత్రం బతుకు మావూళ్ళో బతక్క పోము. రేపే పోదాంపదండి'

' అలాగే పోదాం . పద' అనటం గురునాథం స్వభావానికే విరుద్ధం

అతను తన జీవితాన్ని పొగుడుకొన్నాడు. బొంబాయి లైఫ్‌ను ఆకాశానికి ఎత్తేశాడు.

రెండు చేతులు కలిస్తే చప్పట్లేగా?

వోట్లాడి పోట్లాడి సుధాంశుకు నోరు నొప్పి పుట్టింది. తెగిందాకాలాగేతత్త్వం కాదామెది.

పక్కమీద వాలబో తుండగా సీలింగ్ లీకేజ్ గుర్తుకొచ్చింది.

యీ దెబ్బతో గురునాథం చిత్తవుతాడు

'మన మధ్య యీ తగాదా ఎందుకండీ. నేనో

# ఏకాంత సేవ

పందెం వేస్తాను. అంగీకరిస్తారా?'

'వో. చెప్పు. ఏపందెమైనా నేను గెలవగలను'

'అయితే అటు చూడండి. పై అంతస్తులో వారింట్లో నీరు మన యింట్లోకి ఆ కప్పుకుండా దొంగతనంగా వస్తున్నాయి. యివాళ పరుపు, టీవీ లాంటి వస్తువులు తడిసేయి. రేపు వారు స్నానం చేసిన నీరు మనల్ని తడిపి పావనం చేయవచ్చు. ఆ సీలింగ్.....'

'సీలింగ్ లీక్ అవుతున్నదని బొంబాయి వదలి వెళ్తామా? ఎలుకలున్నాయని యిల్లుకి నిప్పు పెట్టిందిట నీలాంటి పల్లెటూరి యిల్లాలే ఎవ్వతో. ఆ సీలింగ్ కారకుండా వారం రోజుల్లోపల చేయగలను' గొప్పగా , గర్వంగా అన్నాడు గుర్నాథం.

'సరే. వారంలోగా సీలింగ్‌ను మీరు బాగు చేయించ గలిగినట్లవుతే నేను మీ మాట విని యిక్కడే వుండిపోతాను. లేకపోతే మీరు నేను చెప్పిన మాట విని యీ బొంబాయిని వదిలి మన వూరికి రావాలి. యిదీ పందెం. అంగీకరిస్తారా?'

'అంగీకరిస్తాను. గెలుస్తానుకూడా'

' ఆ సంగతి వారం తర్వాత చూచుకొందాం. ముందు రేపు తడిసిన వస్తువుల్ని ఎండబెట్టాలి. సూర్యుడిని ఎక్కడ పట్టుకొంటారో, ఎండను ఎంతకు కొంటారో ఆలోచించండి ముందు.'

యిద్దరూ ఆ రాత్రికి నేలమీదనే పడుకొన్నారు.

తెల్లారేసరికి గుర్నాథం చప్పగా తడిసి వున్నాడు.

వర్షం కురిసినట్లు సీలింగ్‌లో నుంచి జలధార–

'అయ్య బాబోయ్......' అంటూ సిక్స్ ఫ్లోర్‌కు పరుగెత్తేడు గుర్నాథం.

* * * * *

గడువు తీరటానికి యింకొక్క రోజేవుంది.

కానీ 'సీలింగ్ లీక్' సమస్య పరిష్కారం కనుచూపు మేరలో లేదు. సరికదా– అనేక సమస్యల్ని అనేక మందికి తెచ్చిపెట్టింది . జటిలమయి కూర్చుంది

అసలా అపార్టుమెంట్స్ గవర్నమెంటు వారు కట్టేరు. అప్లై చేసుకున్నవారికి నెల వాయిదాల మీద చెల్లించు కొనే పద్ధతి పైన లాట్ల సిస్టంలో అల్లాట్ చేసేరు.

అలా ఆ అపార్టుమెంటుకి వచ్చిన వారందరూ ధనవంతులే. వారికి యిళ్ళు అప్పటికే వున్నాయి. ధనాన్ని వస్తు రూపంలో మార్చుకోటానికి యిళ్ళు కొని అద్దెల కిచ్చారు.

యిళ్ళు కొన్నవాళ్ళంతా చేరి ఆ కాంప్లెక్స్ సమస్యల్ని చూడటానికి వొక కమిటీని ఏర్పాటు చేసుకోవాలనుకొన్నారు మొదట్లో. కానీ రాజకీయ

కారణాల వల్ల కమిటీ ఏర్పడింది కాదు. ఎవరిల్లు వారిదే. ఎవరద్దె వారిదే.

యిల్లు లీక్ అయిన మర్నాడే గుర్నాధం ఫేక్టరీకి శలవు పెట్టి చచ్చీచెడీ యింటి యజమానిని పట్టుకొని సమస్యను చెప్పేడు. పై పోర్షన్ యజమాని ఎవరో కనుక్కోటానికి ఆయనకు మూడు రోజులు పట్టింది.

తీరా చూస్తే ఆ యజమాని యీ యజమానికి వ్యాపారంలోనూ, యిటు రాజకీయాలలోనూ బద్ధ శత్రువే.

"నీ సీలింగ్ కారితే నేనేం చేయను. చేయాల్సిందేదో నీ ఖర్చుతో నువ్వే చేసుకో" ఆరో అంతస్తు అయిదో అంతస్తుతో వుంది.

"అదేం కుదరదు. నువ్వు నీ గ్రౌండ్ ఫ్లోర్‌ను డేమేజ్ చేయటం వల్ల నా సీలింగ్ లీక్ అయింది. కనుక ఆ బాధ్యత నీదే. పైగా మా యింట్లో పడుతున్నది నీ యింట్లో నీరే"

"నా గ్రౌండ్‌ఫ్లోర్‌ను నా యిష్టం వచ్చినట్లు చేసుకొంటా. నా నీటిని నా యిష్టం వచ్చినట్లు వాడుకొంటా. నీ పెత్తనం ఏమిటి? నీ రాష్ట్రీకం ఏమిటి?"

అయిదో అంతస్తులో ఆ సీలింగ్‌ను ఆరో అంతస్తు వారు బాగు చేయించాలా? అయిదో అంతస్తు వారే చేయించుకోవాలా?

పెద్ద చర్చావేదిక అయింది. లాబుక్కులు తిరగేస్తున్నారంతా.

అటు వారు- యిటు వీరు కోర్టుకు వెళ్ళటానికి సిద్ధపడుతున్నారు.

"పూర్వం జాయింటు ఫేమిలీల వ్యవస్థలో అన్నదమ్ములే కొట్టుకొన్నారు. యిప్పుడు ఆ జాయంటు ఫేమిలీ వ్యవస్థ పోయింది. నగరాల పుణ్యమా అని జాయింట్ వోనర్‌షిప్‌లు, జాయింట్ నివాసాలు వచ్చాయి. ముక్కూమొహం తెలియని వాళ్ళు కొట్టుకు చచ్చారంటే చావరూ?"

"చస్తే చచ్చారు. కానీ ఆ లీకేజ్ అలాగే కంటిన్యూ అయి ఆరో అంతస్తు అయిదో అంతస్తు మీద కూలితే మనమంతా చస్తాం కదా?" క్రింది అంతస్తుల వాళ్ళతో సహా భయపడసాగేరు.

పార్టీలు...ప్రభుత్వం...కోర్టులు....లేబర్ యూనియన్ నాయకులు...యీ ఆరు రోజులూ బాగానే కాలక్షేపం అయింది సుధాంశుకు.

లీకేజ్ – దానికి సంబంధించిన సమస్య పెద్దదయ్యే కొద్దీ ఆమెకు ఆనందం పెరగ సాగింది.

"రేపే గడువు దినం. యింకా ఆశ వుందా? వోడిపోతే రేపు సాయంకాలానికే ప్రయాణం" ఆ రాత్రి హెచ్చరించింది సుధాంశు భర్తను.

ఆ రాత్రి గురునాధం నిద్ర పోలేదు.

తెల్లవారక ముందే 'డ్రింగ్ డ్రింగ్' అంటూ కాలింగ్ బెల్ శబ్దం. అతను లేచే లోగానే సుధాంశు వెళ్ళి తలుపు తీసింది.

"నాన్నా – వచ్చావా?" అంటూ తండ్రిని కౌగిలించుకొని ఏడ్చేసింది.

"ఏముయిందమ్మా? అంత అర్జంటుగా రమ్మని టిలిగ్రాం ఎందుకిచ్చావు?"

"మీ అల్లుడు పందెంలో వోడిపోయాడు నాన్నా. మేము యీ సాయంకాలం బొంబాయి వదిలి మీతో వస్తున్నాం. యిక్కడ యిక నేను వుండలేను నాన్నా. యీ మూగనోము నాకు చాతకాదు" అంటూ బాధంతా చెప్పుకొంది బరువును కొంతైనా దించుకొంది.

"ఏమయ్యా అల్లుడు గారూ?" అన్నట్లు అల్లుడి వంక చూచాడు ఆయన.

"మీ అల్లుడు గారు స్వతహాగా మంచివాడే నాన్నా. ఆయన పెరిగిన వాతావరణమే మంచిది కాదు.పోల్యూటెడ్ ఆలోచనలు- వూహలు. నేను కూడా, పుస్తకాల్లో, సినిమాల్లో, నగర జీవితాల్ని చూచి దీపం పురుగులా ఆకర్షింపబడ్డాను, వొక బలహీన క్షణంలో. కానీ యీ భవనాలు...యీ లైట్లు...యీ రణగొణ- యీ వేగం మిధ్యాబింబాలు నాన్నా. యీ బిబాలు ఆకర్షించి ఆరాటపెడతాయి మనిషిని. మన గ్రామాల్లో ప్రవృత్తి, మనిషిని, ఆదరించి అనునయిస్తుంది. యిక్కడ పేదవాడికి బ్రతుకు దొరుకుతుంది. ధనవంతుడుకి కృత్రిమ సుఖాలు కొనుక్కోగలడు. కానీ మధ్యతరగతి జీవులకు మిగిలేది- ఆరాటం, అశాంతి మాత్రమే నాన్నా. మనకు దొరికే సహజ సుఖాలు యిక్కడ ఎవరికైనా ఎంతో కష్టపడితే కాని లభించవు. మధ్యతరగతి వాళ్ళ బ్రతుకు –లీక్ అవుతున్న ఆ సీలింగ్ చందం నాన్నా. వాళ్ళ జీవితాలకి పగుళ్ళే కాని- అతుకులు, రిపేర్లు వుండవు."

"మధ్యతరగతా? నాలుగు వేలు సంపాదించే నా అల్లుడు...."

నాన్న అమాయకత్వానికి ఏడ్చే వోపిక లేక నవ్వింది సుధాంశు.

"మన వూళ్ళో నాలుగు వేలకింకా విలువ వున్నది నాన్నా. యిక్కడ నాలుగు వేలు మన వూళ్ళో నాలుగొందలతో సమానం.. ఆ విషయం యిక్కడి కొచ్చాక నాకు తెల్సింది. సర్దాగా యీ వూళ్ళో రేట్లు చెప్పనా నాన్నా..." అంటూ యింటి అద్దె నుంచి కూరగాయలు దాకా ధరవరల్ని చెప్పింది.

"అయితే యిన్నాళ్ళు నాకెందుకు రాయిలేదమ్మా? ఎలా బ్రతకగలిగేరు మీరు?"

"మీ రిచ్చిన నగలున్నాయిగా నాన్నా..." అంటూ బావురుమంది సుధాంశు.

"అల్లుడు యీ సాయంకాలానికే మన ప్రయాణం"

మామగారి ఆర్డర్‌కి తలవంచక తప్పలేదు గురునాధం.

"ఏమండీ. నాన్నగారిని పిలిపించేనని కోపం వచ్చిందా నా మీద?"

రైలు కదిలేక, వెనక్కి వెనక్కి వెళుతున్న నగరాన్ని చూస్తూ అంది సుధాంశు. పట్టపగలులా ప్రకాశించే నగరం క్రమంగా దూరమయింది. చీకట్లోకి చూస్తూ చాలా సేపు మాట్లాడలేదు గుర్నాధం.

"లేదు సుధా. నువ్వు మంచి పని చేసేవు. చీకటి అందం చీకటిదే. సూర్యుడి అందం సూర్యుడిదే. రెండు అందాలు ఆస్వాదించగలిగితేనే జీవితానికి సాఫల్యత. పగలు రాత్రి కూడా దీపాల వెలుగులోనే బ్రతక వల్సి రావటం ఎంత దురదృష్టకరమో నాకు యిప్పుడు తెల్సి వస్తోంది. చీకట్లో నుంచి వెలుగులోకి తీసికెళుతున్న నిన్ను చూచి నేను గర్విస్తున్నాను" అంటూ అత నామెను దగ్గరికి తీసుకొన్నాడు.

"అమ్మో! ఏమోననుకొన్నా. మీరూ బరువు డైలాగులు చెప్పగలరే. నన్నడిగితే యిదంతా ఆ అపార్టుమెంటులు కట్టిన కాంట్రాక్టరు గారి చలువ. ఆ లీకేజ్ లేకపోతే బొంబాయి వదలటానికి మీరింత సులభంగా వొప్పుకొనేవారే. నాకు తెలీదూ మీ సంగతి?" అంటూ ఆమె అతడి గుండెల్లోకి వొదిగి పోయింది. "నా మూగనోముకు వుద్వాసన తీరిపోయింది" చెవిలో గుసగుసలాడింది."ఏకాంత సేవ బదులు యిక పతి సేవ చేస్తావా?" అతను గుసగుసలాడేడు.

రైల్లో మిగతా ప్రయాణీకులు తమని చూస్తున్నారన్న స్పురణన్నా లేదు- ఆ దంపతులకి. "ఆనందమే అందం –స్వేచ్ఛే ఆనందం! స్వచ్ఛతే పరమానందం –సహజత్వమే బ్రహ్మానందం" అని వారి మనసులు డ్యూయెట్లు పాడుకొన్నాయి. యాంత్రిక నాగరికతా నీకో నమస్కారం. మహానగరమా నీకింక గుడ్‌బై...శలవ్. □

## ప్రకృతి–వికృతి

ఎడిగే చెట్టు
చేరువలోని
మొక్కకు
గొడుగేసి
ఎదగనివ్వడు
ఇది ప్రకృతి
పెరిగే మనిషి
అక్కున ఉన్న
మనిషికి
టోపీ వేసి
ఎదగనివ్వడు
ఇది వికృతి

—సి. వి. సర్వేశ్వర శర్మ

# నాకు నచ్చిన నా కార్టూన్

ప్రముఖ కార్టూనిస్టులు వేసిన ఎన్నో మంచి కార్టూన్లు నాకు ఎంతో నచ్చినవి వున్నాయి. వాటిని సులభంగా సూచించగలను, కానీ నాకు నచ్చిన నా కార్టూన్ అనే సరికి కొంత ఇబ్బంది పడక తప్పలేదు. నాకు నచ్చని నా కార్టూన్లు అసలు నేను వేసే ప్రయత్నం చెయ్యను. వేసిన వాటిలో బాగా నచ్చినవి వ్యాఖ్య లేనివీ వున్నాయి వ్యాఖ్యతో వున్నవీ వున్నాయి. నా వ్యాఖ్య రహిత కార్టూన్లలో హాస్యానికన్నా సెటైర్‌కి ప్రాధాన్యత ఇవ్వడం నాకు అలవాటు ఇక్కడ హాస్య ప్రధానంగా వుండే నావ్యాఖ్యగల కార్టూన్‌ఉదహరిస్తున్నాను.

ఈ కార్టూన్ నేను మరిచి పోలేని నా కార్టూన్లలో నాకు చాలా ఇష్టమైనదని అనడానికి చాలా కారణాలున్నాయి. ఈ కార్టూన్ ప్రచురింప బడిన కొద్ది రోజుల్లో చాలా మంది పాఠకుల దృష్టిని ఆకర్షించి పత్రికా ముఖంగా వారి ప్రశంసలు పొందింది. కార్టూన్ వేసినపుడు బొమ్మలకి వ్యాఖ్యకి ఎటువంటి సంబంధం వుండాలన్న విషయం చర్చకు వచ్చిన రెండు మూడు సందర్భాల్లో ఈ కార్టూన్ కొందరు ప్రముఖ రచయితలు, సంపాదకుల చేత ఉదహరింప బడింది. ఇదిలా వుండగా, ఈ కార్టూన్ అచ్చయిన నెల తిరిగేలోపున ఒక ఫోటో స్టూడియో యజమాని ప్రజలంతా తమ స్టూడియోని ఈ కార్టూన్‌తో పోల్చి పగలబడి నవ్వుతున్నారని, ఈ కార్టూన్ కటింగ్ తనకు పంపించి ఏడిపిస్తున్నారని–దాని క్కారణం ఇందులో చూపించిన కౌంటర్ తన స్టూడియోలో వున్న కౌంటర్ బల్ల మాదిరే వుండడమే కాకుండా పేరులో కూడా దగ్గర సంబంధం వచ్చేసిందని విచారిస్తూ నామీద, ఈ కార్టూన్ ప్రచురించిన పత్రిక మీద రు.20,000 లకు పరువు నష్టం దావా వేస్తున్నట్టు రిజిస్టర్డు నోటీసు పంపడం జరిగింది. మా కెవరికీ అటువంటి దురాశయం ఏదీ లేదని మరుసటి సంచికలో ప్రచురించడంతో ఆయన చల్లబడ్డారనుకోండి–ఐతే, అంతమందిని నవ్వించి, అంత చరిత్ర సృష్టించిన ఈ కార్టూన్ నేను ఎలా మరువగలను?ఈ కార్టూన్ 1969 ఆగస్టు రెండవ వారంలో విడుదలయిన "ఆంధ్ర ప్రభ" సచిత్ర వారపత్రికలో ప్రచురింప బడింది. అసలు నా ప్రథమ కార్టూన్ ప్రచురించి, నన్ను కార్టూనిస్టుగా ప్రోత్సహించి నాకో మంచి గుర్తింపు నిచ్చింది ఆంధ్ర సచిత్ర వార పత్రిక కాగా, నా కలం పేరు 'శంకు గా నామకరణం చేసింది ఆంధ్ర జ్యోతి సచిత్ర వార పత్రిక సంపాదకులు శ్రీ పురాణం గారు, వీరందరికీ పత్రికా ముఖంగా మరోసారి నా కృతజ్ఞతలు.

–శంకు





# రేడియో, టీవీ ద్వారా విద్య

మురళి

హైదరాబాద్, జూన్ 28


















సీరియల్

# జిగి-బిగి

## ఎమ్.హరా

(గత సంచిక తరువాయి)

**ఈ శతాబ్దపు ఉత్తమ** మహిళ అవార్డుకోసం వీధి తలుపులు బార్లా తెరిచి ఎదురు చూస్తున్నది సాధ్వి.

**యువరాణి ఆ** యింటిముందు హెలికాప్టర్‌లో దిగలేదు. రోడ్డుపై పరిగెడుతున్న **అయిదారు** కారులుమాత్రం, ఆమె మడికట్టుకుని ఎదురు చూసేది **తమ కోసమని అపోహపడి** ఆగాయి. సారీ చెప్పింది సాధ్వి. కార్లు కనుమరుగైనాయి.

ఎట్టకేలకు **ఆమె** నిరీక్షణ ఫలించింది. ఆ యింటిముందు ఆగింది పోలీస్ **జీప్. తన అవార్డు** పోలీసు సెక్యూరిటీతో వచ్చినందుకు గర్వంతో ఆనంద పడిందామె. **ఆమె** ఆనందం ఎటువంటి అలికిడీ లేకుండా గాలిలో కలిసిపోవడానికి ఎక్కువ టైం తీసుకోలేదు. సర్చ్ వారంట్ చూపించి యిల్లంతా కలియదిరుగుతున్నారు పోలీసులు.

విషయం అర్థం చేసుకున్న సాధ్వి ఫోన్ కాల్స్ చేస్తూనేవుంది. ఆమె అందం, పలుకుబడి, డబ్బూ పరాభవం పొందుతూనే వున్నాయి. ఆ వూరిలో ఎదురులేని స్త్రీ సేవికననే ఆమె గర్వం గాడి తప్పింది. చేతులు నెప్పులు పుట్టగా రిసీవర్‌ని యథాస్థానంలో వుంచి పోలీసు ఇనస్పెక్టర్ వంక పొంచి పొంచి చూడసాగింది. మాటలు కలుపసాగింది. ఆమె అందించే అందమైన ఖరీదైన మాటల మూట ముడి విప్పకుండానే తన డ్యూటీని సక్రమంగా నిర్వర్తిస్తున్నాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్. అదపా దడపా నోటితోనేగాక లాఠీతో కూడా ఆమెని అదిలిస్తున్నాడు.

అసలేం జరిగిందంటే కల్తీ సారా కేసులో డైరెక్టుగా యిరుక్కున్నాడు కొండలరావు. జైలు కటకటాలు లెక్కబెట్టడం యిష్టంలేక, ప్లీడర్ల బీరువాలు కరెన్సీ నోట్లతో తుడిచి వారి మన్ననా, ఆదరణా పొందాడు. యిది చాలా బరువైన కేసు. కరెన్సీ కాగితాలతో లాభం లేదు. నాలుగైదు బంగారపు కడ్డీలతోగాని ఈ కేసుని లొంగదీసుకోలేమని అసహాయత వ్యక్తపరిచారు ప్లీడర్లు. బ్లాక్‌మనీకోసం యింటికి వచ్చిన కొండలరావు పోలీసులకి వెరచి లెట్రిన్‌లో దూరాడు.

మూసివున్న లెట్రిన్ తలుపుపై పోలీసుల కళ్లు పడ్డాయి. వారి అనుమానం బలపడింది. తలుపులు బ్రద్దలు కొట్టారు. కొండలరావుని పోలీసులు చుట్టు ముట్టేశారు.

కష్టం, సుఖం కలిసి అనుభవిస్తామని పెళ్ళినాడు ప్రమాణం చేసిన భర్త, నేడు తనని వొంటరిగా విడిచి జైలు కెళ్తున్నందుకు అతిక్రూరంగా బాధపడి కనీళ్ళు పెట్టుకుంది సాధ్వి. తనని కూడా అరెస్టు చేసి జైల్లో పతిసేవ చేయడానికి పిసరంత అవకాశం కల్పించమని ఇనస్పెక్టర్‌ని ప్రాధేయపడింది.

ఆమె పతిభక్తికి తల్లడిల్లిన యిరుగూ, పొరుగూ, యిటువంటి స్త్రీ తమ మధ్య మసలకూడదని "ఈమెని కూడా అరెస్టు చేయండిసార్. గొప్ప స్త్రీ సేవిక.పైగా పతిభక్తి ఎక్కువ. అరెస్టు చేయండిసార్....", అంటూ హుషారుగా అరిచారు. ఈలలు వేశారు.

"చట్టం వొప్పుకోదు. ఈమె పతిభక్తితో స్త్రీ సేవ చేస్తున్నట్టు సాక్ష్యాధారాలు కావాలి. కోర్టులో నెగ్గాలి. అప్పుడుగాని జైలుకి ఆహ్వానించలేం" అంటూ తన అసహాయిత వ్యక్తపరిచాడు ఇనస్పెక్టర్.

కోర్టులూ, సాక్ష్యాలు అనగానే తమ యింటి తలుపులు మూసుకున్నారు యిరుగూ పొరుగు.

పోలీస్ జీప్ కదిలింది.

"వెళ్ళిపోతున్నారా..." అంటూ రెండు చేతులు పైకెత్తి "గోవిందా" అంటూ భర్తకి నమస్కరించింది సాధ్వి.

"నీ పతిభక్తి మండిపోను. బ్రా కూడా వేసుకోలేదు. ముందా పమిటి సర్దుకో. బొడ్డు క్రిందికి జారుతున్న చీరెని పైకి లాక్కో" అంటూ చిటపటలాడుతూ సంకెళ్ళ చేతులతో తల బాదుకున్నాడు కొండలరావు.

"నా చీరె, జాకెట్ శీలాన్ని శంకిస్తున్నారా? పతిదేవుడులాంటి మీరు నాకు దూరమైతే చీరా, జాకెట్ దగ్గరగా ఎలా వుంటాయండీ? మీరేం బెంగపడవద్దు. మిమ్మల్ని నేను విడిపిస్తాను. యువరాణి సంయుక్త రానీయండి. చూపిస్తా నా తడాఖా. సతీ సావిత్రిలా మిమ్మల్ని దక్కించుకుంటాను" అంటూ గాఢంగా ఏడస్తూ యింట్లోకి వెళ్ళింది సాధ్వి.

కష్టాల్లో, బాధల్లో అందరికీ గుర్తుకు వచ్చే దేవుడు ఆమె క్కూడా గుర్తుకు వచ్చాడు. దేవుడి పాటల పుస్తకం అప్పటికప్పుడు కొనుక్కుని దేవాలయంలో చేతులెత్తి గానం చేయాలనే దురాలోచన ఆమెని ఆవరించింది. గబగబా పట్టు చీరెని చుట్టబెట్టుకుని, హార్మోనియం పెట్టెని నెత్తిన పెట్టుకుని గుడికి బయలు దేరింది. మిట్ట మధ్యాహ్నంవేళ గుడి తలుపులకి తాళం వుంటుందని గుర్తుకురాగా, నిరుత్సాహపడి గది గుమ్మం దగ్గరే హార్మోనియం పెట్టెపై చతికిలబడింది.

**ఆమెకి** వచ్చిన కష్టం కళ్ళారా చూడలేని దేవుడు, కొంతమంది స్త్రీల **రూపంతో** బిలబిలా ఆ యింట్లో ప్రవేశించాడు., యువరాణి సంయుక్త పంపించారంటూ **ఆమెకో** శుభలేఖ యిచ్చాడు.

కడివెడు కష్టాల నీళ్ళలో చిటికెడు పంచదార సుఖం కలిపి ఇచ్చినట్లుయింది సాధ్వికి. ఆమె గబగబా ఆ ఉత్తర సారం త్రాగసాగింది.

**అత్తయ్యా...** శ్రీమతి సాధ్వీమణీ.... అందుకో ఈ శతాబ్దపు ఉత్తమ మహిళా అవార్డు. ఈ లేఖని తెచ్చిన పాతికమంది స్త్రీలు జీవితంలో పరాజితులు. కాళే కడుపుని నింపుకోవడానికి పతితులైనారు కొందరు. కట్న కానుకలు

జరిగిన కథ :–8 సీనియర్ క్లర్క్స్ పరీక్ష రాయడానికి వెళుతున్న అమ్మాయి , అబ్బాయికి పరిచయం అవుతుంది. 'ప్రజాసేవ కంపెనీ' నడిపే బ్రహ్మచారి ఉభయానందం తన పినతల్లి మనుమరాలు సౌభాగ్యవతిని చేరతీసాడు. సౌభాగ్యవతికి పెళ్లి చేసి ఆమె భర్తని దత్తత చేసుకోవాలని ఉభయం కోరిక. సూర్యనారాయణ మనుమరాలు అమ్మాయి. సౌభాగ్యం, చిరంజీవి ప్రేమించుకున్నారు. అమ్మాయి, అబ్బాయి ప్రేమించుకున్నారు. సౌభాగ్యవతి పేరుతో అబ్బాయి రూముకి వెళ్లిన అమ్మాయి అతనికి ఉభయానందం ప్లాను వివరించింది. అంతా విన్న అబ్బాయి ఇదంతా తన తండ్రి ఆడుతున్న నాటకమేనని తన కథంతా చెప్పసాగాడు. అబ్బాయి తండ్రి ప్రజాపతి దగ్గరకి వెళ్లి అబ్బాయి తన కోడలు సౌభాగ్యవతిని ప్రేమిస్తున్నాడని చెప్తాడు ఉభయం. ఉభయం పెద్దఎత్తులో వ్యూహం పన్నుతున్నాడని పసిగట్టిన ప్రజాపతి తను వచ్చి అబ్బాయి ప్రేమను పరీక్ష చేసి పెళ్లి చేస్తానని చెప్తాడు. అబ్బాయి, అమ్మాయి, చిరంజీవి, సౌభాగ్యం ఏదో ఒక సాకుతో హైదరాబాద్‌కి చెక్కెయ్యాలని ప్లాను వేస్తారు. ప్రజాపతి కొడుకు దగ్గరకి వస్తాడు. ఆయన అమ్మాయినే సౌభాగ్యవతిగా భావిస్తాడు. నాటకం ప్రారంభమవుతుంది. మాటలతో బురిడీ కొట్టించి ఉభయం ఆస్తిని తన పేర రాయించుకుంటాడు అబ్బాయి. రెండు ప్రేమ జంటలు హైదరాబాదు చేరాయి.

పుట్టింటినుంచి తేలేక భర్తలచేత బహిష్కృతులైనారు మరికొందరు. చాలామంది విధి వంచితులు!? ఈ సమాజం తయారు చేసిన అనాథలు, అభాగ్యులు.

వీళ్ళందరి గురించి నాకన్నా మీకే బాగా తెలుసు. వీళ్ళ పేర్లు చూపించి మీరు దండిగా దోచేస్తున్నారు, గ్రాంటులు దండుకున్నారు. వాళ్ళకి ఎటువంటి మేలు చేయకుండా, మరింత అధఃపాతాళానికి నెట్టేసి, మీరు అందలం ఎక్కుతున్నారు. అవినీతిగా బ్రతుకుతూ, సన్మానాలు చేయించుకుంటూ, కుడి ఎడమ అనే బేధం లేకుండా భోగలాలస జీవితాన్ని రెండు చేతులా జుర్రుకుంటున్నారు. యింతవరకు బాగానే సాగింది. రోజులన్నీ వొకే విధంగా వుండవు. అందుకే జాగ్రత్తగా చదవండీ ఉత్తరాన్ని.

అవార్డు రూపంలో వచ్చిన ఈ పాతిక మంది అభాగ్యుల జీవితాలు సరిదిద్దండి. వాళ్ళ చీకటి జీవితాల్లో ఆశాజ్యోతులు వెలిగించండి. డబ్బుకీ, పలుకుబడికీ మీకు కరువులేదు. మీరు మనసు మార్చుకుని మంచిగా ప్రవర్తిస్తే మన్నిస్తాం. మీకు సన్మానం చేస్తాం.

లేకపోతే మీరు చేసిన దర్మార్గాలకి సాక్ష్యం చెప్పడానికి చిరంజీవి సిద్ధంగా వున్నాడు. ఈ అవార్డు రూపంలో మీకో అవకాశం యిస్తున్నాం. బుద్ధిగావుంటే మీకు జైజైలు పలుకుతాం. లేకుంటే జైలుకి పంపిస్తాం.

యిక చివరిమాట. సామర్లకోట యువరాణి లేదు. సంయుక్త లేదు. యిప్పుడు మీ అబ్బాయికి తోడుగా వుంటున్న నేను మాత్రం నిజం. మిగతాదంతా మిథ్య. మీ కళ్ళు తెరిపించడానికి ఆడిన నాటకం.

యిక వుంటాను. కలుస్తాను మిమ్మల్ని సన్మాన సభలో, లేదా కోర్టు ఆవరణలో

మీ కోడలు,
సౌభాగ్యవతి.
కేరాఫ్ ప్రజాసేవ కంపెనీ.

ఉత్తరం చదవడం పూర్తి చేసిన శ్రీమతి సాధ్వి కల్లు తాగని కోతిలా





గొంతులు వేస్తూ, "అంతా మోసం.... దగా.... కుట్ర...." అంటూ కేకలు వేసింది.

"అవును. అంతా దోపిడీ.... ఆత్మవంచన. నీచం." అంటూ అందుకున్నారు అక్కడున్న పాతిక మంది పతితలు, అనాథలు.

"ఒరేయ్.... ఉభయం.... నీ కీ రోజు నా చేతుల్లో మూడింది. పాతిక లక్షలపైచిలుకు ధర పలికే మా చిరంజీవిని మీ సౌభాగ్యవతి కొంగుకి ముడి వేస్తావా? సామర్లకోట నాటకం ఆడిస్తావా? అవార్డు అంటూ ఈ పాతిక మందిని నాపై రుద్దుతావా? వస్తున్నా, వస్తున్నా.... ఈరోజుతో నీ ఆటకట్టు-" అంటూ ఉద్రేకంగా ఉభయం యింటికేసి వురికింది సాధ్వి.

21

పదిహేను కేజీల చదువు (ఎల్. కె. జి. నుంచి బి. ఏ. వరకు) కన్నా, క్వార్టర్ పెగ్గుతో నిశాని సంపాదించిన రాజకీయ అనుభవం గొప్పదని నొక్కి నొక్కి చెప్పి అబ్బాయినీ, అమ్మాయిని హైదరాబాద్ పంపాడు ప్రజాపతి. తన గుండెలపై తన చేతులు మాత్రమే వేసుకుని నిద్రపోవడం అలవాటులేని ఆయన ప్రొద్దు పుచ్చడానికై వూళ్ళోకి వెళ్ళాడు.

ఎన్నికలు వస్తున్నాయి. నాయకులు తమ కొంపలకి వస్తారని వోటర్లు సంబరపడుతున్నారు.

**అబ్బాయికి పట్టం గట్టాలని ప్రతీ యింటికివెళ్ళి వోటర్ల యోగ క్షేమాలు మాత్రమే తరిచి తరిచి అడుగుతున్నాడు** ప్రజాపతి. చదువూ సంధ్యా లేని సర్పంచ్‌ని కావడంవల్ల **మీ బాధల** కష్టాలు చదువలేక పోతున్నానని వోటర్లముందు కన్నీళ్ళు పెట్టాడు. ఎం. ఏ. చదివిన మా అబ్బాయిని సర్పంచ్‌చేస్తే మీ కష్టాల కథలన్నీ యింటికి చేరుకుంటాయని వాగ్దానాలు చేస్తూ **మా అబ్బాయికే మీ వోటు అంటూ** ప్రచారం ప్రారంభించాడు.

**అపోజిషన్‌కి వత్తాసు** పలికే ఓ నిజాయితిపరుడు ప్రజాపతిని నడి రోడ్డుపై నిలేసి-"నువ్వీ రెండు పుష్కరాల వయసులో ఈ పంచాయితిని యింత **వెలగబెట్టావు. యిక మీ అబ్బిగాడు ఉద్ధరిస్తాడు"** అంటూ హేళన చేశాడు. **వెటకారం చేశాడు. అతని** గోలకి **ఆ** వూరి ప్రజలంతా అక్కడ గుమిగూడారు.

"చూశారుగా వీడి తలపొగరు. యిదంతా అపోజిషన్ సారా వగరు. రెండు పుష్కరాలుగా ఈ పంచాయితిని పాలిస్తున్న నేనేమీ చేయలేదా? మన **తాతలకాలంలో** ఈ వూళ్ళో రోడ్లు లేవు. నేను యిప్పటివరకు ఆరు వేల ఎనిమిది వందల ముప్ఫైరెండు మైళ్ళ మట్టిరోడ్డు వేయించాను. యిది అభివృద్ధికాదా? ఈ వూళ్ళో వొకప్పుడు పదిమంది పిల్లలకి టీచర్‌లేని స్కూల్ వుండేది. యిప్పుడు పదిమంది టీచర్లతో, స్కూల్ బిల్డింగ్ లేకుండానే, తగినంత మంది విద్యార్థులు లేకుండానే, చెట్లక్రిందే స్కూల్ పెరుగుతోంది. పరాయి దేశాల్లో పుష్కలంగా లభించే ఉద్యోగాలు మనపరం కావాలంటే ఆంగ్ల విద్య అవసరం. అందుకే మీకోసం నేను ప్రవేటుగా ఇంగ్లీసు మీడియం స్కూల్ నడుపుతున్నాను. యిందులో నా స్వార్థం లేదు, మీ పిల్లలకి పరాయి దేశాల్లో మంచి ఉద్యోగాలు రావాలనే తాపత్రయం తప్ప. యిది అభివృద్ధి కాదంటారా? ఆచారిగారి మాత్రలతో వైకుంఠయాత్ర చేయడం మన వూరి ప్రజల హాబీ! అది గత కాలం సంగతి. నేడు అటువంటి యాత్రలకి గుడ్‌బై చెప్పి, ఆర్. ఎమ్. పి. గారి (రూరల్ మెడికల్ ప్రాక్టీషనర్) యింటిముందు క్యూలో నిల్చుంటున్నారు మన వూరి ప్రజలు. యిది అభివృద్ధికాదా? మనకి కావలసినవి ఉపన్యాసాలు కావు. క్రియ.... క్రియ.... మన వూరిలో తగినంతమంది రోగులువుంటే గవర్నమెంట్‌తో పోట్లాడి పది పడకల ఆసుపత్రిని చిటికలో చంకనబెట్టుకు వస్తాను. దొనేషన్లు యిచ్చేదాతలుండాలి గాని ఈ క్షణంలో యిక్కడే కాలేజీకి శంకుస్థాపన చేస్తాను" అంటూ అతి ఆయాసంగా అపోజిషన్ వాడిని ఎత్తి పొడిచాడు.

"సైడు కాలువల మట్టిని రోడ్డుపై చల్లి అదే మట్టి రోడ్డంటున్నాడు. ఎండాకాలంలో ఎండిపోయే జండా చెట్టు దగ్గరున్న బావికి ప్రతీ సంవత్సరం అయిదు అడుగుల లోతు తవ్విస్తున్నట్లు లెక్కలు రాస్తున్నాడు. అంటే ఆ బావి లోతు యిప్పటికి రెండు వందల అడుగులు దాటి వుండాలి. మనం నలభై అడుగుల తాడుతో నీరు తోడుతున్న సంగతి అందరికీ తెలిసినదే! యికపోతే మన స్కూల్ టీచర్లు ఎల్లవేళలా జాయినింగ్ టైంలో వుంటారు. అంటే ట్రాన్స్‌ఫర్లు ఎక్కువని తాత్పర్యం. ప్రభుత్వం సప్లై చేస్తున్న మందులు షావుకారు షాపులో కాపురం చేస్తున్నాయి. మనకి పెద్ద పెద్ద రోగాలువస్తే పెద్దాసుపత్రిని తెరిపిస్తానని వాగ్దానం చేస్తున్న ప్రజాపతి మాటలు పెడచెవినబెట్టండి. కాలేజీ సంగతి దేవుడెరుగు. స్కూల్ బిల్డింగ్ శంకుస్థాపన రాయి గురించి చెప్పమనండి."

"ప్రజాపతి ఈ వూరిని అభివృద్ధి పరిచాడు. నేను కాదనడంలేదు. మనిషి పుట్టినప్పుడు మూరెడంత వుంటాడు. పాతికనిండే వేళకి బారెడంత పెరుగుతాడు. యిదీ అభివృద్ధి-" అంటూ అపోజిషన్‌వాడు గట్టిగా గేలి చేశాడు. జనం చప్పట్లు కొట్టారు.

ఆ అవమానాన్ని తట్టుకోలేక ఉక్రోషంగా ఆవేశపడుతూ యింటికి పరిగెత్తాడు ప్రజాపతి. ఆవురావురుమంటూ బ్రాందీ, విస్కీ వగైరా మందులు కొట్టేసి తన గ్రూపు గూండాలకి కబురు పంపాడు. తన ఉద్రేకపు వేడి చల్లారడానికి **తాజా** గాజుల సరుకు తెమ్మని దానయ్యని **తో**లేశాడు. ద్వంద్వార్థ పాటలతో తన **తాపానికి** సేద తీర్చాలని టేప్ రికార్డర్ ఆన్ చేశాడు. బూతు బొమ్మల పుస్తకం కోసం అటక ఎక్కాడు.

"మీరీ ప్రసిడెంట్ పదవి లేకుండా బ్రతకలేరా' కమ్మగా వినిపిస్తున్నది **అబ్బాయి** కంఠం. 'ఖుషీగా...హాయిగా.... ఈ దేశాన్ని ఏలేస్తూ బ్రతకమని....'

ప్రజాపతి కంఠం కంచులా వినిపిస్తున్నది.'

టేప్ రికార్డర్ గోలకి అటకమీద బూతు బొమ్మల పుస్తకం వెతుకుతున్న **ప్రజాపతి తల** గిరగిరా తిరిగింది. ఆయన దభేలుమని క్రింద పడ్డాడు. "ఆయనకి దెబ్బ తగిలిందని సానుభూతిగా ఒక్క క్షణం కూడా ఆగకుండా తన పని తాను చేసుకుపోతున్నది టేప్ రికార్డర్.

అబ్బాయిని సర్పంచ్ దారికి మళ్ళించమంటే, తండ్రి కొడుకుల మధ్య వైరం సృష్టించే సాక్ష్యంతో వ్యాపారం చేస్తున్న ఉభయానందంపై పురి తీసేంత కోపం వచ్చింది ప్రజాపతికి. యిదంతా ఉభయం పన్నాగమే ... వాడిచేత నిజం కక్కించాలని పిడికిలి బిగించి లేచాడు ప్రజాపతి. టేప్ రికార్డర్‌ని చంకన బెట్టుకుని ఉన్మాదిలా అడవూరికి పరిగెత్తాడు.

22

"నాయినా ... చూడబోతే నువ్వో కొత్త బిచ్చగాడిలా వున్నావు. వల బనీను కనబడేలా లక్నో లాల్చీ వేసుకున్నావు. నువ్వు కట్టుకున్న గ్లాస్కో పంచెలోంచి కొట్టచ్చినట్లు కనపడుతున్నది రెడ్ కలర్ డ్రాయిర్. జులపాల జుట్టుకి వేసిన రంగు వెలిసిపోయింది. బట్టలు మాసిపోకుండా ప్రజాసేవ కంపెనీ బోర్డుపై కూర్చుని నెత్తిపై చేతులు వేసుకుంటే నీకెవరు ధర్మం చేస్తారు నాన్నా" అంటూ దారిన పోయే కాషాయి కలర్ నైట్ గౌన్ ప్రశ్నించగానే ఫుట్‌పాత్‌పై కూర్చున్న **ఉభయానందం** తలని వొంచేశాడు. అభిమానపడి కళ్ళెర్రబరచడానికి కూడా **అతని** లొంట్లో రక్తంలేదు.

కాషాయి కలర్ నైట్ గౌన్ ధరించిన తెల్ల గెడ్డపు సన్యాసి తన దారిన తాను **పోకుండా** "ఏమయింది నాన్నా? వ్యాపారం దివాలా దీసిందా? ఉద్యోగం వూడిపోయిందా? కన్నకూతురికి పెళ్ళి చేసి యిలా రోడెక్కావా? కోడలి కొంగు వదలని కొడకు తన్ని **తరిమేశాడా**? పెళ్ళాం లేచిపోయిందా? నువ్వుంచుకున్న పిల్ల పరాయివాడిని మరిగిందా? సినిమా తీసి చేత చిప్ప కూడా లేకుండా యిలా మిగిలిపోయావా? నువ్వు కష్టపడి ఇంగ్లీషు కథని కాపీ చేసి రాసిన నవల **తిరిగివచ్చిందా**? ఎలక్షన్‌లో గెలిచి ఎం. ఎల్. ఏ. అయినా మినిస్టర్ రాలేదా? **రేసుల్లో** గుర్రం **తన్నేసిందా**? లక్ష రూపాయలు లాటరీ ప్రైజ్ వొక్క నెంబరులో **తప్పిపోయిందా**? నాన్నా ... ఈ బ్రతుకంతామిథ్య. పెళ్ళాం, పిల్లలు, పక్కింటి **ఆవిడా, ఆస్తి, అప్పులు**, ఉద్యోగం, వ్యాపారం, నిరుద్యోగం, ప్రేమా, వైరం, కటుంబనియంత్రణ ... కేబరా, బార్, బీరు ... అన్నీ మాయ. మనం కేవలం ఆటబొమ్మలం. విధి చేతిలో మరబొమ్మలం. అన్ని అనర్థాలకీ, దుఃఖాలకీ మూల

హేతువు కోరిక. కోరికలకి విడాకులిస్తే సుఖం సంతోషంగా కాపురం చేస్తుంది. అసలేమయింది నాన్నా ... నీ తోటి వాడిని అడుగుతున్నాను. కాదనకు. నిజం చెప్పు నాన్నా" అంటూ సానుభూతిగా ఫుట్‌పాత్‌పై చతికిలబడ్డాడు.

తాను మోయలేని అధిక దుఃఖపు భారం తగ్గించుకోవాలని సన్యాసి వోదార్పుని స్వీకరించాడు ఉభయానందం.

"పున్నామ నరకం నుంచి తప్పించుకోవాలనే ప్రలోభంతో, తద్దినాల పిచ్చితో ఓ అబ్బాయిని దత్తత చేసుకోవాలనుకున్నాను. పుత్రోత్సాహంతో కన్నూ మిన్నూ గానక నా ఆస్తంతా అతని పేరున రాశాను. ఇరవైయేళ్ళు కష్టపడి సంపాదించిందంతా అతనిపరం చేశాను. ఆ అబ్బిగాడు నా స్థిర చరాస్తులన్నిటిని సత్రకాయకి అమ్మేసి హైదరాబాద్ చెక్కేసాడు. నా ఆస్తిని ఆక్రమించిన సత్రకాయ నన్నిలా బజారుపాలు చేశాడు. కట్టు బట్టలతో తరిమేశాడు. అబ్బాయి ఎడ్రెస్ తెలియదు. కోర్టు కెళ్ళినా నా ఆస్తి నాకు దక్కదు" అంటూ వలవలా ఏడ్చేశాడు.

"మరీ అంతగా ఘాటుగా ఏడ్వకు నాన్నా. నీ కన్నీరు కాలవై ఏరులా పారుతుంది. ఏటిలో ఎగిరెగిరిపడుతున్న చేపపిల్లల్ని చూడగానే నా చిత్తం చలిస్తుంది. పడుచుపిల్ల గుర్తుకు వస్తుంది. మళ్ళీ సంసారకూపంలో కూరుకుపోతాను. నన్నిలా సన్యాసిలా బ్రతకనీ నాన్నా. నీలాంటి శిష్యుడి కోసమే నేను అన్వేషిస్తున్నాను. నేటికి నా తపస్సు ఫలించింది. నువ్వు దున్నపోతు మార్క్ ఫారిన్ బీడీలు తాగుతావా? అయితే నువ్వే నా శిష్యుడివి" అంటూ ఉభయాన్ని కౌగలించుకుని లాల్చీ జేబు తడిమాడు సన్యాసి.

"స్వామీ.... తమరు నాన్నా నాన్నా అని పిలుస్తుంటే నా వొళ్ళు పులకరిస్తున్నది."

"జీవాత్మకీ పరమాత్మకి బేధం లేదు. ఈ చరాచర సృష్టికి మూలకారణమైన, తల్లిదండ్రిలాంటి పరమాత్మని ఎదుట వాడిలో చూస్తాను. అందుకే నిన్ను నాన్నా అని పిలుస్తున్నాను. వర్షం రాకుండా నిన్ను వెంటనే బైరాగుల్లో కలిపేసి నా శిష్యుడిగా చేసుకుంటాను."

"నాకంత అదృష్టమా స్వామీ" బైరాగి టికెట్‌తో కాశీ వెళ్ళినా పిండాలు నేనే పెట్టుకుంటాను. నన్ను శిష్యుడిగా స్వీకరించు గురూ" అంటూ అమితానందంతో సన్యాసి పాదాలకి నమస్కారం చేయబోయాడు ఉభయం.

"శిష్యా.... నా పాదాలు తాకకు. కోరికని చంపుకోలేని ఒక మూఢుడు నా కాళ్ళని తాకితే నాకు కుష్ఠురోగం అంటుకుంది. నా పుండ్ల పాదాలు తాకిన నీ చేతులు కడుక్కోడానికి యిక్కడ నీళ్ళు లేవు. తెల్లని లాల్చీతో నీ చేతులు శుభ్రపరుచుకుంటే నేను చూడలేను" అంటూ ఉభయం జుట్టు పట్టుకుని పైకి లేపి సౌమ్యంగా అన్నాడు సన్యాసి.

"యింత జరిగినా నీ కింకా పిండాల కోరిక చావలేదు. కోరికకి మూల కారణం తెల్లని బట్టలు. అలా చెట్టు చాటుకి వస్తే నీకు సన్యాసి దీక్ష యిప్పిస్తాను. చిల్లుల డబ్బా చేతికిస్తాను. ఈ రోజుతో నా జన్మ సాఫల్యమయింది."

చెట్టు చాటుకు వెళ్ళారు యిద్దరు. కాషాయి కలర్ డ్రస్ విప్పేసి గోచీతో నిల్చున్నాడు తెల్ల గెడ్డపు సన్యాసి. తన తెల్లటి కవచం తొలగించడానికి అభిమానపడ్డాడు ఉభయం. ఎప్పుడో వొకప్పుడు కట్టె పుల్లతో కాలిపోయే తుచ్ఛమైన శరీరంపై వ్యామోహం పెంచుకోవడమే అన్ని అనర్థాలకి మూలమని హితబోధ చేస్తూ ఉభయం కట్టుకున్న బట్టలు వొలిచేశాడు సన్యాసి. తన కాషాయి డ్రస్‌తో అతన్ని అలంకరించాడు.

తదుపరి ఉభయం కాళ్ళకి మ్రొక్కుతూ "తెల్ల గెడ్డం లేదు గానీ తమరే నా గురువులు. అలా కాసేపుకూర్చో నాన్నా. పంగనామాలు పెడతాను" అంటూ గబగబా వైట్ డ్రస్‌ని వొంటికి తగిలించుకున్నాడు సన్యాసి. తెల్లబోయాడు ఉభయం. అతని తెలివికి అప్పుడే తెల్లారింది.

"నాన్నా.... నేనీలాంటి వైట్ డ్రస్‌లో టింగురంగాలా బజార్లవెంట బలాదూర్‌గా తిరగాలనే నికృష్టపు కోరిక నన్నెంతకాలంనుంచో పీడిస్తున్నది. లాల్చీ జేబు బరువుగానే వుంది. నేటికి నా కోరిక నెరవేరింది. నున్నగా గెడ్డం

# పునరాలోచన

నా కలల్లో నేను ఎక్కడో ఉన్నాను కానీ, ఒకసారి
మెలకువ వచ్చి చూస్తే ఎదుట నువ్వు మౌనంగా నిలబడి ఉన్నావు
ఈ జీవితంలోకి నిన్ను పిలుచుకుంటూ చాలా దూరం వచ్చాను
చాలా సార్లు విఫలమయ్యాను
పరిచయాల వంతెనపై రోజుల తరబడి
ప్రయత్నాల తాళ్ళను కట్టాను
తెల్లటి కాగితంపైనల్లటి అక్షరాలతో
నిశ్శబ్దంగా, నేను నీ కోసం చేస్తున్న తపస్సుకు కవిత్వమనే పేరు వచ్చింది
ఈనాడు నాకున్న ఆలోచనల్లా ఒకటే,
నీ రాకతో మొదలయిన అనుభూతి
ఎప్పుడు నిన్ను చేరుకుంటుందా అని!
అసంపూర్ణమయిన ఫలితానికి ఎప్పుడు
పరిపూర్ణత చేకూరుతుందా అని!

–పాలమూరి శ్యాంబాబు

గీయించుకుని రంగమ్మ కంపెనీకి వెళ్ళాలి.... బై.... బై.... టా.... టా...." అంటూ తుర్రుమంటూ వుడాయించాడు సన్యాసి.

సన్యాసి లీలలతో ఉభయం కడుపు కోపంతో కరకర మండింది. నెత్తి నోరు బాదుకుంటూ ఆ గెడ్డం వెంట పడడానికి సన్యాసి మోహం అడ్డు వచ్చింది.

23

ఎటుపోవాలో, ఏం చేయాలో పాలుపోక ఉభయం అటూ యిటూ చూస్తుంటే అతనికి కుడివైపు ప్రజాపతీ, ఎడమ వైపు శ్రీమతి సాధ్వి కనబడ్డారు. వారి బారినుండి తన కాషాయి రంగు మానం కాపాడుకోవడానికి ప్రజాసేవ కంపెనీ బోర్డుని అడ్డం పెట్టుకుని దుర్గంధ భరితమైన బాధ అనుభవిస్తున్నాడు ఉభయం.

ఉభయానందం యింటిని ఆక్రమించిన సత్రకాయ చిన్న సైజ్ యువ రాజులా వున్నాడు. అతను సూర్యనారాయణగారికి అమ్మాయీ అబ్బాయిల ప్రేమ కథ చెబుతూ మిగతా పిల్ల కథలు కూడా చెప్పాడు. తాను మళ్ళీ పెళ్ళి చూపులకి హైదరాబాద్ వెళ్తున్నట్టు చెప్పాడు. వీలైనంత త్వరలో హైదరాబాద్ వెళ్దామని తాతగారికి పూరట కలిగించాడు.

ఆ యింటిముందు ఆవరణలో సోఫాల్లో కూర్చుని రోడ్డుమీద జరుగుతున్న నాటకాన్ని మూకీ సినిమా చూస్తున్నారు సత్రకాయ, తాతగారు.

స్వంత యింటిని వదిలి ఫుట్‌పాత్‌పై తలని దాచుకున్న ఉభయం కథ, కమామీషు తెలుసుకోవాలని ఉవ్విళ్ళూరలేదు ప్రజాపతీ, సాధ్వి. అసలు ఎవరూ మాట్లాడుకోలేదు. ఎవరి పాపపు భయం వాళ్ళది. అందుకే పెదవి విప్పలేదు ఎవరూ. పెదవి విప్పితే ఎదుటివాడు గురువింద గింజ సామెత గుర్తు చేస్తాడని గాభరా.

**ఈ బైరాగితో దెబ్బలాటకి దిగితే తమ పరువూ ప్రతిష్ఠ సన్యసిస్తాయని అభిమానపడి వెనక్కి అడుగులు వేయసాగారు ప్రజాపతీ, సాధ్వి ఎదురెదురుగా. విడివిడిగా.**

**ఈ నాటకాలవాడిని జైలుకి పంపిస్తే తోడుగా తమని తీసుకెళ్తాడనే పిరికితనంతో ఉభయానికి దూరమైనారు వాళ్ళిద్దరూ.**

**"అవినీతి మార్గానికి స్వస్తి పలికి నీతికి స్వాగతం పలికితే మీకు జైజైలు**

## జిగిబిగి

చెప్పాను. లేకపోతే మీ కపటబుద్ధిని బంధించిన కౌసెట్సుని ప్రజలకి పంచిపెడతాను. మిమ్మల్ని జైలుకి పంపిస్తాను.... మీ అన్యాయపు ఆస్తిని ప్రజలపరం చేస్తానని" అబ్బాయి కంఠం టేప్ రికార్డర్‌లా ప్రజాపతి చెవుల్లో మారుమ్రోగుతున్నది.

నా అనేవారు లేరు కాబట్టే యిట్టే కాషాయి క్లాత్ చుట్టేసుకున్నాడు ఉభయం. తన విషయంలో అలా కాదు. తనకి వంశాంకురం వుంది.

అబ్బాయి తనలో మార్పు కోరుతున్నాడు. తనని కుటిలమార్గం నుంచి మళ్ళించడానికి సాక్ష్యం సృష్టించాడు. తాను మొండికెత్తి పదవిని తల కెక్కించుకుని అబ్బాయిని కాల రాచగలడా? అబ్బాయిపై పగ సాధించగలడా? నో... నో.... అలా చేయలేడు. తన కళ్ళముందే కన్ను మూసింది భార్య. అప్పుడు తాను కళ్ళు తెరవలేదు. యిప్పుడేనా మేలుకోవాలి. ఎప్పుడు వూడుతుందో తెలియని పదవి లేకుండా బ్రతకగలడు గాని పరుసవేదిలాంటి పుత్ర ప్రేమ లేకుండా తన జీవితానికి మనుగడ లేదు. అబ్బాయికోసం తాను మారాలి. ప్రజాపతి ఆలోచనలు వెలుగుని చూశాయి.

ప్రజల యోగక్షేమాలపట్ల పూర్తి పూచీ స్వీకరించడానికి సిద్ధమై ఆయన బక్కపాలెం వెళ్ళాడు.

సౌభాగ్యవతి రాసిన ఉత్తరం శ్రీమతి సాధ్వి కళ్ళలో నలుసులా మెదలుతూనే వుంది. బాధ పెడుతూనేవుంది.

తన వయసు తేటతెల్లం గాకుండా కన్న కొడుకుని దూరంగా వుంచి చదివించింది. కీర్తి వ్యామోహంతో కంటికి కనబడని యువరాణి సంబంధం స్థిరపరిచింది. సామర్లకోట ఆస్తిని బావుకుందామని కాపురం చేయడానికి తీరికలేని సంయుక్తని తన యింటి కోడలిగా ఆహ్వానించింది. తన కళ్ళు బార్లా తెరిచింది. సౌభాగ్యవతి. యిప్పటికే తాను చాలా నష్టపోయింది. అధిక సంపాదన క్రీడలో ఓడి జైలుపాలైనాడు భర్త. యిప్పుడు తాను మొండికేస్తే సభ్య సమాజం ఛీ.... ఛీ... అనేలా చిరంజీవి దూరమవుతాడు. తానీ కష్టాన్ని భరించలేదు. కొడుకుపై వైరం పెంచుకోలేక, మమకారం చంపుకోలేక, మనసు మార్చుకుంది శ్రీమతి సాధ్వి.

జీవితం కించపరిచిన పాతిక మంది స్త్రీలని ఆదరించి, తీర్చి దిద్దాలని యింటికి బయలుదేరింది సాధ్వి.

తమ పేచీలు చెప్పుకోవడానికి వచ్చి వులుకూ పలుకు లేకుండా వాళ్ళిద్దరూ పలాయనవాదం ఎందుకుస్వీకరించారో ఉభయం బుద్ధికి అందడంలేదు. వివాహ విషయం చర్చించడానికి వచ్చిన ప్రజాపతి తన వేషం చూసి ఏవగించుకున్నాడా? సన్మాన సభకి కిరాయి ప్రేక్షకుల సప్లై కోసం వచ్చిన సాధ్వి తనవల్ల ఆ పని కాదని తిరుగుముఖం పట్టిందా? తాను ముఖం చాటుచేస్తే అసలు విషయం తరచి తరచి అడిగి తెలుసుకోవాలనే యింగితం లేకుండా. పరగడపున అలా పారిపోవడమేనా వారి సభ్యత. యిక తన నెవరూ ఆదరించరు. పరిపరివిధాల పోల్చుకోకుండా పరిమితంగా తనలో తాను దుఃఖించసాగాడు ఉభయం.

అతనికి అన్ని దిక్కులూ వొకేవిధంగా వున్నాయి. దారి చూపగరావా.... రామా.... అంటూ అభినయపూర్వకంగా చేతులు పైకెత్తి ప్రార్థించసాగాడు. దారినపోయే ధర్మరాజు అతనికి పది పైసలు దానం చేశాడు. ఉభయం జీవితానికి మార్గం చూపించాడు. అతను ఆ దోవనే వెళ్ళాడు.

రోడ్డుమీద జరుగుతున్న నాటకం చూస్తున్న సూర్య నారాయణగారు, సోఫాలో వొక పక్కకి వొత్తిగిల్లి అనుమానంగా అడిగారు–

"కీచులాడుకోకుండా మౌనంగా విడిపోయారు ముగ్గురు. యిక వారికి బుద్ధి వచ్చినట్లేనా."

"లేదు. వారి కథలు కంచికి చేరలేదు. యింటికి చేరాయి. యింకావుంది" అంటూ చివాల్న నవ్వేసి సోఫాలోంచి లేచాడు సత్రకాయ.

(ఇంకా ఉంది)

అందరికీ తల్లో నాలికలా ఉండే అతనంటే బ్యాంకులో అందరికీ అభిమానమే. ఓ రోజు ఆఫీసులో పని చేస్తుండగా అతనికి చెప్పలేనంత కడుపునొప్పి వచ్చింది. అందరూ కలిసి అతనిని హాస్పటల్‌కి తీసి కెళ్ళారు. డాక్టర్ చెక్ చేసి మందు లిచ్చాడు.

రెండ్రోజులు లీవ్‌పెట్టి మందులు వాడాడు.

కడుపు నొప్పి తగ్గింది. మళ్ళీ డ్యూటీలో జాయినయ్యాడు. అలా ఓ నెల్లాళ్ళు గడిచాయి.

తన బ్యాంకులో తనని అందరికంటే అభిమానించే వ్యక్తి అకౌంటెంట్ శ్రీ వెంకటేశంగారు. ఓ రోజు పిలిచి అడిగారు...

"సుందరం... నిన్నో వారం రోజులబట్టీ అడుగుదామనుకుంటున్నాను. ఏమిటలా చిక్కిపోతున్నావ్... నీ ముఖంలో చాలా ఛేంజ్ ఉంది సుమా!" అన్నారు.

"మీకేం పనిలేదు. ఇలా **అనడం మీ** కెన్నోసారో" అన్నాడు సుందరం. వెంక**టేశంగారు నవ్వారు.**

**ఆ** వేళ సాయంత్రం **మేనేజరుగారు** సిడీ లెడ్జరు పట్టుక రమ్మన్నారు **సుందరాన్ని. (సిడీ** లెడ్జరంటే చాలా బరువు**గా ఉంటుంది)** వెళ్ళి లెడ్జరు ఎత్తాడు... **రెండడుగులు వేశాడు.** కడుపులో ఏదో నొప్పి... తల **తిరిగింది... చేతులు** పట్టుతప్పాయి. లెడ్జర్ చేతుల్లోంచి జారి పెద్ద శబ్దం చేస్తూ కిందపడింది.

సుందరం కూడా కూలబడి పోయాడు.

వేరే ప్యూను కిషన్ పరుగెట్టు కొచ్చాడు.

"ఏందన్నా... నాకు చెప్తే నే నియ్యక పోదునా. పానం శాతగానప్పుడు ఎందుకు లేబట్టాలె" అని అది మోసుకెళ్ళి మేనేజరు కిచ్చాడు.

ఆఫీసులో అందరూ ఓ నిముషం సుందరం మీద జాలిపడ్డారు. ఇంటి కెళ్ళిం తరవాత కూడా కాళ్ళు కడుక్కోడాని కెళుతూ తూలిపడబోయాడు సుందరం. మళ్ళెపందిరి పట్టుకున్నాడు సమయానికి.




సుందరానికో అనుమానం వచ్చింది. తనకారోజు కడుపు నెప్పి వచ్చింది. తగ్గింది. కాని దాని ప్రభావం ఇంకా తగ్గలేదాని. అప్పుడు మళ్ళీ వెంకటేశంగారి మాటలు జ్ఞాపకం వచ్చాయి. చిక్కిపోతున్నావ్ అని. ఎందుకైనా మంచిదని మరునాడు బరువు చూసుకున్నాడు, కామత్ హోటల్ దగ్గర. యాభై తొమ్మిది కిలోలు. అంటే మూడు కిలోలు బరువు తగ్గాడన్నమాట. అంటే వెంకటేశంగారన్న మాటలు నిజమేనా. ఎందుకైనా మంచిదని ఆ సాయంత్రమే డాక్టరుని కలిసాడు కూడా.

డాక్టరుగారు కేసు హిస్టరీ అంతా పూర్తిగా విన్నాడు. టెస్టులు రాసాడు. యూరిన్ టెస్ట్, టూల్స్ టెస్ట్ మరియు ఛాతి దగ్గర ఎక్స్‌రే... పాథలాజికల్ లాబరేటరీ కూడా దగ్గర్లోనే ఉండడం వల్ల ఓ రెండ్రోజుల్లో సాధించాడు... వాటి రిపోర్టులు... వెరసి డెబ్బై రూపాయలు పేలాయి. డాక్టరు మందులు రాసిచ్చాడు. భయపడవలిసిన పని లేదన్నాడు. ఏదైనా ప్రాబ్లం డెవలప్ అయితే... తనని అర్ధరాత్రి అయినా నిస్సంకోచంగా లేపమన్నాడు. కాని ప్రస్తుతం తన ప్రాబ్లం ఏంటో మాత్రం చెప్ప లేదు. మందులు వాడాడు.

సెలవలు... డబ్బు ఖర్చవుతూనే ఉన్నాయి. నీరసం... నీరసంగానే ఉంటోంది. మధ్యలో ఓసారి విరోచనాలు వస్తే... మళ్ళీ కలిసాడు డాక్టర్ని. మందు లిస్తే తగ్గాయి.

ఇంకో నెల్లాళ్ళు గడిచాయి.

కళ్ళు గుంటలు పడుతున్నట్లు అనుమానం కలిగింది తనకి.

గబ గబా వెళ్ళి... మళ్ళీ బరువు చూసుకున్నాడు. యాభై రెండు కిలోలు. చమటలు పట్టాయి తనకి. కంగారుతో. మొత్తం తగ్గిన బరువు పదికిలోలు...

అదృష్టం కార్డులో అక్షరాలు అప్రయత్నంగా కనబడ్డాయి.

"మీ వ్యాపారం, **ఆరోగ్యం అంత** చల్లగా **ఉంటుంది"** అని రాసుంది. దానిని చూస్తే ఒళ్ళు మండింది తనకి. పది కిలోలు తగ్గి తను కంగారు **పడుతుంటే చల్లగాట...** చల్లగాట. ఆఖరుకి ఒళ్ళు చల్లబడక**పోతే చాలు.** విసుగొచ్చింది సుందరానికి.

ఇంటి కెళ్ళాడు. ఏం చెయ్యాలో అర్థం కాలేదు.

శ్యామలకి తన బాధ చెపుదామా అనుకున్నాడు. ఉహూఁ... అసలే భయస్తురాలు... అనవసరంగా భయపడుతుంది... అనుకున్నాడు. రాత్రంతా ఒకటే ఆలోచన.. ఆలోచనల మధ్య గుర్తుకు చేసుకుంటున్న కడుపునొప్పి... కాదు మంట... ఏం చెయ్యాలో తెలియని ఆవేదన. శ్యామల మధ్యలో అడిగిందావేళ... నిద్రపట్టడం లేదాండీ... అని, తనూరికే దొల్లడం చూసి. తను మాట్లాడ లేదు. శ్యామల మళ్ళీ అడగలేదు. మర్నాడుదయం... తనకి రక్త విరోచనా లున్నట్లు అనుమానించాడు తను. డాక్టరు దగ్గరికి పరుగెత్తాడు. ఓ వంద ప్రశ్న లేసి మందులు రాసాడు... డాక్టరు. తన కడుపు నొప్పికి ఏం చెయ్యలేక పోతున్నాడు. అది యింతకీ కడుపు నొప్పేనా. అంటే నొప్పి కాదు. మంటా... ఉహూఁ... మంట కాదు... లోపల ఎక్కడో పేగులు మెలికపడ్డ భావన. ఉహూఁ... సరిగా తెలియటం లేదు.

ఒక పక్క కడుపులో బాధ. మరో పక్క రక్త విరోచనాలు. అవి ఇంతకీ రక్త విరోచనాలేనా... లేక మరేదైనా సమస్య వల్ల రక్తం పడుతోందా. రంగయ్య ... ఆ మధ్య రంగయ్యకి కూడా నెత్తురు పడిందని చెప్పారు. కాని అతనికి కడుపులో కాన్సరు. చనిపోయాడు. పాపం మూడు నెలలకే. ఒకవేళ తనకీ కాన్సరేనా అని... కావచ్చు... కాకపోవచ్చు. మరి తనకి కూడా కడుపులో బాధ... రక్త విరోచనాలు... నీరసం... ఇక ఊహించలేక పోయాడు సుందరం. తాను కూడా మరో మూడు నెలల్లో టపా కట్టేయడం లేదుకదా... ఏమో... ఒళ్ళంతా చమటలు పట్టేసాయి.

మందులు వేసుకుంటున్నాడు. రక్తం పడటం తగ్గింది. ఎందుకయినా మంచిదని ఓ నెల్లాళ్ళు సెలవ పడేసాడు. డాక్టర్ని గుచ్చి గుచ్చి అడిగాడు తనకొచ్చిన జబ్బేంటని. ఏం భయపడక్కర్లేదని చెప్పాడు డాక్టరు. ఆ సాయంత్రం డాక్టరు.... భార్యని పిలిపించాడు. మంచి ఫుడ్ పెట్టమన్నాడు. అనవసరంగా భయపడద్దని. తాను జబ్బు నయం చేస్తానని హామీ యిచ్చాడు. శ్యామల ఆ విషయం తనతో చెప్పింది కూడా. ఎంతకాలం తనకీ భయం. ఇంక కేవలం మూడు నెలలు... అంతే...

రాత్రి విపరీతంగా దగ్గు వచ్చింది. కడుపులో నరాలు తెగిపోతాయేమోనన్న భయం కలిగింది తనకి. శ్యామల ఓ గ్లాసుడు మంచినీళ్ళిచ్చింది. ఓ కరక్కాయ పేడిచ్చింది. కాస్త దగ్గు తగ్గింది.

సుందరం నిద్రపోయినట్లు నటించాడు.

శ్యామల నిద్రపోయింది.

ఎవరు ఎన్ని విధాల కంగారు పడద్దని చెప్పినా... తనకి ఏదో సీరియస్‌గానే ఉందనేది నిశ్చయం. తన కిప్పుడు నలభై ఏళ్ళు. ఇంతవరకూ ఎన్నడూ యిలాంటి భావన కలగలేదు. తనకే తెలుస్తోంది. తన కడుపులో ఏ క్యాన్సరో... అల్సరో ఉందని. ఈ డాక్టరు లాభం లేదు. కొంచం మంచి డాక్టరును చూసుకోవాలి. వాడు శ్యామలకి తెలియనివాడు కావాలి. శ్యామలకి అసలు విషయం తెలిస్తే తట్టుకోలేదు. ఎవరిని అడగాలి డాక్టరు గురించి. ఆఁ... వెంకటేశంగారిని అడిగితే సరి...

మరునాడు బ్యాంకుకి వెళ్ళాడు. వెంకటేశంగారిని అడిగి ఒక డాక్టరు ఎడ్రస్ తీసుకున్నాడు. ఆయనది హిమయత్‌నగర్. తన కేమైనా అయితే... తన భార్యా పిల్లల గతేంకాను. పిల్ల లందరూ చిన్నవాళ్ళు. భార్య చదువుకున్నదే... టిన్త్ పాస్. తనకంటే నయం. తను ఎయిత్ ఫెయిల్డ్. ప్రయత్నం చేసుకుంటే... తన బ్యాంక్‌వాళ్ళే ఏదైనా ఉద్యోగం యిస్తారు. ఎనిమిది వేల రూపాయల దాకా తనకి లైఫ్ ఇన్సూరెన్సుంది. అది వస్తుంది. పి. యఫ్, గ్రాట్యూయిటీ అన్నీ కలిపి ఓ ఇరవైవేలు రావచ్చు. ఈ డబ్బు.... బ్యాంక్ ఉద్యోగం వస్తే... భార్యాపిల్లలు హాయిగా బతగ్గలరు. కాని... అన్నీ రావాలిగా. కాని ఇలాంటి వాటి గురించి అసలు భార్యకి తెలుసునా. ఏమో... తెలియక పోవచ్చు. తనే చెప్పడం మంచిది. చెపితే ఇవన్నీ ఎందుకు చెపుతున్నావంటే... తనేం చెప్పాలి. ఏదో రకంగా చెప్పాలి. తప్పదు. చెప్పి తీరాలి.

ఇంటి కెళ్ళగానే... శ్యామలా... శ్యామలా... అంటూ పిలిచాడు. తను వచ్చింది. "అన్నట్లు నీకు తెలుసు కదూ... యాషిమియా. మా సికిందిరాబాదు బ్రాంచిలో పని చేస్తాడూ...." అన్నాడు.

"ఎవరూ... నాకేం తెలియదే!" అంది శ్యామల.

# మృత్యు ముఖం

"అతనేనోయ్. మనింటికి మూడు నెలల క్రితం వచ్చాడు కూడానూ."

"సరే ఎవరైతే నేంటి... చెప్పండి అసలు సంగతేంటో" అంది శ్యామల.

"ఏంలేదు. పాపం! అతనూ పోయాట్ట. ఓ నెలయిందటప్పుడే....!"

"అయ్యో పాపం!"

"ఆఁ... అయితే భార్యాపిల్లలు బ్యాంకుకు వచ్చి అడిగితే.... అతని బ్యాంకు నుండి వచ్చేడబ్బు... ఓ ఇరవై వేలదాకా యిప్పించారట. పి. యఫ్. లాంటివి. ఆ అమ్మాయికి కూడా మా అసిఫ్‌నగర్ బ్రాంచిలో టెంపరరీగా స్వీపర్ పని యిప్పించారట. పర్మినెంటు చెయ్యమని రాశారట కూడానూ. పాపం ఆ అమ్మాయి చదువుకో లేదులే."

"పాపం! అవునూ ఈ విషయాలన్నీ నా కెందుకు చెపుతున్నట్లూ... శ్యామల అనుమానంగా అడిగింది.

"అబ్బే... ఏంలేదు... యాషిమియా నీ క్కూడా తెలుసున్నవాడు కదా! అందుకని" దబాయించేశాడు. సుందరానికి బాగా తెలుసు... యాషిమియా అనే వాడెవ్వడూ లేడని...

"ఏమో... నా కతనెవరో తెలియదు" అని శ్యామల వెళ్ళి పోయింది. సుందరం తృప్తిగా నవ్వుకున్నాడు.

సాయంత్రం వెంకటేశం గారింటి కెళ్ళాడు. ఓ వంద రూపాయలు అప్పుకి. అప్పు దొరికింది. చాలా సేపు మాట్లాడుకున్నారు. సుందరం ఆరోగ్యం గురించి.

"సార్....! నా కేదైనా అయితే... మీ మరదలి కేదైనా దారి దొరికేదాకా కొంచం సాయపడండి." కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి సుందరానికి.

వెంకటేశంగారు కాసేపు కేకలేసారు. నీకేం కాదని. కాసేపు ధైర్యం చెప్పారు. అన్నీ విని... సుందరం బయలుదేరి యింటికి వచ్చేసాడు.

మర్నాడు పొద్దున్న ఏడున్నరకే బయల్దేరి కొత్త డాక్టరు దగ్గరి కెళ్ళాడు సుందరం.

ఈ డాక్టరుగారు చెయ్యి పెడితే ముప్పై...

పెందరాలే వెళ్ళడంతో పెద్ద రష్ లేదు.

త్వరగానే డాక్టరుగారి దర్శనం దొరికింది.

వివరంగా కేసు వివరాలు తెలిపాడు. కడుపు నొప్పి... రక్త విరోచనాలు... నీరసం... బరువు తగ్గడం వగైరా... వగైరా...

ఏది ఏమైనా తన కొచ్చిన జబ్బేంటో... దాని పర్యవసాన మేంటో తెలుసుకోవడమే తనిక్కడికి రావడానికి పరమావధని తెలియ జేసాడు. ఆ రోగం ఎంత భయంకర మైందయినా ధైర్యంగా చెప్పమన్నాడు. వినడానికి తాను సిద్ధంగా ఉన్నానని తెలియ జేసాడు.

డాక్టరు అన్నీ విని... పరీక్షలు చేసాడు. ముఖ్యంగా బరువు. బరువు యాభై ఎనిమిది కిలోలు. మీకేమైనా బరువు పెరిగినట్టేమైనా ఉందా? అన్నాడు డాక్టరు. లేదన్నాడు సుందరం.

పూర్తిగా చెక్ చేసాడు తనని డాక్టరు.

రోగం ఏంటో తెలుసుకున్న తృప్తి డాక్టరు కళ్ళల్లో కనిపించింది. నవ్వుతూ కూర్చుని మందులు రాస్తూ... మీ పేరు అన్నాడు.

"డాక్టర్...! ఇంతకీ నా కొచ్చిన జబ్బు..."

"ఏమీలేదు. జస్ట్ జనరల్ వీక్‌నెస్. అంతకు మించి కంగారు పడవలసిన దేమీ లేదు. టానిక్కులు... విటమినులు రాసాను. వాడండి. బలవర్ధకమయిన తిండి తినండి. అంతే... డోంట్ వర్రీ... ఏమీ అక్కర్లేదు" అన్నాడు డాక్టర్.

సుందరం మనసు తేలిక పడింది.

ముప్పై రూపాయలూ యిచ్చాడు.

బ్యాంకుకు వెళ్ళి సాలరీ అడ్వాన్సు తీసుకున్నాడు.

మొట్టమొదటి సారిగా పి.యఫ్. లోన్‌కి అప్లై చేసాడు.

వస్తూ వస్తూ మళ్ళీ బరువు చూసుకుందామని వెళ్ళాడు కామత్‌కి.

"మాష్టారూ బరువు చూసుకోవాలంటే పైకి వెళ్ళండి. ఆ మిషను పాడై నెల్లాళ్ళయిందండి..." ఎవరో అన్నారు తనతో.

పైకెళ్ళి బరువు చూసుకున్నాడు. యాభయ్ ఎనిమిది కిలోలు.

షాపింగ్ కెళ్ళి రక రకాల బట్టలు, స్వీట్లు, హాట్లు కొన్నాడు. తనకి మందులు కొనుక్కున్నాడు.

మృత్యు ముఖం నుండి బయటపడ్డ తృప్తితో ఇంట్లో అడుగు పెట్టాడు. ఆ సంతోషంలో ఇంట్లో వాళ్ళందరితోటీ ఓ రోజు సంతోషంగా గడపాలను కున్నాడు... గడిపాడు.

అంతే... మరేమీ లేదు.

కాని శ్యామల కీ విషయం చెప్పేదెవరూ? అని. □



# "నా బొమ్మలంటే నాకెంతో ఇష్టం

# వైశ్యాబ్యాంకులో పొదుపుచెయ్యడం అంటే మరింత ఇష్టం!"

"ఎందుకో తెలుసా ? డాక్టరు కావాలి, అనే నా ఆశను నెరవేర్చడానికీ, మా నాన్న వైశ్యాబ్యాంకులో పొదుపు చేస్తున్నారు".

మీ చిన్నారి ఆశయాలను మీరూ. నెరవేర్చొచ్చు, వైశ్యాబ్యాంకులో క్యుములేటివ్ మరియు అక్షయా డిపాజిట్ల ద్వారా.......

ప్రజా సేవలో 50 సంవత్సరాలకు పైగా అనుభవ-మున్న వైశ్యాబ్యాంకు, మీ ప్రతీ అవసరానికీ తగిన, అనువైన పథకాలను రూపొందించింది.

వివరాలకు మీ దగ్గిరలో యున్న మా బ్రాంచిని సంప్రదించండి.

మా క్యుములేటివ్ మరియు అక్షయా పథకాలలో మీ పొదుపు ఎలా అభివృద్ధి చెందుతుందో మీరే చూడండి.

| క్యుములేటివ్ డిపాజిట్ | | | | అక్షయా డిపాజిట్. | | |
|---|---|---|---|---|---|---|
| నెలసరి డిపాజిట్ | డిపాజిట్ కాలం | మీ పొదుపు మొత్తం | మేము తిరిగి ఇచ్చే మొత్తం | మీరు తిరిగి పొదుపు చేసే మొత్తం | డిపాజిట్ కాలం | మేము తిరిగ్గి ఇచ్చే రొఖ్ఖం |
| రూ. 160/- | నెలలు 120 | రూ. 19,200/- | రూ. పై 34,835-20 | రూ. 33,790/- | నెలలు 120 | రూ. (ఒకలక్ష) 1,00,000 |


రండి, కలిసి అభివృద్ధి సాధిద్దాం



## ది వైశ్యా బ్యాంక్ లిమిటెడ్

రిజిష్టర్డ్ ఆఫీసు:
అవెన్యూరోడ్, బెంగుళూరు 560 002
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు:
72 సెయింట్ మార్క్సరోడ్, బెంగుళూరు 560 001

ఛైర్మన్: రమేశ్‌గెల్లి

KIRON/VBL/85




### ఆర్. ఎస్. యు. ఎమ్. ఆర్. అనంతపురం

★ ఈ మధ్య సినిమా హీరోయిన్లు డ్యూయెట్లు పాడేటప్పుడు వేసే గంతులు (వాన సీనులు సరేసరి) చాలా అసభ్యంగా వున్నా సెన్సారు సర్టిఫికెట్ ఎలా యిస్తున్నారు సెన్సారువారు?

● పాపం వాళ్లేం చేస్తారండీ – వాళ్లు చేయవలసిన పని వాళ్లు చేస్తూనే వుంటారు. ఈసారి థియేటరులో ఆ సినిమా కట్సు టైపు చేసి పెడతారు.(అది రూలు) అవి చదివి సినిమాలోకి వెళ్లండి. ఏ కట్లు యధాతధంగా వుండి పోయామో మీకే తెలుస్తుంది!! కట్లు దారి కట్లది. ప్రింటు దారి ప్రింటుదిగా వుంటున్నాయని అంటున్నారు. దొరికే దాకా అందరూ పెద్దమనుషులే. కట్లు తొలగించకపోవడం నేరం. అది తెలియక కాదు. అది ఎవరు చెప్తారన్న ధైర్యం. అయినా యీ సుందర నృత్యాలన్నీ ప్రేక్షకులు చాలా సంతోషంగా చూస్తారంటారు. మీరెందుకు బాధ పడుతున్నారు??

### డి. ఎన్. ఆర్. హైదరాబాద్

★ కన్నూమిన్నూ కానక ఉంటారెందుకు కొందరు?

● వారి వారి వ్యాపారాల లాభ నష్టాలకి కొలమానం. వారు వినమ్రులై వుండడానికీ, గర్వంగా ఉండడానికీ! ఓటమి నమ్రతనీ గెలుపు గర్వాన్నీ యివ్వడం సహజం.

### బి. బి. కె. రామకృష్ణాపురం

★ దేవుడు ఉన్నాడని మీకు నమ్మకం వుందా?

● ఉంది. మీకు లేదా??

★ నేటి తెలుగు సినిమాలపై మీ అభిప్రాయం?

● అభిప్రాయం ఏర్పరుచుకునేటంత సేపు వాటి పేర్లే జ్ఞాపకం వుండడం లేదు!

### పి. పి. ఎమ్. నిండ్ర

★ మనిషికి మనసుకు తేడా ఏమిటి సిస్టర్?

● మనిషికే మనసుంటుందయ్యా తమ్ముడు. అది లేకపోతే పిచ్చాడైనా అవాలి. జంతువైనా అవాలి.

★ మా అభిమాన నటుడు టైగర్ చిరంజీవిపై మీ అభిప్రాయం?

● ఎప్పుడూ దగ్గరగా వెళ్లి చూడలేదయ్యా– ఎక్కడ పిడికిలి బిగించి ఓటి పడేస్తాడేమోనని! వెడితే తప్పక అడుగుతాను– ఆ దుస్తులేలా తొడుక్కుంటున్నారని!!

### పి. ఆర్. ఇల్లెందు

★ కుల సాంప్రదాయంపై మీ అభిప్రాయం?

● నాకా సాంప్రదాయం తెలియదు. తెలుసుకోవాలన్న కుతూహలం కూడ లేదు.

### వెంకట్. ఉరవకొండ

★ అంతర్గత కలహాలతో ఆవేశకావేషాలతో మగ్గుతున్న రాజకీయ వ్యవస్థను నిర్లిప్తంగా చూస్తూన్న ప్రజలలో రాజకీయ చైతన్యం ఎప్పుడు వస్తుంది?

● రానివ్వరు! ఏ పార్టీ పోటీ చేస్తుంటే అది గెలిపించడమే ప్రజల బాధ్యత అని చెప్తారు. మళ్లీ ఎన్నికలు వచ్చే దాకా–గెలిచిన పార్టీ గొప్పదని నమ్ముతుంటారు.

### జి. వి. కె. ఆర్. విజయవాడ

ఐశ్వర్యవంతులు బంగారం ధరిస్తే గాని తెలియదా?

● అనుకుంటారు. కాని నిజానికి –మేధస్సే శరీరానికి ఐశ్వర్యం యిచ్చేది....

### పి. ఆర్. ఆర్. విశాఖపట్నం

★ మనందరం దేవుని బిడ్డలమని, శాస్త్రాలు పెద్దలు చెప్తారు. తల్లి బిడ్డ సుఖం కోరుకుంటుంది. కాని ఆ భగవంతుడు తన బిడ్డల నందరినీ సమంగా ఉండాలని కోరుకోడు ఎందుకని?

● తల్లులు మటుకు తమ బిడ్డల నందరినీ ఒక్కలా చూస్తున్నారా? అబ్బాయికీ అమ్మాయికీ ఎంత తేడా చూపుతారు. నవమాసాలు మోసి ప్రసవ వేదన భరించిన కన్నతల్లికే సమదృష్టి వుండనప్పుడు –ఏ . భారం మోయని దేవుడికి ఎందుకుంటుంది?

### ఎస్. వి. వడ్లమూడి

★ నేను ఒకతనిని అన్నయ్యా అని పిలుస్తాను. కాని సమాజం వేరేగా అర్థం చేసుకుంది.

● మీ వడ్లమూడిలో ఏ సమాజం వుంది?!

### జి. హెచ్. ఎస్. విజయవాడ

★ ప్రేమించడం నేరమా? అయితే ఆ నేరం నేను చేశాను. ఒక దూరపు బంధువు వరసకు మామయ్య అవుతాడు. అతనితో మాట్లాడేను. అతనూ మాట్లాడుతాడు గాని ప్రేమించుతున్నాడో లేదో తెలియడం లేదు.

● మరేం ఫరవాలేదు! నీ ప్రేమని గుంభనగా వుంచు ముందర! ఎదుటి వ్యక్తి తమని ప్రేమించినదీ లేనిదీ తెలియడం లేదంటే – తమ కింకా ప్రేమించే వయస్సు రాలేదని అర్థం.

### బి. ఆర్. ఎస్. అనంతపురం

★ నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. ఆమె నన్ను స్నేహితునిగా భావిస్తున్నానని చెప్పింది. ఇప్పుడామెని ప్రేమించి పెళ్లి చేసుకోవచ్చా?

● అందుకు తను సిద్ధంగా లేననే కదటయ్యా –అమ్మాయి చెప్పిన దానికి అర్థం?

### వెంకట్, ఉరవకొండ

★ కథల్లో గాని కథా కథనంలో గాని మూస ధోరణులేగాని సాంఘిక ప్రయోజనం కనపడటం లేదు. కనీసం ఈ సంవత్సరంలో నైనా చిత్రాల ధోరణి మారే అవకాశం వుందా?

● లేదు. కోట్లు నష్టపోతున్నా మారని ధోరణి సంవత్సరం మారితే వస్తుందనుకోవటం అత్యాశ!

★ నేటి సమాజంలో తోటి మనిషికి సహాయం చేసేవారి కంటే హాని చేసేవారే ఎక్కువగా వుండడానికి కారణం?

● శవాల మీంచేనా సరే నడిచి సింహాసనం ఎక్కాలన్న ఆత్రుత. కాంపిటీషన్. □






Omkar.



"పున్నమి రాత్రి"లో భానుచందర్, పవిత్ర

విజయశాంతి, రాధిక నాయికలు. గొల్లపూడి ఒక కీలకమైన పాత్రను ధరిస్తారు. కోడి రామకృష్ణ దర్శకుడు.

## జూలైలో "కుటుంబ బంధం".

"సంపద కలిగినప్పుడు పొంగిపోవడం, కష్టాలొచ్చినప్పుడు క్రుంగిపోవడం సహజమే. ఐతే, విధి వక్రించినప్పుడు ఆత్మబలంతో ఎదుర్కొంటూ ముందుకు సాగితేనే గమ్యం చేరుకోడానికి సాధ్యం –అని నిరూపించే ఓ మహిళ కరుణామయ గాథ," అన్నారు డాక్టర్ ఎం. ప్రభాకరరెడ్డి. ఈయన కథ, సమర్పణలో కవిత ఆర్ట్స్ పతాకంలో సంయుక్త నిర్మించిన "కుటుంబ బంధం" చిత్రం జూలై విడుదల. భానుప్రియ, రాజేష్, రాజ్యలక్ష్మి, అంజలీదేవి, ప్రభాకరరెడ్డి ప్రధాన పాత్రధారులు. మద్దిపట్ల సూరి మాటలు, గోపి పాటలు, సత్యం సంగీతం, సత్తిబాబు ఛాయ, మార్తాండ్ కూర్పుతో జయదేవ్ దర్శకుడు.

## "సూర్య నేత్రం"

"కోహినూర్ వజ్రంలాంటి విలువైన వజ్రం సూర్య నేత్రం..దాన్ని కనుగొన్నది హిస్టరీ ప్రొఫెసర్ విజయ్. అతని స్నేహితుడు పరశురామ్. ఉరిశిక్ష పడ్డ ముద్దాయిలు జాన్, ఖాన్‌ల సాయంతో దాన్ని సాధించడానికి బయలుదేరుతారు. ఎన్నో చిత్ర విచిత్రమైన సంఘటనలు ఎదురవుతాయి," అన్నారు పి. సి. మోహన్. ఈయన కూర్పు, దర్శకత్వంలో కడియం సత్యనారాయణ నిర్మించే సత్యశాయి ఆర్ట్ క్రియేషన్స్ వారి పై చిత్రంలో శరత్‌బాబు, రంగనాథ్, వనితశ్రీ, జీవా, సిలోన్ మనోహర్, వేలు, వీరభద్రరావు, జయమాలిని, అనూరాధ, స్మిత పాల్గొంటున్నారు. చిట్టారెడ్డి సూర్యకుమారి కథకు విఠల్‌కుమార్ స్క్రీన్‌ప్లే, యడవల్లి సంభాషణలు సమకూర్చారు. సి. నారాయణరెడ్డి, రాజశ్రీ గీతాలకు సత్యం స్వరకల్పన చేశారు. సి. గోపాల్ ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, కుర్రా రంగారావు సహ దర్శకత్వంతో జి. బాలసుబ్బయ్య సమర్పించే ఈ చిత్రానికి గొల్లంగి ఆనందబాబు ప్రొడక్షన్ కంట్రోలర్. జూపల్లి కృష్ణమోహన్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. మోహన్ ప్రొడక్షన్ మేనేజర్.




## గురువుగారి దర్శకత్వంలో శిష్యుని చిత్రం

దాసరిని గురుతుల్యులుగా గౌరవించే మోహన్‌బాబు శ్రీ లక్ష్మిప్రసన్న పిక్చర్స్ తాజా చిత్రాన్ని డైరెక్ట్ చేయడానికి దాసరి అంగీకరించినందుకు ఎంతో ఉప్పొంగిపోయారు. "మన రాష్ట్రంలోనే షూటింగంతా జరుగుతుంది. జూలై 4 నుంచి 25 ఆగస్ట్ 15 నుంచి 31 వరకు రెండు షెడ్యూల్స్, అన్నారు ఈ చిత్రంలో ద్విపాత్రలు నిర్వహించే మోహన్‌బాబు. జయసుధ నాయిక. తులసి, ముచ్చెర్ల అరుణ, జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, రంగనాథ్, సుధాకర్, రవీందర్, పి. ఎల్. నారాయణ, సారథి, జూనియర్ నాగేష్, జయవిజయ ఇతర తారాగణం. శంకర్ గణేష్ సంగీతం, కె. ఎస్. మణి ఛాయ, బి. సూర్యకుమార్ శిల్పం, సి. వి. ఆర్. బాబు సహ దర్శకత్వం, ఎం. కృష్ణ – ఇ. పురుషోత్తం నిర్వహణతో ఎం. మోహన్‌బాబు నిర్మాత. కథ, స్క్రీన్‌ప్లే,' మాటలు, పాటలు, దర్శకత్వం: దాసరి నారాయణరావు.

కొత్త లిరిల్
ఇది తాజాదనపు సరికొత్త అనుభూతి!

లిరిల్ కొత్తదిగా మారింది!
నిలిచి గుబాళించే కొత్త సువాసనతో..
ఆకర్షణీయమైన కొత్త ప్యాక్‌లో!






లిరిల్
తాజాదనపు సబ్బు

మిమ్మల్ని నవనారిగా రూపొందిస్తుంది



"యముడు"లో భానుచందర్, అశ్విని



జయప్రద "సూర్యచంద్ర"లో

## సినిమా

## భానుచందర్, భానుప్రియలతో వాసంతి చిత్రం "మంచి మనసులు"

"రజతోత్సవం జరుపుకున్న 'వైదేహి కాత్తిరిందాళ్' అనే చిత్రం ఆధారం. ఆ చిత్రంలోని పాటలు కూడా హిట్స్ అయ్యాయి. ఇళయరాజానే మా చిత్రానికీ సంగీత దర్శకుడు. జూన్ 25 నుంచి జూలై 20 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది.కొంత భాగం హొగెనకల్ వద్ద కూడా షూట్ చేస్తాం," అన్నారు మాజీ నటీమణి, నిర్మాత వాసంతి. లావణ్య ఆర్ట్స్ బానర్‌లో తయారవుతున్న ఈ చిత్రంలో భానుచందర్, భానుప్రియ, కపిల్‌దేవ్, నూతన్‌ప్రసాద్, వేలు, నిర్మల వగైరా తారాగణం. ఆత్రేయ, అప్పలాచార్య సంభాషణలకర్తలు. డి. ప్రసాద్‌బాబు ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, శేషు నృత్యాలు, నరసింహరాజు కూర్పుతో కె. ఎల్. ఎన్. శాస్త్రి నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : మోహన్‌గాంధి.

## నూతన చిత్ర నిర్మాణ సంస్థ "ఈనాడు పిక్చర్స్" ప్రారంభం

యువ పారిశ్రామికవేత్త బి. మధు తన మిత్రులతో కలసి "ఈనాడు పిక్చర్" పేరిట నూతన చిత్ర నిర్మాణ సంస్థను ప్రారంభించారు.

"ఈనాడు పిక్చర్స్" బ్యానర్‌పై నిర్మించే తమ తొలి చిత్రానికి అవార్డు పొందిన "విముక్తికోసం" చిత్ర దర్శకుడు ఉదయకుమార్‌ను దర్శకునిగా ఎన్నుకొన్నారు. ప్రస్తుతం స్క్రిప్ట్ వర్క్ జరుగుతున్న ఈ చిత్రం త్వరలో రికార్డింగ్ పూర్తి చేసుకొని సెట్ మీదకు వెళ్ళబోతున్నదని తెలిపారు.

తమ చిత్రం గురించి వివరిస్తూ, వినూత్నమయిన పద్ధతిలో వినోదంతో కూడిన ఈ కుటుంబ కథా చిత్రాన్ని పాత-కొత్త నటీ నటులతో ఏలూరు, హైదరాబాద్, విజయవాడ పరిసర ప్రాంతాలలో నిర్మించబోతున్నామని నిర్మాత తెలియచేశారు.

## దాసరి నారాయణరావు చిత్రం "పెళ్ళి మీకు– అక్షింతలు నాకు"

"గణేష్ అనే హీరోని పరిచయం చేస్తున్నా...షూటింగ్ పూర్తయిపోయింది. ఆగస్టు మొదటి వారంలో రిలీజ్," అన్నారు దాసరి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వ బాధ్యతలు వహిస్తూ, నిర్మించే తారకప్రభు ఫిలిమ్స్ వారి పై చిత్రంలో రజని నాయిక. చక్రవర్తి, శ్రీనాథ్, సత్యనారాయణ, అల్లురామలింగయ్య, త్యాగరాజు, అన్నపూర్ణ, దేవితో పాటు దాసరి కూడా ఒక ప్రత్యేక పాత్రలో కనిపిస్తారు. రమేష్‌నాయుడు సంగీతం, కె. ఎస్. మణి ఛాయ, బి. చలం శిల్పం, దొండపాటి శ్రీనివాస్ ప్రొడక్షన్, వై. ప్రభాకర్ సహదర్శకత్వం, కె. బసవయ్య నిర్వహణతో దాసరి పద్మ సమర్పిస్తారీ చిత్రాన్ని.

కృష్ణంరాజు, గిరిబాబు, "మృగరాజు" 3–డి చిత్రంలో



"అగ్గిపిడుగు"లో ప్రభాకరరెడ్డి, త్యాగరాజు



ఎమ్.యస్.ప్రసాద్ సమర్పించు

# సుచిత్ర

ఆగష్టు

**2**

విడుదల!

ఉదయం ఆటతో







SREE PUBS.

# మాయదారి మరిది

దర్శకత్వం: బి.లీలావరప్రసాద్

నిర్మాత: ఎమ్.ఎస్.సుభాష్

సంగీతం: చక్రవర్తి




నైజాం: శ్రీ గీత ఫిలింస్   సీడెడ్: వి.యల్.కె.పి.

★ పశ్చిమ గోదావరి : శ్రీ లక్ష్మి పిక్చర్, ఏలూరు.  ★ వైజాగ్, శ్రీకాకుళం : శ్రీ విజయలక్ష్మి పిక్చర్ (విజయనగరం)

"ఎర్ర మట్టి"లో మాదాల రంగారావు, రూప

## ఇమంది రామారావు దర్శకత్వంలో ద్వితీయ చిత్రం

"ఎగ్జిబిటర్‌గా ప్రేక్షకుల నాడి నాకు కాస్త కూస్త తెలుసు. ఇమంది రామారావుగారు డైరెక్ట్ చేసిన మొదటి చిత్రం ముద్దుల చెల్లెలు చూశాను. నాకెంతో నచ్చింది. అసలా చిత్రమే నిర్మాణరంగంలోనే ప్రవేశించడానికి ప్రోత్సహించింది. రామారావుగారి డైరెక్షన్‌లోనే నా మొదటి చిత్రాన్ని తీయాలని సంకల్పించాను." అన్నారు సుగుణా పిక్చర్స్ అధినేత ఎస్. భాస్కరరెడ్డి. "ఈ చిత్రంలో మురళీమోహన్ పాత్ర ఆయన ఇమేజ్‌ని మరింత పెంచేది. జూలై 18న రికార్డింగ్ కార్యక్రమం ప్రారంభమవుతుంది. ఆగస్టులో విశాఖపట్నం, మార్టేరు ప్రాంతంలో ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ ప్లాన్ చేశాం," అన్నారు కథ, స్క్రీన్‌ప్లే, సంభాషణలు, దర్శకత్వం నిర్వహించే ఇమంది రామారావు. ఈ చిత్రంలో మురళీమోహన్, సుధాకర్, వేలు, చిట్టిబాబు, అన్నపూర్ణ, వై. విజయ, కల్పనారాయ్. నాయికగా ఓ ప్రముఖ నటి పాల్గొంటారు. ఆత్రేయ గీతాలకు కె. వి. మహదేవన్ స్వరకర్త. కోటగిరి వెంకటేశ్వరరావు సంకలనకర్త. శ్రావణకుమార్ అనే నవ నటునితో పాటు రంగస్థల కళాకారులు నానిబాబు, సింహాద్రి ప్రభృతులు కూడా నటిస్తారు.

"సినిమా చూడకపోతే కాల్చి పారేసేటట్టున్నారు! ఇవాళే చూస్తాను!




## శోభన్‌బాబు, విజయబాపినీడు ద్వయంతో రాశీ మూవీ క్రియేషన్స్ తదుపరి చిత్రం

"నవంబర్, డిశంబర్ మాసాల్లో షూటింగ్ జరుగుతుంది," అన్నారు ఎం. నరసింహారావు. ఈయన "మహారాజు" అనంతరం నిర్మించే రాశీ మూవీ క్రియేషన్స్ తదుపరి చిత్రంలో కూడా శోభన్‌బాబు, సుహాసిని నాయకా నాయికలు. విజయబాపినీడు దర్శకుడు. □

# అవి - ఇవి

★ "ఈ అమ్మాయి మాదగ్గర చుట్టమే కాక సినిమారంగంలో నా వారసురాలు కూడా," అంటూ బి. సరోజాదేవి ఇటీవల స్వాతి అనే అందమైన యువతిని కొందరు నిర్మాతలకు సిఫారస్ చేస్తోంది. స్వాతి గ్రాడ్యుయేట్. అప్పుడే ఒక చిత్రంలో బుక్ అయింది కూడా.

★ మూడో వివాహం చేసుకోవడంలో జయంతిని అనుసరించిన మరో నటి షీలా. ఈమె పాత్రికేయుడు రంగరాజన్, తమిళ నటుడు రవిచంద్రన్ అనంతరం ఇప్పుడు బాబు అనే పంపిణీదారుని పెళ్ళాడి, హనీమూన్‌కి ఊటీకి వెళ్ళొచ్చింది కూడా.

★ నటి దీప ఒక కథ రాసిందట. "మనసులోనే చక్కగా రూపకల్పన చేసుకున్నాను. ఒక మంచి ఆర్ట్ ఫిలిమ్‌ను తయారు చేయవచ్చు. దానికి అవార్డ్ కూడా రావొచ్చు. అవకాశం దొరికితే ఒక సారి బాలచందర్ గారికి వినిపించాలని ఉంది," అందామె.

★ కమలహాసన్ తల్లి పేరు రాజలక్ష్మి. అంచేత, తల్లిపేరు, తన పేరు కలిసి వచ్చేలా రాజ్‌కమల్ ఇంటర్నేషనల్ అనే సంస్థను స్థాపించి, రాజశేఖర్ దర్శకత్వంలో ఒక తమిళ చిత్రానికి సన్నాహాలు చేస్తున్నాడు కమల్. ఇందులో నాయికగా డింపిల్ కపాడియా నటించవచ్చు.

★ ఒకప్పుడు బాలనటిగా వెలుగొందిన బేబీరాణి కూతురు ఇందు ఇప్పుడు బాలనటిగా ఒక చిత్రంలో నటిస్తోంది.

★ "మా అమ్మాయి వయసు 24 ఏళ్ళే. ఇంకా కరెక్ట్‌గా చెప్పాలంటే మా అమ్మాయి పుట్టింది 17-12-1961లో. కాకపోతే మా ఇంట్లో అందరూ కాస్త పొడుగ్గా ఉంటూండడం వల్ల వయసు మరికాస్త ఎక్కువ ఉన్నట్లు అనిపిస్తూంటుందంతే," అని జయమాలిని తల్లి సెట్‌లో ఎవరో ఒకామెతో చెప్తోంది. కొంత దూరంలో కూర్చొనున్న జయమాలిని "మా ఇంట్లో విడియో, కొన్ని కేసెట్లు దొంగతనం జరిగిందండి", అంది. ఎప్పుడని అడిగాను. "మే నెలలో. ఒక రోజురాత్రి తలుపుకు గొళ్ళెం పెట్టడం మరచినట్లున్నాను. విడియోసెట్, పది పదిహేను కేసెట్లు మాయమై పోయాయి. విడియో ఇంకోటి కొనుక్కోవచ్చుగాని, చక్కని పాత సినిమాల విడియో కేసెట్లు పోయాయి. అలాంటివి మళ్ళీ సేకరించడం కష్టం కదా?" అంది.

★ రజనీకాంత్, మాధవి ఒక ఒప్పందం చేసుకున్నారు. తమ హిందీ ఉచ్చారణను మెరుగు పరచుకోడానికి హిందీ సినిమా షూటింగ్స్ సమయాలలో ఇద్దరూ హిందీలోనే మాట్లాడుకోవాలి. పొరబాటున ఎవరైనా నోరు జారి ఇతర భాషల్లో మాట్లాడితే, ఒక మాటకు రూపాయి చొప్పున అపరాధం చెల్లించాలి.... ఇంతవరకు ఎవరు ఎక్కువ అపరాధం చెల్లించారో తెలీదు.

★ 1933లో మైసూరు దగ్గర ఒక గ్రామంలో ఒక తెలుగు బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన స్వర్గీయ పుట్టణ్ణ కణగాల్ కొంత కాలం హోటల్లో పని చేశారు. ఆ తర్వాత మెకానిక్‌గా, ట్రక్ డ్రయివర్‌గా జీవయాత్ర సాగించాక దర్శక నిర్మాత బి. ఆర్. పంతులు వద్ద అప్రెంటిస్‌గా చేరినప్పుడు ఈయన జీతం రోజుకు ముప్పావల. కొన్నేళ్ళ క్రితం నిద్ర మాత్రలు ఎక్కువగా పుచ్చుకుని ఆత్మహత్య చేసుకున్న నటి కల్పన "శరపంజర" చిత్రం షూటింగ్ సమయంలో ఈయన్ని ప్రేమించింది. ఆ తర్వాత "గజ్జెపూజ" చిత్ర నిర్మాణమప్పుడు నటి ఆరతి ఈయన జీవితంలో ప్రవేశించి, "రంగనాయకి" చిత్రమప్పుడు విడి పోయింది. 

—జి.వి.జి.

# నేపథ్య నాయిక విజయదుర్గతో ఇంటర్వ్యూ



(ఏటా ఇతర భాషల నుండి తెలుగులోకి ఎన్నో చిత్రాలు డబ్బ్ చేయబడుతున్నాయి. డబ్బింగ్ చెప్పడంలో అంతగా శ్రమించవలసిందేమీ ఉండదేమోనని కొందరు ప్రేక్షకులు అభిప్రాయపడవచ్చు. ప్రత్యక్షంగా కంటి ముందు కనిపించే నటుడుగాని, నటిగాని- వారికి సహజమైన సరళిలో- స్వరంలో వెలువడే వాక్యం తెలుగులో కూడా ఆ స్వరంలాగే వినిపిస్తూ, ఆ సరళిలోనే ఉచ్చరింపబడితే గాని- ప్రేక్షకులకు ఆ మూల చిత్రంలోని పాత్రధారే మాట్లాడారన్నంత సహజంగా వినిపించి, సంతృప్తి కలిగించదు. అంచేత, ఆయా పాత్రలకు తెలుగులో మాట్లాడే కళాకారులు తమ వ్యక్తిత్వాన్ని విడనాడి, ఆ పాత్రల వాగ్ధోరణిని గుర్తించి, వారి ఉచ్చారణలోని పట్టు గ్రహించి, వారిలాగే మాట్లాడి ఒప్పించాలి. పైగా, పాత్రలన్నిటి ఆవేశకావేషాలను, అనురాగానందాలను తెలుగు భాషలో వెలువరించి, అది మరొక భాషా చిత్రమనే విషయాన్ని మరిపించి, ప్రతి సన్నివేశాన్నీ రక్తి కట్టించే అనుభవజ్ఞులైన డబ్బింగ్ కళాకారు లెందరో ఉన్నారు. వారిలో విజయదుర్గ ఒకరు. ఆమె ఎన్నో ఆసక్తికరమైన విషయాలను తెలియజేశారు.)

"మూడుముళ్ళు-మాతృక 'ముందానై ముడిచ్చు' తమిళ చిత్రంలో నటి ఊర్వశికి నేను డబ్బింగ్ చెప్తున్నాను. ఒకసారి డైరెక్టర్ కె. భాగ్యరాజా గారితోపాటు ఊర్వశి ఆ రికార్డింగ్ థియేటర్‌లోకి వచ్చింది. రెండు మూడు టేక్‌ల తర్వాతనే చెప్పింది ఓ-కే అయింది. అప్పుడు భాగ్యరాజాగారు ఊర్వశితో 'చూశావా? షూటింగ్‌లో నీ పాటికి నువ్వు పాత్రలో లీనమై యమస్పీడ్‌గా మాట్లాడేశావ్. అంత స్పీడ్‌లోనే పెదవుల కదలికలు సింక్ అయ్యేలా చెప్పడానికి ఈ డబ్బింగ్ ఆర్టిస్ట్ ఎంత అవస్థ పడుతూందో! నిజంగా సెట్స్‌లో ఆర్టిస్టు ఎంత అద్భుతంగా నటించినా- డబ్బింగ్ అంత భావోద్రేకంగా లేకపోతే అంతా రసాభాస అవుతుంది" అన్నారు భాగ్యరాజా. ఊర్వశి అక్కడ్నుంచి వెళ్ళిపోయే ముందు నా దగ్గరికి చిర్నగవుతో వచ్చి, "మీ వాయిస్ నాకు బాగా మేచ్ అయింది" అని అభినందించింది" అంది విజయదుర్గ ఆ సంఘటనను గుర్తుకు తెచ్చుకుంటూ.

"మీరు ఎంతకాలంగా డబ్బింగ్ చెప్తున్నారు?"

"నా ఎనిమిదవ ఏట నుంచి. మా అక్కయ్య జయశ్రీ కూడా డబ్బింగ్ ఆర్టిస్ట్. ఒకసారి ఆమెతో పాటు నేనో రికార్డింగ్ థియేటర్‌కు వెళ్ళాను. అక్కడ పాపాయికి- అంటే, బేబీ రాణీకి డబ్బింగ్ చెప్పే ఆర్టిస్టు రాలేదు. ఆ రోజే ఆ డబ్బింగ్ పూర్తవ్వాలి. అందరూ ఖంగారుగా ఉన్నారు. అది చూసి నేను "పోనీ... ఆ డబ్బింగ్ నే చెప్పనా?" అన్నా. అక్కడున్న వాళ్ళంతా ఒక్కసారిగా నావంక తిరిగారు. "నీ మొహం. డబ్బింగ్ చెప్పడమంటే అంత తేలికనుకున్నావా?" అంది మా అక్కయ్య. ఇంతలో నిర్మాత అనుకుంటాను - "చెప్పమనండి చూద్దాం., ఆ అమ్మాయిని నిరుత్సాహపరచడ మెందుకు?" అన్నారు. వెంటనే నేను గొంతు సవరించు కున్నాను. అలా మొట్టమొదటి సారి ఆ బేబీ ఆర్టిస్ట్‌కి డబ్బింగ్ చెప్పానన్న మాట. చాలా బాగా చెప్పానని అందరూ మెచ్చుకున్నారు సుమండీ. అప్పట్నుంచి కొంత కాలం వరకు ప్రతి తెలుగు చిత్రంలో బేబీ ఆర్టిస్ట్‌లకు నేనే వాయిస్ ఇస్తూ వచ్చా."

"ఇంతవరకు ఎన్ని చిత్రాలకు డబ్బింగ్ చెప్పి ఉంటారు?"

"అయిదు వందలు దాటి ఉంటాయను కుంటానండి."

"ఇతర భాషల్లో కూడా డబ్బింగ్ చెప్పారా?"

"ఓ.... తమిళంలో కూడా చెప్పాను."

"అవి ఎన్ని ఉంటాయి?"

"ఎనభై పై చిలుకు ఉండొచ్చు."

"తమిళంలో మొదట ఏ చిత్రానికి చెప్పారు?"

"తూరల్ నిన్ను పోచ్చు"లో సులక్షణకు చెప్పా."

"తెలుగులో కూడా కొందరు ఆర్టిస్ట్‌లకు మీరు గాత్రదానం చేసినట్లున్నారు?"

"అవునండి... రాధిక, సుహాసిని, విజయశాంతి, నళిని, అంబిక, రాధ, ఊర్వశి... అన్నట్టు మీకో విషయం చెప్పనా? "ఎంగయో కేట్ట కురళ్" తమిళ చిత్రంలో అంబికకు నేను డబ్బింగ్ చెప్పాను. అదే చిత్రం "బావా మరదళ్ళు"గా తెలుగులో తయారైంది. ఇందులో అంబిక పాత్రను రాధిక ధరించింది. రాధికకు కూడా నేనే చెప్పాను."

"అంటే, రెండు వెర్షన్‌లలోనూ ఒకే పాత్రకు మీరే వాయిస్ ఇచ్చారన్నమాట.... అన్నట్టు మీరు ఆర్టిస్ట్‌కు తగ్గట్టు వాయిస్ మారుస్తుంటారా?"

"ఒక్కోసారి తప్పదు. ఎంచేతంటే, ఏ ఇద్దరి నటీమణుల డైలాగ్ డెలివరీగాని, పద్ధతిగాని ఒకటిగా ఉండవు కదా? అదీకాక మరీ సన్నగా ఉన్న ఆర్టిస్ట్‌కు ఓ విధంగా, కాస్త ఒడ్డూ పొడుగూ ఉన్న వారికి ఓ విధంగా, శృంగార పాత్రలు ధరించే వారికి కాస్త వొయ్యారంగా చెప్తేనే బావుంటుంది. కెమెరా ముందు ఆర్టిస్ట్ ఎంత బాగా నటిస్తే, ఆ ఇన్‌స్పిరేషన్‌లో అంత బాగా డబ్బింగ్ చెప్పడానికి వీలవుతుంది."

"ఏ ఇతర భాషా చిత్రం నుంచి తెలుగులో డబ్బింగ్ చెప్పడం కష్టం?"

"హిందీ నుంచి"

"అవునూ. మీరు తమిళంలో కూడా డబ్బింగ్ చెప్పానన్నారే? అంత స్పష్టంగా మీరు తమిళం ఎలా మాట్లాడ గల్గుతున్నారు?"

"నేను పుట్టింది, పెరిగింది మద్రాసులో నే. హోలీ ఏంజిల్స్ కాన్వెంట్‌లో, ఆ తర్వాత ఎస్. ఐ. ఇ. టి. కాలేజ్‌లో బి. యె పూర్తి చేశా."

"కన్నడం, మలయాళం భాషల్లో కూడా డబ్బింగ్ చెప్పారా?"

"కన్నడంలో రెండు డాకుమెంటరీలకు వ్యాఖ్యానం చెప్పాను. 'దంపతిగళ్' అనే మళయాళ చిత్రంలో పూర్ణిమకు డబ్బింగ్ చెప్పాను. ఆ చిత్రంలో పూర్ణిమ తమిళ యువతి; యాసతో మలయాళం మాట్లాడే పాత్ర. అంచేత నేను సునాయాసంగా వాయిస్ ఇవ్వగలిగాను."

"తెర వెనుకేనా? తెర ముందు కూడా ఎప్పుడైనా మీరు కనిపించారా?"

"జీవితరంగం- చిత్రంలో గుమ్మడి గారి కూతుళ్ళలో ఒకతెగా నటించాను. మిగతా కూతుళ్ళుగా జయసుధ, ప్రమీల, ఫటాఫట్ జయలక్ష్మి నటించారు. ఆ చిత్రంలో నేను హమ్మింగ్ చేశా కూడా."

"మీరెప్పుడైనా స్ట్రెయిట్ చిత్రాలలో పెద్దహీరో లెవరితో నైనా కలిసి కాంబినేషన్‌లో డబ్బింగ్ చెప్పారా?"

"ఎన్. టి. ఆర్ గారు, ఎ. ఎన్. ఆర్ గారు- అందరు హీరోల కాంబినేషన్‌లో చెప్పే అదృష్టం కలిగింది నాకు. ఎన్. టి. ఆర్ గారు చాలా స్ట్రిక్ట్. క్వాలిటీ బావుండేందుకు వారు శ్రమ తీసుకుని, ఎన్ని టేక్‌లయినా తోటి ఆర్టిస్ట్ కోసం చెప్పి, అనుకున్న ఎఫెక్ట్ వచ్చేవరకు ఊరుకునే వారు కాదు."

"శోక సన్నివేశాలలో గద్గద స్వరంతో డైలాగ్‌లు చెప్పడానికి వీలుగా మీరు కూడా కళ్ళల్లో గ్లిసరిన్ చుక్కలు వేసుకుంటారా?"

"ఆ అవసరం ఎప్పుడూ రాలేదండి. పాత్రలో లీనమై డైలాగ్ చెప్తూంటే, ఆ ఎఫెక్ట్ ఆటో మేటిక్‌గా వచ్చేస్తుంది."

"సాధారణంగా ఒక్కో చిత్రానికి మీరు ఎన్ని రోజులపాటు డైలాగ్ చెప్పాల్సి ఉంటుంది?"

"నాట్రాక్ మాత్రం చెప్పే పక్షంలో ఒక రోజు చాలు. కాని, సాధారణంగా అలా వీలపడదుకదా? అంచేత ఒక చిత్రానికి నాలుగైదు రోజులు కూడా పట్టవచ్చు. పాత్రని బట్టి కూడా కాల్షీట్ ఉంటుంది."

"మీ పర్సనల్ విషయం.... మీకు వివాహమైందా?"

"అయిందండి. మావారి పేరు రవికాంత్ గారు. వారు కూడా తెలుగు డబ్బింగ్‌లలో వాయిస్ ఇస్తూంటారు. వారు ఎక్కువగా తమిళ నటుడు మోహన్‌కు వాయిస్ ఇస్తూంటారు."

"మీరిద్దరూ కలిసి ఏ చిత్రంలో నైనా హీరో హీరోయిన్‌లకు డబ్బింగ్ చెప్పారా? అప్పుడు మీకు కల్గిన అనుభూతి ఎలాంటిది?"

"కొన్ని చిత్రాలలో ఇచ్చాం. మొట్టమొదట సారిగా అలా చెప్పినప్పుడు ఒక విచిత్రమైన అనుభూతి కలిగింది. ఆ తర్వాత అది మామూలై పోయింది... మాకు ఒక అబ్బాయి, అమ్మాయి సంతానం మీకో విషయం చెప్తే, విస్తుపోతారు."

"ఏమిటండీ అది?"

"మా అమ్మాయి బేబీ మనూ ఎన్నో తెలుగు, తమిళ చిత్రాల్లో నటిస్తోంది. మా అమ్మాయికి కూడా నేనే డబ్బింగ్ చెప్తూంటాను తెలుసాండీ?" అంది విజయదుర్గ.

నిజంగానే విస్తుపోయాను. □

(జి. వి. జి.)

సీరియల్

# మనసుల మెలిసింది

**కళ్యాణీ సోమరాజ్**

(గత సంచిక తరువాయి)

అప్పుడే మూర్తి రిక్షాదిగుతున్నాడు.

"అదేమిటి కారు ఏమైంది!" అంది లో పలికి వచ్చాక ఆశ్చర్యంగా.

"అమ్మేసాను"

"ఎందుకని"

"పెట్రోల్ రేట్ తెగ పెరుగుతోంది. మెయిన్‌టెన్ చేయటం కష్టం అన్పించింది"

"అంతేనా. అప్పుల బాధ తట్టుకోలేక అమ్మేసారా!"

"అప్పుల బాధా ... ఓహో చాలా విషయాలు సేకరించావే"

"నేనేం సేకరించలేదు. నాకా ఇంట్రెస్ట్ లేదు. వద్దనుకున్నా కొన్ని విషయాలు తెలుస్తూనే వుంటాయి."

మూర్తి ఏం మాట్లాడలేదు.

రమ మనస్సు ఎన్నో విధాలుగా అశాంతిగా వుంది. రాక రాక వచ్చిన భర్తతో అప్పుడే దెబ్బలాట దిగినందుకు తనమీద తనకే చికాగ్గావుంది.

"మంచినీళ్ళు కావాలా!" అంది మామూలుగా అయిపోతూ.

"ఊహు."

"కోపమా!"

"లేదు. నువ్వు అన్నదాంట్లో తప్పులేదు రమా? నీకు అన్ని విషయాలు ముందుగా చెప్పకపోవటం నా తప్పే. ఆ పరిస్థితుల్లో అందరిలో వీధిలో పడి దెబ్బలాడడం నాకు చిన్నతనం అన్పించింది. ఆ విధంగా నాన్నగారి పరువు పోగొట్టటం ఇష్టంలేక కొడుకుగా ఆ మాత్రం బాధ్యత స్వీకరించటం తప్పంటావా!"

"తప్పొప్పులు నిర్ణయించగలిగేంతటి దాన్ని కాదు. కాని తలకు మించిన భారాన్ని మీద వేసుకొని మిమ్మల్ని మీరు హింసించుకోవద్దు. అంతకంటే నేను చెప్పేదేమి లేదు" అంటూ లో పలికి వెళ్ళిపోయింది.

"రమా వంట ప్రయత్నం ఏమీ చేయకు!"

"అదేం అప్పుడే వెళ్ళిపోతారా!"

"ఊహు. మనం అలా బయటకు వెళ్ళి ఏ హోటల్లో అయినా తినేసి వద్దాం"

రమకి వంట చేసే ఓపిక లేదనిపించింది.

అతను భోంచేస్తుండగా, "నేను తెనాలిలో వేరే ఇల్లు అద్దెకు తీసుకున్నాను". అన్నాడు హటాత్తుగా.

"వేరే ఇల్లా! ఎందుకు మీ వాళ్ళు ఏమి అనుకోరా!"

రమ అతని వంకే చూస్తోంది, ఏం చెబుతాడో అన్నట్టు.

"రమా! ఇన్నాళ్ళు ధైర్యం చూపలేకపోయాను. ఇప్పుడైనా నా సంసారం నాకు విడిగా వుండాలనిపించింది. నువ్విక ఉద్యోగం మానేసి వచ్చేయి." అంటాడేమోనని ఎదురు చూసింది. నిజంగా అలా మూర్తి అన్నట్టైతే రమ ఆ క్షణంలో బయల్దేరి వచ్చేసేదే! అంతేకాదు 'మూర్తి! మీతో పాటు అన్ని బాధ్యతలు పంచుకొంటాను. ఆ అప్పులు మనం కష్టపడి తీర్చేద్దాం' అని కూడా అనేది.

అయితే మూర్తి అలా అనలేదు.

"మన పెద్ద ఇల్లు ఒక పక్క పోర్షన్ మాత్రం వుంచుకుని మిగిలిన ఇల్లంతా అద్దెకిచ్చాం.అన్నయ్యవాళ్ళు కాస్త నిలదొక్కుకునే వరకు డబ్బు అవసరంకదా! ఇంక ఆ చిన్న పోర్షన్‌లో నేను కూడా వుండి వాళ్ళను ఇబ్బంది పెట్టటం భావ్యంకాదనిపించింది. అమ్మకూడ వాళ్ళతో పాటే వుంటానంది"

"అయితే నా కోసం కాదన్న మాట" రమ నీరసంగా నవ్వుకుంది." మూర్తి! నీ మనసులో ఇంత స్థానం నాకు లేకుండా పోయిందా! ఇందుకేనా మనం ప్రేమించి పెద్దవాళ్ళ మనస్సుల్ని గాయపరచి పెళ్ళిచేసుకున్నది. హు ఏం మగవాళ్ళు" అనుకుంది విరక్తిగా.

రమ ఆ తరువాతేమి మాట్లాడకపోవటం ఆశ్చర్యం కలుగజేసింది మూర్తికి. తను విడిగా ఇల్లు తీసుకున్నానని చెప్పగానే, 'మూర్తి ఇక నేను వచ్చేస్తాను. చెరో వూరిలో ఒంటరిగా బ్రతకటం ఎందుకు' అని అంటుంది అనుకున్నాడు. కాని రమ ఇంక ఆ ప్రసక్తి తీసుకురాలేదు. రమకి పట్టుదల, అహంకారం ఎక్కువ. సంసారం నిలబెట్టుకోవాలన్న కాంక్ష ఎక్కడా కన్పించదు." అనుకొని అశాంతిగా నిట్టూర్చాడు మూర్తి.

* * * * *

"ఇంకో వారం రోజుల్లో నీ ఉద్యోగం గడువు అయిపోతుంది రమా" అంటూ గుర్తు చేసింది రంగనాయికి.

"ఔను ఆంటీ గుర్తుంది నాకు"

"ఏం చేయాలనుకుంటున్నావ్"

రమ ఏం జవాబివ్వలేదు. ఆ ప్రశ్నకి సమాధానం నిజానికి తనకే తెలియదు.

జరిగిన కథ :-6 కట్నం ప్రసక్తి లేకుండా రిజిష్టర్ మేరేజి చేసుకుంటారు, మూర్తి, రమ. రమని వెంట పెట్టుకొని వచ్చిన మూర్తిని తల్లి తండ్రి తూలనాడినా పెద్దన్న, వదిన మాత్రం ఆదరిస్తారు. రమని చూడటానికని వచ్చిన మూర్తి పెద్దక్కయ్య, చిన్నక్కయ్య రమని ఈటెలలాంటి మాటలతో బాధిస్తారు. మర్నాడు మూర్తి, రమల చేత సత్యన్నారాయణ వ్రతం చేయించి, ఆ పీటల మీదే మూర్తి చేత రమకి 'మూడుముళ్ళు' వేయించారు. రమని తీసుకుని మూర్తి తన చిన్నన్నయ్య విశ్వనాథ్ ఇంటికి విజయవాడ వెళుతాడు. విశ్వనాథ్ యశోద వీరిని చూడగానే ఎంతో ఆనందపడిపోతారు. మూర్తి పెద్దన్న అన్న కూతురు సుమతి రమేష్ అనే అతన్ని ప్రేమిస్తుంది. సుమతి వల్ల రమకి తమింటి స్థితిగతులు తెలుస్తాయి. మూర్తి చెల్లెలు ప్రసూనకి, సుమతికి సంబంధాలు నిశ్చయమవుతాయి. సుమతి ఇంట్లోంచి పారిపోతే రమే సుమతిని రమేష్ దగ్గరకి పంపించి ఉంటుందని ఇంటిల్లిపాదీ ఆమెను అనుమానిస్తారు. సుమతి రమేష్‌ని పెళ్ళి చేసుకుంది. రమ వేలు విడిచిన మేనత్త సహాయంతో గుంటూరులో ఉద్యోగం సంపాదించుతుంది. మూర్తి గుంటూరు వారానికి ఒకసారి వచ్చి వెళ్తుంటాడు. మూర్తి తండ్రి మరణించాడు. భర్తకు దూరంగావున్న స్త్రీమీద ప్రతివాడికీ కన్ను ఉంటుందని బావ సుందరం ప్రవర్తన మూలంగా తెలుసుకుంటుంది రమ.

సుందరం వచ్చి వెళ్ళాక రంగనాయికితో ముభావంగా వుంటోంది రమ. ఆ విషయం అర్థం చేసుకోలేని తెలివితక్కువదేమి కాదు రంగనాయికి. రమనెలాగైనా ఒప్పించి సుందరానికిచ్చి పెళ్ళి చేయాలన్న తలంపు రంగనాయికి మనసులో అలాగే వుంది. అయితే రమ సుందరానికి చెప్పినట్లే తనకు సమాధానం చెబుతుందేమోనన్న భయం ఆమెను ధైర్యం చేసి ఆ మాటలు బయటపెట్టనివ్వలేదు.

"ఉద్యోగం మానేసి హాయిగా మూర్తి దగ్గరకు వెళ్ళిపో. ఎటు తిరిగి అతను తెనాలిలో వేరే ఇల్లు తీసుకున్నాడన్నావుగా!" అంది. నిజానికి మూర్తి దగ్గరకు వెళ్ళమనటంలో రమ మనస్థితి తెలుస్తుందని.

"అదే అనుకుంటున్నాను ఆంటీ! ఇలా విడిగా వుండటం వలన మా ఇద్దరి మధ్యా గొడవలు వచ్చాయని నలుగురు అనుకొంటున్నారు. దానికోసం అయినా నా అభిమానం చంపుకొని వెళదామనే అనుకొంటున్నాను" అంది.

రమ అలా సమాధానం చెబుతుందని రంగనాయికి ఆశించలేదు.

ఆ రోజు హఠాత్తుగా వచ్చిన యశోదను చూసి ఆశ్చర్యపోయింది రమ.

"నాక్కూడా గుప్పెడు బియ్యం పడెయ్యి రమా! ఈ రాత్రికి మీ ఇంట్లోనే తిష్ట వేయబోతున్నాను" అంది యశోద పెరటిలో కాళ్ళు, చేతులు కడుక్కుంటూ.

"చాలా సంతోషంగా వుంది అక్కయ్యా! ఎప్పటినుంచో రమ్మని పిలిస్తే ఇప్పటికైనా వచ్చావ్!"

ఇద్దరూ కలిసి కబుర్లు చెప్పుకుంటూనే వంట చేసేసుకున్నారు.

"రమా! ఈ మధ్య మూర్తి వస్తున్నాడా!" భోజనాలు అయ్యాక తీరుబడిగా కూర్చున్నాక అడిగింది.

"చాలా రోజులైంది వచ్చి. ఏం అలా అడిగావు."

"నీతో చెప్పాడా? అతను డిస్పెన్సరీ అంతా అమ్మేసి నైజీరియా వెళ్ళిపోతున్నాడట."

"నిజమా!"

"నీకు తెలియదా!"

"ఊహు. నాకేమి చెప్పరు తను. అయినా నేనేమైన అతని ఆత్మీయురాలినా!"

"భార్యవి. నీ తరువాత కదా ఎవరైనా!"

"అని తను అనుకోవాలి కదా!"

"మొన్న మధ్య వీసా, పాస్‌పోర్టుల కోసం ఢిల్లీ అది వెళ్ళి వచ్చి వస్తూ మా ఇంట్లో దిగాడు. అతనే చెప్పాడు."

"మరి అప్పులవాళ్ళు వదిలిపెడతారా అతన్ని!"

"చాలావరకు తీర్చే వెళతాడట. మిగిలినవి అక్కడికి వెళ్ళాక పంపించేలా ఒప్పందం చేసుకున్నాడట."

"ఫరవాలేదే అన్ని బాధ్యతలు తీర్చుకొనే వెళ్తారన్న మాట. బహుశ నా మొహాన కూడ డైవర్స్ పారేసి పోతారేమో."

"అది సరే మరో విషయం నేను విన్నాను. అందుకే కాళ్ళు చేతులాడక నీ దగ్గరకొచ్చాను. అతని దగ్గర లావణ్య అనే నర్స్ పని చేస్తోందట. ఆ అమ్మాయిని కూడ తీసుకెళుతున్నాడట."

"మూర్తా! అలాంటివాడు కాదు అక్కయ్యా! నేనమ్మలేకపోతున్నాను."

"నేను మొదట నమ్మలేదు. మూర్తి రెండు పాస్‌పోర్టుల కోసం ప్రయత్నిస్తున్నానన్నాడు. రెండవది ఎవరికంటే, అతను 'అది మాత్రం చెప్పను" అంటూ ఎంత అడిగినా చెప్పలేదు."

రమకి భూ ప్రపంచం ఒక్కసారి గిర్రున తిరిగినట్లైంది.

"రమా! నువ్వు ఇప్పటికైనా మేల్కొని నీ సంసారం నువ్వు దిద్దుకో! ఇన్నాళ్ళు అనవసరంగా అతనికి దూరంగా వుంటూ లేనిపోని సమస్యలు కొని తెచ్చుకున్నావ్!" అంటూ యశోద హితబోధ చేసింది.

"అక్కర్లేదు.వెళ్ళనీ. అతనికంత మోజుగా వుంటే, దాన్నే తీసుకుని వూరేగనీ! ఇప్పుడు 'నే' వెళ్ళి అతని కాళ్ళ మీద పడి ప్రార్థించాలా దయాభిక్షపెట్టమని"

యశోద చాలాసేపు నచ్చచెప్పిన మీదట రమ తెనాలి వెళ్ళి అక్కడి పరిస్థితి



తెలుసుకోటానికి నిశ్చయించుకుంది.

★ ★ 12 ★ ★

రమని చూడగానే, మూర్తి పేషెంట్స్ చూస్తున్నవాడల్లా ఇవతలకి వచ్చి, 'రా. రమా! హఠాత్తుగా నిన్నిలా చూస్తుంటే ఆనందంగా వుంది"

'ఆనందంట ఎన్ని నాటకాలైనా ఆడగలరు! అనుకుంది కసిగా.

"లావణ్యా! పైన ఇంటి తాళాలు తీసుకురా. రమా! పైకి వెళ్ళి రెస్ట్ తీసుకో. నేనో పావు గంటలో వచ్చేస్తాను."

"ఆ – కాస్సేపు నేనిక్కడ కూర్చుని వెయిట్ చేయగలను. మీ పని మీరు చూసుకోండి"

రమ పేషెంట్స్ అందరూ వెయిట్ చేసే రూమ్‌లో నే కూర్చుంది. లావణ్య వచ్చి

# ముసురు వెలిసింది

'మంచినీళ్ళు కావాలా' అంటూ అడిగి పోయింది. రమ 'అక్కర్లేదు' అంటూ తిరస్కరించింది. లావణ్య చామన ఛాయగా వున్నా, పెద్ద కళ్ళతో పొడుగాటి జడతో ఆకర్షణీయంగానే వుంది. చాలా చురుగ్గా అటు ఇటు తిరుగుతోంది. రమ కళ్ళు ఆమెనే గమనిస్తూ వున్నాయి.

మూర్తి పేషెంట్స్ అంతా వెళ్ళిపోయాక, రమని పైకి తీసుకెళ్ళాడు. రెండే రూమ్స్. ముందర రూమ్ ఎవరైనా వస్తే కూర్చోడానికి కుర్చీలు వేసి వున్నాయి. దాని తరువాతది బెడ్ రూమ్. బెడ్ రూమ్‌లోనే ఒక మూల చిన్న స్టౌ, కాఫీకి కావాల్సిన సరంజామా అంతా వున్నాయి.

"ఎలా వుంది మన ఇల్లు!" అన్నాడు మూర్తి.

"మన ఇల్లు అనకండి. మీ ఇల్లు!" అంది కోపంగా.

"అదంతా కోపమే! నేనిన్ని రోజుల నుంచి రాలేదనేనా!"

"...."

"నేనీ మధ్య కాస్త పని హడావిడిలో వుండి రాలేకపోయాను"

"ఏమిటా పని"

"అదంతా తీరిగ్గా చెబుతాను. ముందు నువ్వెళ్ళి మొహం కడుక్కురా!"

బహుశ తనకు ఏం చెప్పాలో ఓ పెద్ద కథ అల్లుకోవాలి కాబోలు. రమ మొహం కడుక్కుని వచ్చేసరికి లావణ్య కాఫీ కలుపుతోంది.

"రమా! లావణ్య కాఫీ బాగా కలుపుతుంది."

"అలాగా!" అప్పుడే ఎంత చొరవ సంపాదించిందో అనుకుంది మనసులో.

"లావణ్య కాఫీ కలిపి ఇద్దరికి ఇచ్చేసి వెళ్ళిపోయింది. పాపం తను వచ్చి వాళ్ళిద్దరి మధ్య అందమైన కాలాన్ని పాడు చేసినట్టుంది. లేకపోతే ఆ ఇద్దరూ ఒకరి కళ్ళల్లోకి ఒకళ్ళు చూసుకుంటూ ఆనందంగా కాఫీ తాగేవారేమో. "ఛీ ... ఛీ" రమ ఆ దృశ్యాలన్నిటిని ఊహించుకొని మరీ అసహ్యించుకుంది.

"లావణ్య ఎవరు. మీ నర్సా!"

"అంతేకాదు. ఆమె మాకు దూరపు బంధువు. పాపం జీవితంలో చాలా దెబ్బతింది."

"దెబ్బల్ని నయం చేసే డాక్టర్ మీరుండగా ఇంకా దిగులెందుకులెండి"

"అంటే"

"ఆశ్రయం ఇచ్చి ఆదుకున్నారన్న మాట"

"లేదు ఉద్యోగం ఇచ్చి ఉపాధి కల్పించాను అంతే"

"ప్రస్తుతానికి"

"అంతకంటే ఏం చేయగలం రమా!"

"మీ మగవాళ్ళు తలచుకుంటే ఏమైనా చేయగలరు"

ఇంతలో "కొరియర్ సార్" అంటూ అటెండర్ రావటంతో సంభాషణ ఆగిపోయింది.

"టూ మీల్స్ తీసుకురా!" అంటూ మూర్తి చెబుతోంటే–

"వద్దు. నేను ఇంకో గంటలో వెళ్ళిపోతున్నాను."

"నువ్వెళ్ళి రెండు మీల్స్ తీసుకురావోయ్!" అంటూ అతన్ని పంపించేసాడు.

"నేను తినను"

"ఏమిటి నిరాహార దీక్షా"

"దేనికోసం"

"నన్ను సాధించడం కోసం"

"...."

"లేకపోతే ఏమిటి రమా. మన మధ్య ఎన్ని వున్నా బయటవాళ్ళ దగ్గరేమిటి నీ చికాకులు. ఈ రోజు నా అతిథివి. నేను వస్తే నాకెన్ని సపర్యలు చేస్తావ్. ఆ అవకాశం నాకు కలిగిందిప్పుడు."

'అతిథివి' ఎంత జాగ్రత్తగా మాట్లాడుతున్నారు. అంతేకదా మరి అతిథిలా జీవితంలోంచి త్వరలో నే తను తప్పుకోబోతోంది.

"ఊ. అనవసరంగా మూడ్ పాడు చెయ్యక. త్వరగా రెడీ అవు. దగ్గర్లో మంచి సినిమాహాలుంది. వెళదాం"

"ఫరవాలేదు. నేనిలాగే వస్తాను."

"ఏమిటి నువ్వు ఈ నలిగిన చీరతో వస్తావా! వింతగా వుందే" రమకి అలంకరణ మీద వున్న పిచ్చి మూర్తికి తెలియంది కాదు. ఆమె కనీసం గంట అయినా తీసుకుంటుంది డ్రస్సింగ్‌కి, మేకప్‌కి.

"నేను బట్టలేమి తెచ్చుకోలేదు"

"ఫరవాలేదు నా దగ్గరున్నాయి లే! నీ కోసమనే ఆ మధ్య ఢిల్లీ వెళ్ళినప్పుడు కొన్నాను. రా. అందులో నీకు నచ్చింది తీసుకుని కట్టుకో!" అంటూ సూట్‌కేస్ దగ్గరకు తీసుకెళ్ళాడు మూర్తి.

ఆ ఖరీదైన, అందమైన చీరలు చూడగానే, మనసు మెత్తబడి రమ చేయి పెట్టి అందుకోబోయింది. అంతలోనే ఆమెకు లావణ్య గుర్తుకువచ్చింది. 'బహుశ ఆమెకోసం కొన్నవేమో. తను రాగానే తనకోసం అని చెబుతున్నారు' అనుకొనేసరికి ఆమె వాటి వంక అసహ్యంగా చూసి–

"వద్దు వద్దు. నాకా చీరలేమి బాగాలేవు. ఈ చీరతో నే వస్తాను."

"ఆ చీరలన్ని లావణ్య చూసి నా సెలెక్షన్ విపరీతంగా మెచ్చుకుంది."

"అంత నచ్చినప్పుడు ఆవిడకే ఇవ్వలేకపోయారా!"

"నువ్వింత అసహ్యించుకొంటావని అనుకోలేదు. సరే పద. సినిమా టైమ్ అవుతోంది"

* * * * *

"మీరు విదేశాలకు వెళుతున్నట్టు తెలిసింది. కంగ్రాచులేట్ చేసి పోదామని వచ్చాను" ఆ రాత్రి సంభాషణ అసలు విషయంలోకి లాగుతూ అంది.

"నిజమే రమా! నా ప్రయత్నం పూర్తి అయ్యాక నీకు చెబుదామనుకున్నాను."

"అంటే ఎప్పుడూ. ఎయిర్‌పోర్ట్‌కి పోతూనా!"

"పాస్‌పోర్ట్, వీసా అన్ని వచ్చాక ఒక్కసారి చెప్పి నిన్ను ఆనందంలో ముంచాలని"

"ఎన్ని ఏళ్ళు మకాం"

"చెప్పలేను"

"ఎందుకింత హఠాత్తుగా ప్రయాణం పెట్టుకున్నారు"

"చాలా కాలం నుంచే అనుకుంటున్నాను రమా! ఎప్పుడో అప్లై చేసినదానికి ఇప్పుడు వాళ్ళ దగ్గర నుంచి రిప్లై వచ్చింది."

"ఇంతకీ అనుమతి ఇచ్చారా!"

"ఎవరు?"

"మీ వాళ్ళు."

"ఇంకా అడగలేదు."

అప్పుడు కూడ మూర్తి మనస్సు విప్పి మాట్లాడనందుకు రమకు చాలా రోషంగా వుంది.

"నా ఉద్యోగం పీరియడ్ అయిపోయింది"

"తరువాత ఏం చేయాలనుకుంటున్నావ్!"

"ఏం చేస్తాను. మీకు, ఈ వూరికి గుడ్‌బై చెప్పి మద్రాస్ వెళ్ళిపోతాను. అమ్మావాళ్ళందరి ముందు నేను వోడిపోయానని ఒప్పుకుంటాను" ఆ మాటలంటుండగా ఆమె కంఠస్వరం ఒణికింది. కన్నీళ్ళు వాటంతటకవే జారి పడ్డాయి. మూర్తి ముందర ఏడవకూడదనుకున్నా ఆమె వశం కాలేదు.

"రమా! నువ్వు ఓడిపోలేదు. ఆ ఓటమి ఏదైనా వుంటే నాది"

"మీదెందుకవుతుంది. మీకు నా మీద మోజు తీరింది. మరొకళ్ళను మీ జీవితంలోకి ఆహ్వానించుకున్నారు. నా పీడ వదలాలంటే ఇండియాలో వుండి లాభం లేదనుకున్నారు"...

"నువ్వేం మాట్లాడుతున్నావో నాకర్థం కావటంలేదు."

"ఎందుకర్థం అవుతాయి. అసలు నేనే మీకు అర్థంకాలేదు. మీరు రెండో పాస్‌పోర్ట్ కోసం ప్రయత్నం చేస్తున్నట్టు, అది లావణ్య కోసమే అని మీరు చెప్పకపోయినా అందరికి తెలుసు. ఒక పక్క లావణ్యతో మీరు ఈ దేశం వదిలి

# అవ్యవస్థ

సింగారించుకొనకపోయినా
బంగారంలాంటి మా శ్రీమతి
మౌనముద్ర మనసును ఉసికొల్పుతున్నా –
కవిత వ్రాయాలనిపించదు
కలం పట్టాలనిపించదు!!

నల్ల కలువల అందాన్ని
కొల్లగొట్టిన కళ్ళూ –
దొండపండు ఎఱ్ఱదనాన్ని
దోచుకొన్న పెదవులూ –
ఎన్నెన్నో ఊహలు రేపుతున్నా –
కవిత వ్రాయాలనిపించదు
కలం పట్టాలనిపించదు!!

ముత్యాల ముక్కెర ముక్కూ
వంకర ముంగురుల టెక్కూ
నల్లని నూగారు నిక్కూ
పిడికిడైన నడుము తక్కూ
ఎదలో సన్నాయి నొక్కులు నొక్కుతున్నా –
కవిత వ్రాయాలనిపించదు
కలం పట్టాలనిపించదు!!

మణికంకణ నిక్వాణాలు
కల కూజిత నిస్వనాలు
పద మంజీర కల స్వనాలు
సందడి జేస్తూ స–రస భావాలు పొంగిస్తున్నా –
కవిత వ్రాయాలనిపించదు
కలం పట్టాలనిపించదు!!

చిల్లులు పడిన జీవనపాత్రను నేను
చితికిన వ్యవస్థలో అతకని అవస్థ నాది!!

—చింతలపాటి పూర్ణచంద్రరావు

# ముసురు వెలిసింది

పారిపోవాలని అన్ని ప్రయత్నాలు చేస్తూ, నా దగ్గర ప్రేమ నటిస్తూ నాటకాలు ఆడతారా. ఇంకానన్ను ఎంత కాలం మోసం చేయాలని ..."

"మైగాడ్ నీకివన్నీ ఎవరు చెప్పారు"

"మీకు, నాకు సంబంధించిన వాళ్ళే. ఆత్మీయులు"

"ఆత్మీయులనక. మన జీవితాలతో చెలగాటమాడే విషపురుగులు."

"ఛ. అంత మాటనకండి. మీ నిజం బయటపడిందనేగా మీకింత అక్కసు"

"ఏమిటి నిజం."

"మీరు ఆ రెండో పాస్‌పోర్ట్ లావణ్యకోసం కాదా ..."

"కాదు. కాదు. నీ కోసం రమా! ముందరగా చెబితే వద్దంటావేమోనన్న భయం. మెల్లగా నిన్ను బ్రతిమిలాడి, ఒప్పించి తీసుకెళ్ళాలన్న కాంక్ష. నేనంటే నీకు ఎలాటి అభిప్రాయం వుందో తెలియదు. ఈ మధ్య నా మీద ప్రతిదానికి మండిపడుతున్నావ్! ఇక నా వెంట వస్తావో రావో అన్న భయంతో అందరి దగ్గర రహస్యంగా వుంచాను."

రమ మౌనంగా అతను చెప్పేది వింటోంది.

"లావణ్య గురించి ఎంత దారుణంగా మాట్లాడావ్! ఆమె నాకు వరసకి చెల్లెలవుతుంది. డ్యూటీలో వున్నప్పుడు తప్పించి మిగిలిన సమయంలో 'అన్నయ్యా' అని ఆపేక్షగా పిలుస్తుంది. లావణ్య నాకు చిన్నప్పటినుంచి తెలుసు. చాలా పేద కుటుంబంలో పుట్టింది. తల్లి, దండ్రి చదువు చెప్పించే పరిస్థితిలో లేకపోతే, ఆ ఇంట్లోను, ఈ ఇంట్లోను పై పనులు చేసికొని చదువుకొంది. కట్నం ఇచ్చి పెళ్ళి చేయగల స్థితిపరులు కాకపోవటంతో లావణ్యని ఓ రెండో పెళ్ళి సంబంధానికి చేసారు. అతను రెండేళ్ళ నుంచి పక్షవాతంతో బాధపడుతూ, మంచంలో వుంటే, సంసారం నడపటం కోసం ఉద్యోగం చేస్తోంది. అలాటి లావణ్య గురించి ఎంత భయంకరంగా ఆలోచించావ్. కొందరు జీవితం విషాదభరితమైనా చిరునవ్వుతో నే జీవిస్తారు. మరికొందరు లేనిపోని విషాదాన్ని నింపుకొని తమ సుఖమే కాకుండా, ఎదుటి వాళ్ళ సుఖం కూడా పాడు చేస్తారు ..."

"మీ దృష్టిలో బహుశ నేను అలాంటిదాన్ననేగా! ఎక్కడికక్కడ రాజీపడి మీతో బ్రతకాలనే చూసాను. కాని నేనంటే మీవాళ్ళకే గౌరవం లేదనుకున్నాను. కాని మీక్కూడా లేదు."

"నువ్వెప్పుడూ నీ వైపు నుంచే ఆలోచిస్తావు రమా! అదే నా బ్యాడ్ లక్. నీ కోసమే ఈనాడు నా వాళ్ళను, నా దేశాన్ని వదిలిపోవడానికి సిద్ధమయ్యాను".

"నా కోసం అనకండి. నేను ఏనాడు మిమ్మల్ని దేశాలు పట్టుకుపొమ్మనలేదు. మీరే అప్పుల భారం మీదవేసుకొని డబ్బు సంపాదించటం కోసం ఈ నిర్ణయానికి వచ్చి వుంటారు"

"సరే. నేను ఏం చెప్పినా నమ్మే స్థితిలో లేవు. ఇక నీ ఇష్టం. అంతేకాదు. నా నుండి పూర్తి స్వేచ్ఛ కూడ నీకుంది. మనం ఏ ముహూర్తాన పెళ్ళి చేసుకున్నామో, అటు మీ వాళ్ళను, ఇటు మా వాళ్ళను మెప్పించలేకపోయాము. ఇప్పుడు మనల్ని మనం గౌరవించుకోలేని స్థితిలో వున్నాం. ఆఖరికి నువ్వు ఎవరి మాటలో నమ్మి నన్ను అనుమానించే దశకు వచ్చావ్!"

రమ మౌనం.

"నీ గురించి, మీ బావ సుందరం గురించి కూడ నేను విన్నాను."

"బహుశ మీ అక్కయ్య చెప్పి వుంటారు."

"అబద్ధమా, నిజమా అని నిన్నేనాడు నిలతీయలేదు."

"అంటే ... అతన్ని నేను ప్రేమించానంటారా!"

"అని నీలాగా నేననలేదు. నాకు తెలుసు నా భార్య మనసు. అది మేలిమి ముత్యం అంత స్వచ్ఛమైనదని, మంచి గంధం అంత పవిత్రమైనదని."

"నేను లావణ్య విషయంలో పొరపాటు పడిందానికి క్షమించండి. అయితే మీరు అన్ని విషయాలు నా దగ్గర దాచి నన్ను దూరం చేసింది మాత్రం అబద్ధంకాదు."

"బహుశ మా కుటుంబంలో జరిగిన కలతలు నీకు చెప్పుకోలేదేమో! మా వాళ్ళంటే అప్పుడే నీకు ఏహ్య భావం ఏర్పడింది. ఇక వాళ్ళ గురించి ఏం చెప్పను. సరే. అవన్నీ అప్రస్తుతాలు. ముందు భవిష్యత్ నీ చేతిలో వుంది. నీ ఇష్టం. నువ్వెలా నిర్ణయించుకున్నా! అలాగే అమలుజరుపుతాను." అంటూ మరోమాటకు తావివ్వకుండా లోపలికి వెళ్ళిపోయాడు.

రమ చాలాసేపు ఆలోచిస్తూ ఒంటరిగా అలాగే కూర్చుండిపోయింది. తరువాత మెల్లగా బెడ్‌రూమ్‌లోకి నడిచింది. బెడ్‌లైట్ కాంతిలో, తెల్లని లాల్చి, పైజామాతో మూర్తి ఓ పక్కకి తిరిగి పడుకొని వుండటం చూసి, మెల్లగా అతని పక్కన చేరింది. రమ చేతులు మూర్తి మెడ చుట్టూ అల్లుకోవటం గ్రహించినా మూర్తి కదల్లేదు. అతను నిద్రపోవటం లేదని రమకు తెలుసు.

"అంతా కోపమే!"

"నువ్వెవరివని నీ మీద నేను కోపం తెచ్చుకుంటాను."

"మీ అర్ధాంగినని"

"హు. అపుడప్పుడు చాలా హాయిగా మాట్లాడి నన్ను కవ్విస్తావు. తీరా చొరవ తీసుకొని దగ్గరకు రాబోతే మాటలతో గాయపరుస్తావు. ఇంతకీ ఏం నిర్ణయించుకున్నావ్!"

"రేపో, మాపో బైలుదేరి మద్రాస్ వెళ్ళిపోదామని"

"సరే. పో. ఇక్కడ నుంచి."

"ఊహుం పోను"

"మంచం మీద నుంచి తోస్తాను"

"ఈ రోజు మంచం మీద నుంచి తోస్తారు. రేపు విమానంలోంచి తోస్తారు. మిమ్మల్ని నమ్ముకుని మా వాళ్ళను వదిలేసి రావటం ప్రమాదకరమే".

"అంటే నువ్వు నాతో వచ్చేస్తావా!"

"ఆఁ. మనసా ... వాచా!"

"చాలు ఇంకేం చెప్పక." అంటూ రమను గట్టిగా కౌగలించుకొని ఉక్కిరిబిక్కిరి చేసాడు.

* * * * *

ఎయిరోడ్రోమ్‌కి రమ తల్లీ, దండ్రి, మూర్తి, చిన్న అన్నయ్య, యశోద వచ్చారు.

ప్లేన్ బయలుదేరటానికి అట్టే టైమ్ లేదు. ఒక విధంగా అందరి మనసులు వాళ్ళను సాగనంపుతున్నందుకు బెంగగా వున్నా, మూర్తి, రమ కలిసి వెళుతున్నందుకు తృప్తిగా వుంది.

"రమా! నీకు లావణ్య గురించి, మూర్తి గురించి లేనిపోని అబద్ధాలు చెప్పాను. నన్ను క్షమించు. నువ్విలా చెబితే అన్నా నీ సంసారం గురించి జాగ్రత్తపడతావని చెప్పాను."

"నేను అర్థం చేసుకోగలను అక్కయ్యా! నువ్వు నాకు మంచే చేసావు కాని చెడు చేయలేదు." అంది మనస్ఫూర్తిగా.

రమ, మూర్తి అందరికి చేయి వూపుతూ వెళ్ళిపోయారు.

"అబ్బ. మళ్ళీ మనిద్దరం కలిసి ప్రయాణం చేస్తున్నామంటే నాకింకా నమ్మకం కుదరటంలేదు రమా! నువ్వు కోరుకున్నట్లే మనిద్దరమే వుంటాం. మనవాళ్ళనుకునే మరో ప్రాణి వుండదు" అన్నాడు సీటుకు జారగిలపడుతూ!

"ఆ కోరిక తీరలేదండి మూర్తిగారు. మహా వుంటే ఆరు నెలలు. తరువాత మన జీవితంలోకి మరో ప్రాణి వస్తోంది"

ఒక్క ఉదుటన కూర్చుని "నిజం. మరి నాకు చెప్పలేదేం"

"మీరన్ని నాకు చెప్పి చేసారా!"

"ఇంకా నామీద కోపం పోలేదన్న మాట. ఒరే చిన్ని నాన్న, నువ్వు పుట్టినా మీ నాన్న మనసులో వుంది మీ అమ్మే అని చాటి చెప్పరా!"

"మంచి సాక్ష్యమే!" అంటూ వెక్కిరించి ..." అంత బెంగపడకండి. ఈ నాన్న మనసులో మరొకరు చోటు చేసుకొనే వీలులేకుండా ఈ అమ్మ ఆక్రమించుకొని కూర్చుందని మీ బుజ్జి తండ్రికి తెలుసులేండి."

మూర్తి, రమ తామున్నది ఆకాశవీధి అయినా స్వర్గ వీధిలో విహరిస్తున్నంత ఆనందంలో తన్మయులైయ్యారు.

(అయిపోయింది)

## అంకితం

నా రచనలను ఎంతో మక్కువతో, ఆసక్తితో చదివి, నన్ను అభిమానంతో ప్రోత్సహించే మా అక్క-బావలు శ్రీమతి ఇందిరా-శ్రీ పార్థసారధులకు ఈ చిన్ని నవలా పుష్పం.

-కల్యాణి

# సుభాషితాలు

పరివర్తిని సంసారే మృతః
కో వా న జాయతే
స జాతో యేన జాతేన
యాతి వంశః సమున్నతిమ్




పుట్టడం గిట్టడం అని పరిభ్రమణ శీలమైన సంసారంలో చనిపోయిన వాడెవడు మరల పుట్టడం లేదు? కానీ ఎవడి వల్లనైతే వంశం గొప్పదౌతుందో వాడే నిజంగా పుట్టిన వారిలో చేరుతాడు.

సహసా విదధీత న క్రియాం
అవివేకః పరమాపదాం పదమ్
వృణుతే హి విమృశ్య కారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః




ఆలోచించకుండా ఏ పనిని అవసరపడి చేయరాదు. అవివేకం అన్ని ఆపదలకు పెద్ద ఆటపట్టు. విమర్శించి పని చేయు వానిని గుణ పక్షపాతం గల సంపదలు తాముగానే వరిస్తాయి గదా!

-ఆయుర్వేద శిరోమణి రాజరాజేశ్వరశర్మ

# సామాన్యంలోంచి...
# యిదుగో వస్తున్నది అసామాన



**సమర్పిస్తున్నాం కొత్త C.T.S. 919 రిమోట్ కంట్రోల్ అసామాన్య విశేషణాలతో**

క్లాస్ ఉత్పాదన కేవలం క్లాస్ ఉత్పాదనే. ప్రతిసారీ ఇదే మీకు సోలిడైర్ యిచ్చే హామీ. అలాగే యిప్పుడూను. కొత్త CTS 919 ఇది అసామాన్యమైనది నాజూకు తనంలో, పనిలో, సౌకర్యంలో ధర విషయం వేరే చెప్పాల్సిన పనేలేదు. దీన్ని ఇతరాలతో పోల్చిచూసే అవకాశం మట్టుకు లేదనుకోండి. దేనితోను పోల్చడానికి వీల్లేని అసామాన్యమైన ప్రత్యేక విశిష్టతలు దీ వున్నాయి.

**అతుల్యమైన ప్రపంచ క్లాస్ విశిష్టతలు**

- అత్యంత నమర్ధమంతంగా 20 రకాల పనుల నిర్వర్తించే రిమోట్ కంట్రోలు. ప్రతి పనికి ప్రత్యేక కంట్రోలు దీనికొక్కదానికే
- బటన్‌ను అలా స్పృశించగానే "మొత్తం పవ ఆఫ్"లో రిమోట్ కంట్రోలు దీనికొక్కదాని

# కాన్సర్ బాలల కేరింతాల మజిలీ

ఇక్కడ ఆరుబయట నిలబడి పిట్టకూత వింటూ వుంటే ఎంతో బావుంది. ఆస్పత్రిలో వుండగా ఇలాంటిది వినలేదు. ఇట్లా బయట కొచ్చి నిలబడతాననుకోలేదు" అంటాడు పద్నాలుగేళ్ల బారెడ్స్లీ, కర్రల సాయంతో నిలబడుతూ. ఇతను ఎముక – కాన్సర్ శస్త్రచికిత్స కోసం పది వారాలు ఆస్పత్రిలో ఒంటరిగా గడిపాడు. తర్వాత ఇక్కడ మజిలి చేస్తున్నాడు, మిగతా పిల్లల్లాగే. "వీళ్లకున్న జబ్బు, రేడియేషన్ చికిత్స ఇవన్నీ వాళ్లను మామూలు జీవితాల నుండి పిల్లల కొచ్చే కాన్సర్ వాళ్ల ఆనందమయ బాల్యజీవితాన్ని నాశనం చేస్తున్నాయి. ఆ పిల్లలకు ఇల్లాంటి చోట ప్రశాంతంగా వుంటుంది" అంటాడు అక్కడ 'మజిలి' ఏర్పాటు చేసిన పెప్పర్ ఎబ్రామ్స్. ఇతని పదేళ్ల కొడుకు డేవిడ్‌కు లుకేమియా జబ్బు వుంది.

సదరన్ కాలిఫోర్నియా కాన్సర్ సర్వీసెస్ పేరిట బాలల కోసం ఒక 'మజిలి' ఏర్పాటు చేసారు. ఇది విరాళాలతో పని చేస్తున్నది. ఒక్కొక్క అబ్బాయికి, అమ్మాయికి 350 డాలర్లు ఖర్చు అవుతుంది. తల్లిదండ్రులు ఇవ్వగలిగితే 25 డాలర్లు మాత్రం వసూలు చేస్తారు. ఈ 'మజిలి' నలభై ఎకరాల విస్తీర్ణం గల స్థలంలో 'యాలిబు'కు పైన పర్వత ప్రాంతంలో ఏర్పాటు చేసారు. అక్కడ పిల్లలు చేపలు పట్టుకోవచ్చు. గుర్రపు స్వారి చెయ్యవచ్చు. గుట్టలు ఎక్కవచ్చు. చలిమంటలు వేసుకుని హాయిగా పాటలు పాడుతూ గడపవచ్చు. తల గడలతో సరదాగా కొట్టుకోవచ్చు – వీటిల్లో కొన్ని వారి జీవితాల్లో మొదటి అనుభవం కావచ్చు! వాళ్ల సరదాగా కాలక్షేపం చేస్తున్న సమయాల్లోనే వాళ్లకు చికిత్స చేస్తారు.

'కాన్సర్ పిల్లలు తామెంతో పాపం చేయబట్టే ఇట్లా జబ్బు పడ్డాం అని బాధపడుతూ వుంటారు." అంటాడు ఎబ్రామ్స్. "మా ప్రయోగవైద్యశాల విజయవంతం కావాలని అనుకుంటున్నాం. ప్రతి పిల్లవాడు అన్ని పనులు చెయ్యకలగాలి. పిల్లలు ఎంతో మంది స్నేహితులను తయారు చేసుకోవటానికి, హాయిగా కేరింతలు కొట్టడానికి ఈ మజిలిలో అవకాశం వుంది. ఒక్క కాలు వున్నా కూడా ఇక్కడ ఈత కొట్టగలరు. మిగతా చోట్ల ఇట్లా చెయ్యగలరా?" అంటాడు డాక్టర్ చెరిల్ రూబిన్ స్టీన్. ఈయన ఆ మజిలి వైద్యశాల అసిస్టెంట్ డైరెక్టరు. లాస్‌ఏంజిల్స్‌లో వున్న పిల్లల ఆస్పత్రిలో మానసికవేత్త పిల్లలు ఇక్కడ ఒకళ్ళకొకళ్లు సాయం చేసుకుంటారు. సరదాగా గడుపుతారు. ఓ పన్నెండేళ్ల పాపకు తలవెంట్రుకలు లేవు.తల మీద గుడ్డ చుట్టుకుని వుంటుంది. తల మీద గుడ్డ తీసి వేయాల్సి వస్తుందని, అసలు ఈత కొలనులోకి దిగనే దిగదు. ఎముక కాన్సర్ గల ఓ పదకొండేళ్ల పిల్లవాడు. "నువ్వు తల మీద గుడ్డ తీసివేస్తే, నేను నా పెట్టుడు కాలు తీసేస్తా" అన్నాడు. ఓ రోజు రాత్రి ఆ పిల్ల తల మీద గుడ్డ తీసి పారేసింది. ఆ పిల్లవాడు పెట్టుడు కాలు తీసివేసాడు. ఇద్దరూ తమ రోగ లక్షణాలు మరచిపోయి కొలనులో ఈదులాడారు.

"మా అమ్మాయి 'లుకేమియా' జబ్బుతో పోయింది. అప్పటికి ఇట్లాంటి చికిత్సాలయం లేదు. మిగతా మా ఇద్దరమ్మాయిలు కూడా ఈ చికిత్సాలయంలో చేర్చ,



కాలేయానికి సంబంధించిన కాన్సర్ ఉన్న పిల్లవాడికి మందులు ఎక్కించడానికి ఛాతిలోకి గొట్టాన్ని అమరుస్తున్న నర్సు.

నన్నూ రమ్మని గొడవ చేసారు. ఇక్కడి వాతావరణం చూసాక, ఇక్కడే వుండిపోవాలనిపించింది." 49 ఏళ్ల బార్బరా షెర్‌మాన్ అంది. స్వచ్ఛందంగా అక్కడ సేవ చేస్తోంది. ఫోటోలు సేకరించి ఆల్బం తయారు చేయటంలో పిల్లలకు సాయపడుతుంది. విరాళాల రూపంలో వచ్చిన కెమేరాలు, ఫిల్ములు ఉపయోగించి పిల్లలు ఫోటోలు తీస్తూ గడుపుతారు. "ఎప్పుడైనా మనసు బాగోనప్పుడు ఆ ఫోటోలు చూస్తూ వూరట చెందుతారు" అంటుంది షెర్‌మాన్.

చేపలు పట్టటంలో జెక్కుస్పాన్నీ పిల్లలకు సాయపడుతూ వుంటాడు. ఒక్కోసారి పసిఫిక్ సముద్రం బీచ్‌కు వెళతారు. 'ఓ! సముద్రం నీళ్ళు ఉప్పగా వున్నాయే!' అని ఆశ్చర్యపోయాడు ఓ పిల్లవాడు, మొదటి సారిగా ఆ నీళ్ళు గుటకవేసి. ఆడేవాళ్ళు ఆడతారు. స్నానం చేసేవాళ్ళు చేస్తుంటారు.

పన్నెండేళ్ల డేనీ హెరేరా నాట్యం చెయ్యటం అలవాటు చేసుకుని, తను ఇంత గొప్పగా నాట్యం చెయ్యగలుగుతున్నందుకు ఆశ్చర్యపోయాడు. "మా ఇంటి ప్రక్కన ఓ రౌడీ వున్నాడు. వాడితో మహా గొడవగా వుండేది. నాతో ఎప్పుడూ తన్నులాటకు సిద్ధపడే వాడు. నాకు క్యాన్సర్ అని చెప్పినా వినేవాడు కాదు. నాకు ఇక్కడ వుంటినే బాగుంటుంది" అంటాడు.

ఒక్కోసారి అందరూ కలసి నాట్యం చేస్తారు. నీళ్ల రంగులు చల్లుకుంటారు. ఆ సమయంలో తాము అవిటివాళ్లం అన్న సంగతి పూర్తిగా మరచిపోయి, కేరింతలు కొడుతూ గడిపేస్తారు.

ఇక్కడి సంతోష వాతావరణం వలన, చనిపోతారు అనుకున్నవాళ్ళు కూడా ఎక్కువ కాలం బ్రతుకుతున్నారు. "చిరునవ్వుతో అంటుంది డాక్టర్ రూబిన్‌స్టీన్.

డాక్టర్ స్టువార్టు సీగెల్, హెడ్ నర్సు బార్బరా బ్రిట్ మరో అయిదుగురితో అక్కడ ఆ "మజిలి" నడుస్తున్నది. "ముప్పయేళ్ల క్రితం ఇటువంటి చికిత్సాలయం పెట్టినా ప్రయోజనం వుండేదికాదు. ఎందుకంటే, అప్పుడు లుకేమియా క్యాన్సర్ వచ్చి బ్రతికిన వాళ్ళు దాదాపు సున్న. క్యాన్సర్ వచ్చినట్టు కనిపెట్టిన కొద్ది మాసాలకే చనిపోయేవారు. "కెమో థెరపీ" అనే చికిత్సా విధానం వల్ల పరిస్థితి మెరుగయింది. భోజన సమయంలో ఐదు నుంచి తొమ్మిది మాత్రలు వేసుకున్న తర్వాత, ఇంజక్షన్లు తీసుకోవటం కోసం భయం లేకుండా బారులు తీర్చి నిలబడతారు. పిల్లల ఎదలో ట్యూబులు గుచ్చి, వాటి ద్వారా మందు ఎక్కిస్తారు. వీటివల్ల పిల్లలు భయపడరు. వాళ్లంతట వాళ్లే వచ్చి చికిత్సకోసం నిలబడతారు. "ఈ చికిత్స వారికి చాలా ముఖ్యం" అన్న విషయం వారు గుర్తిస్తారు.

"ఇంకో ఐదు వారాలపాటు ఇక్కడే వుండాలనిపిస్తోంది" అన్నది సామంత అనే అమ్మాయి, ఆ చికిత్సాలయం నుండి బయలుదేరుతున్న రోజున. కానీ వేసవిలో రెండు వారాలు మాత్రమే తెరచివుండే ఆ చికిత్సాలయం ఆమె కోరిక తీరుస్తుందా?" పెప్పర్ ఎబ్రోమ్ ఆమె కలను గుర్తించి దానిని ఎప్పుడూ తెరచివుండే చికిత్సాలయంగా మార్చి, లాస్ ఏంజల్స్‌లో వున్న వందలాది క్యాన్సర్ బాలలకు సేవ చేస్తాడని ఆశించాలి. వ్యాధి ముదిరిన పిల్లలు, తమ చివరి రోజులు గడపటం కోసం అక్కడేకొన్ని ఒంటి గదులు వున్నాయి. తల్లిదండ్రులు తమ పిల్లలతో అక్కడ వుండవచ్చు.

ఈ మధ్యనే సాంటామొనికా పర్వత ప్రాంతంలో 55 ఎకరాల స్థలం మెక్‌డొనాల్డ్ ఆపరేటర్స్ అసోసియేషన్ వారికి కేటాయించారు. ఈ సంస్థ క్యాన్సర్ చికిత్సాలయాలకు తోడ్పడుతుంది. ఇది మూడున్నర లక్షల డాలర్ల ఖర్చుతో ఏర్పాటు చేయబడుతుంది. ఈ పథకానికి– అంటే 120 మంది పిల్లలకు చికిత్స చేయటానికి, అక్కడి సిబ్బందికి నలభై లక్షల డాలర్లు అవుతుంది. పన్నెండు లక్షల డాలర్లు అప్పుడే విరాళంగా సేకరించారు. ఈ సంవత్సరంలో దీని నిర్మాణం ప్రారంభం కావచ్చునని అనుకుంటు న్నారు. ఒక ఆస్పత్రి, ఒక చెరువు, ఒలింపిక్ పోటీలో ఏర్పాటు చేసేటంత పెద్ద ఈతకొలను, గ్రోవ్ చెట్లు ఇవన్నీ ఆ పథకంలో వున్నాయి.

"ఒక్కొక్క పిల్లాడు పోయినప్పుడల్లా ఒక్కొక్క చెట్టు నాటడానికి నిర్ణయించుకున్నాం. వాటిలో సగం పెరిగి, బ్రతికి కొందరి పిల్లల గుర్తుగా మిగిలిపోతాయి" అంటాడు ఎబ్రామ్.

(లైఫ్ ఆధారంగా)

–బాబు



# లిఫ్ట్

విన్నకోట సుశీలాదేవి

"హలో! గుడీవినింగ్ మేడమ్!"

లత తలతిప్పి చూసింది.

అతడే...నల్లప్యాంటు.... ఎర్రగళ్ల చొక్కా, మెడలో కర్చీఫ్...నోట్లో సిగరెట్-కళ్లకు పెద్ద గాగుల్స్. ఒక కాలు మోటార్ సైకిలు మీద-మరో కాలు నేల మీద ఆన్చి నిలబడ్డాడు.

అతడిని చూడగానే మండిపోయింది లతకు. విసురుగా ఏదో అనబోయింది. కానీ అతికష్టం మీద కోపాన్ని అపుకుంది.

అతడు నోట్లోంచి సిగరెట్ తీసి చేతిలో పట్టుకున్నాడు.

"మేడమ్!లిఫ్ట్ కావాలా?" విలాసంగా పొగవదుల్తూ అన్నాడు.

అతడి చెంప ఛెళ్లుమనిపిద్దామనుకుంది. కానీ ధైర్యం చేయలేక పళ్లు కొరుక్కుంటూ వుండిపోయింది.

"మేడమ్! ఏమిటింకా ఆలోచన బస్సు ఇప్పుడిప్పుడే రాదు. కమాన్! రండి! కన్నుగీటుతూ అన్నాడు.

అతడి తీరు లతకు కోపం-బాధ- అవమానాన్ని కలిగించాయి.

అతడు ఇప్పటికి దాదాపు మూడు నెలల నుండి సాయంత్రం వేళలో- ఈ బస్సుస్టాపులో కనబడుతూనే వున్నాడు.

మొదట్లో తనని చూసి నవ్వేవాడు. ఆతర్వాత 'గుడ్‌మార్నింగ్'చెప్పేవాడు. "ఈమధ్య లిఫ్టిస్తాను రండి" అని పిలవడం మొదలెట్టాడు.

అతడి వ్యవహారం కోపాన్ని కలిగిస్తున్నా అతడినేమీ అనలేకుండా వుంది.

తను వుద్యోగం చేస్తున్నా- ఆడపిల్ల- అశక్తురాలు. అతడు రౌడీలా వున్నాడు. తనేదైనా అంటే అతడు మరీ మితిమీరి పోవచ్చు. తనని ఆదుకునే వారెవ్వరూ వుండరు. ఆ భయమే తన నోరు నొక్కేస్తోంది. అతడెంత అవమాన కరంగా మాట్లాడినా భరిస్తోంది.

రోజూ బస్సుస్టాపు జనంతో కిటకిటలాడుతూ వుండేది. కానీ ఈ రోజు తనకు ఆఫీసులో అలస్యమైంది. తను బస్సుస్టాపుకు వచ్చేసరికి చాలా బస్సులు వెళ్లిపోయాయి! ఇవ్వాళ తనకు ఆలస్యమైంది కాబట్టి "అతడి" బారి నుండి తప్పించుకుందని సంతోషించింది. కానీ అతడు మళ్లీ తయారయ్యాడు!

ఈ రోజు ఈ స్టాపులో ఒక పల్లెటూరి మనిషి తప్ప ఎవ్వరూ లేరు. అందుకే అతడు మరీ రెచ్చిపోతున్నాడు! తను కొద్దిసేపు ఇక్కడుంటే తనని ఎత్తుకెళ్లి మోటార్ సైకిల్ మీద కూర్చొబెట్టుకునేట్టున్నాడు. అనుకుని లత మాట్లాడకుండా ముందుకు అడుగేసింది.

"మేడమ్! మీకిది న్యాయమా, ఈ దీనుడిని ఒంటరి వాడిని చేసి వెళ్లిపోతున్నారా, ఈ చల్లని సాయింత్రాన్ని వృధా చేస్తారా?"

అతడంటున్నాడు.

లత విననట్లు నడవసాగింది.

అంతవరకూ అతడి వ్యవహారాన్ని గమనిస్తున్న ఆ పల్లెటూరి వ్యక్తి కల్పించుకున్నాడు!

"ఎందుకు బాబూ! ఆ అమ్మాయిని అలా అల్లరి పెడతావ్! పాపం ఆడపిల్ల-అమాయకురాల్లా వుంది.నీమాటలకెలాబెదిరిపోతోందో చూశావా!"

దాని కతడు పెళ్లున నవ్వాడు.

"వీళ్లు అమాయకులా! కాదండీ బాబూ! గుండేలు తీసిన బంటులు" మీరు పల్లెటూరివారు. మీకీ పట్నవాసపు ఆడ పిల్లల గురించి తెలీదు. ఉద్యోగాలు చేస్తున్న ఆడపిల్లల్ని చూసి జాలి పడకండి.వీళ్లు వుద్యోగాలు చెయ్యడం విచ్చలవిడిగా తిరగడానికి సుఖాలు పొందడానికి, ఈ అమ్మాయిని చూడండి' ఎంత చక్కగా తయారయిందో? ఇప్పటికి ఎంతమందితో తిరిగిందో!....మొదట్లో ఏదో కొద్దిగా బెట్టు చేస్తోంది. రేపీపాటికి వచ్చి నా ఒళ్లో వాలకపోతే చూడండి....." అన్నాడు మోటార్‌సైకిల్ స్టార్టు చేస్తూ.

లత ఇక వినలేక చకచకా అడుగులు వేసింది!

నాలుగు రోజులు గడిచాయి.

ఒకరోజు సాయంత్రం లత మామూలుగా బస్సుస్టాపు దగ్గర నిలబడింది.

అతడు మోటార్‌సైకిల్ మీద వచ్చి లత కెదురుగా ఆగాడు.

"హల్లో మేడమ్" ఇవ్వాళయినా నా కోరిక తీరుస్తారా! నా వెనక సీటు మిమ్మల్ని ఆహ్వానిస్తోంది, నాలాగా అది కూడా మీకోసం తహతహలాడుతోంది!

లత ఒక్కక్షణం సందేహించింది. చుట్టూ చూసి చటుక్కున వచ్చి అతడి వెనకాల కూర్చుంది.

అతడు మొదట బిత్తరపోయాడు. ఆ తర్వాత ఆనందంతో 'హుర్రే' అని కేకపెట్టాడు.

స్టాపులోని వాళ్లు లత వేపు ఆశ్చర్యంగా చూశారు.

మోటార్ సైకిల్ వాయువేగంతో వెడుతోంది. లత అతడికి తగలకుండా కూర్చోడానికి ప్రయత్నిస్తోంది.

"మంచి హోటల్‌కి వేడుదామా డియర్", అన్నాడతడు.

'హోటల్‌కెందుకు డబ్బుదండగ మా ఇంటికి వెడదాం",అంది లత.

"మీ ఇంట్లో ఎవ్వరూ లేరా!"

"వూహు!"

"అయితే పద! మీ ఇంట్లోనే ఈ రాత్రి స్వర్గసుఖాలు చవి చూద్దాం!"

వుషారుగా ఈల వేస్తూ లత చెప్పిన దారి వెంట పోనిస్తూ -కొద్దిసేపటికి లత ఇంటి ముందు ఆపాడు!

అదొక చిన్న పెంకుటిల్లు. జీర్ణావస్థలో వుంది.

"రండి" లత నవ్వుతూ ఆహ్వానించింది. మోటార్ సైకిలుకు స్టాండు వేసి ఆమె వెంట నడిచాడతడు.

తలుపు తట్టింది.

రెండు నిముషాలకు తలుపులు తెరుచుకున్నాయి! అతడికి ఇంటినిండా మనుషులు కన్పించారు. వాళ్లని చూసి వులిక్కిపడ్డాడు. భయం కూడా కలిగిందతనికి!

"రండి! అక్కడే ఆగిపోయారే," లత పిలిచింది. ఇక చేసేది లేక భయం భయంగా లోపలికి వెళ్లాడు. లత ఇంట్లో అందరినీ అతడికి పరిచయం చేసింది.

"చెల్లీ వీరికి కాఫీ తీసుకురా!" అని అతడిని ముందు హాల్లో కుర్చీ వేసి కూర్చోబెట్టింది.

చూశారా ! ఇది నా సంసారం. నా తండ్రికి యాక్సిడెంట్‌లో కాలు పోయింది. దాని వలన ఆయన వుద్యోగం పోయింది. ఇంటికి పెద్దకూతురిని కాబట్టి ఇంటి బాధ్యత తీసుకున్నాను. అమ్మకి అనారోగ్యం , చెల్లికి పోలియో వచ్చి ఒక కాలు చచ్చుపడి పోయింది. తమ్ముళ్లు చిన్నవాళ్లు- చదువుకుంటున్నారు. నేను వుద్యోగం చెయ్యకపోతే వీళ్లందరూ మలమల మాడిపోతారు. నేను వుద్యోగం చేసేది వీళ్లందరినీ బ్రతికించ డానికి గానీ- మీరనుకుంటున్నట్లు విచ్చలవిడిగా తిరగడానికి గానీ-సుఖాలు తీర్చుకోడానికి గానీ కాదు! ఇంకో విషయం అందంగా అలంకరించుకుంటున్నా నన్నారు. అందం

దేవుడిచ్చింది ఇక అలంకరణ అంటారా, శుభ్రంగా వుండకపోతే మా ఆఫీసరు వూరుకోడు. అందుకే వీలైనంత వరకూ నా చీర చిరుగుల్ని దాచుకుంటూ శుభ్రంగా వుండటానికి ప్రయత్నిస్తాను ఇది కూడా తప్పేనా! చెప్పండి. మమ్మల్నందర్నీ మీరు పోషిస్తానంటే నేను ఇంట్లోంచి కాలు బయట పెట్టను! చెప్పండి, పోషిస్తారా?" అనడిగింది లత

అతడికి తల తిరిగిపోయింది గాలిలేని ఇనుప పంజరంలో బంధించినట్లు వుక్కిరిబిక్కిరయ్యాడు! క్షణం కూడా అక్కడ కూర్చో లేక పోయాడు. చటుక్కున లేచి బయటికొచ్చాడు

"అరె! వెళ్లిపోతున్నారే! కాఫీ తీసుకోండి", లత వెనక నుండి అంటున్నా విన్పించుకోకుండా మోటార్సైకిలు మీద వెళ్లిపోయాడు!

* * * * *

నెలరోజులు గడిచాయి

ఒక నాటి సాయంత్రం వేళ లత తమ్ముడిని తీసుకుని బజారుకు బయలుదేరింది

కొద్ది దూరం నడిచేసరికి 'అతడు' ఎదురొచ్చాడు




"నమస్తే మేడమ్", అన్నాడు

లత అతడి వేపు చూసి, ఆశ్చర్యపోయింది హిప్పీ క్రాఫు లేదు కళ్లకు గాగుల్స్ లేవు. నోట్లో సిగరెట్ లేదు మోటార్ సైకిల్ లేదు సాదాబట్టల్లో వున్నాడు

"నన్ను చూసి ఆశ్చర్యపోతున్నారా! ఈ మార్పుకి కారణం మీరే! మేడమ్ మీరే నాకళ్ళు తెరిపించారు మీ సంసారం లాటిదే నాదీను. నాకు తండ్రి లేడు నేనే ఇంటికి పెద్ద కొడుకుని, కానీ మీలా కాదు! బాధ్యతలు మరిచిన వాడిని, అమ్మ మిషన్ కుట్టి –చెల్లాయిలు బట్టలషాపుల్లోనూ పని చేసి సంపాదిస్తోంటే తిని, అద్దె మోటార్ సైకిల్ మీద తిరిగే దుర్మార్గుడిని, వాళ్ళు రక్తాన్ని చెమటగా మార్చి సంపాదిస్తోంటే – నేనా రూపాయిల్ని సుఖాలకోసం వెచ్చించే రాక్షసుడిని, మీరు నాకు నా బాధ్యత తెలియ చెప్పారు నేను వారం రోజులు తిరిగి అతి కష్టం మీద వుద్యోగం సంపాదించుకున్నాను. చిన్నదే అనుకోండి అయినా నా కుటుంబానికి నా వంతు ధర్మం నెరవేరుస్తున్నందుకు ఆనందంగా వుంది నిన్ననే నా మొదటి నెల జీతం తీసుకున్నాను! ఈ విషయం మీకు చెప్పాలనే వస్తున్నాను లతగారూ, మీకభ్యంతరం లేకపోతే ఆ చిన్న హోటల్లో కెళ్లి ఒన్‌బైటు కాఫీ తాగుదాం అంతకంటే ఈ చిరుద్యోగి మీకేం ఇచ్చుకోలేడు వస్తారా!' అనడిగాడతడు

లతకు క్షణకాలం నోట మాట రాలేదు అతడిలోని మార్పు ఆమెకు ఆశ్చర్యాన్ని , ఆనందాన్ని కలిగించింది

'మీకు రావడం ఇష్టం లేదా" సందేహంగా అడిగాడు

లత తేరుకుని 'అబ్బే! అదేం లేదండి! తప్పకుండా వస్తాను. పదండి!" అంటూ వుత్సాహంగా అతడి వెంట నడిచింది లత! □



సీరియల్

# మల్లిక

## (గత సంచిక తరువాయి)

రోడ్డు మీద అడుగు పెడుతుంటగా 'ఈజీ డ్రైవింగ్ స్కూల్' అన్న బోర్డున్న కారులో నుండి రోమెరో దిగుతూ కనిపించాడు. వాళ్ళను చూసి గబగబా ఇటు వచ్చాడు.

"వెళ్ళి పోతున్నారా? సారీ! ఎవరికో డ్రైవింగ్ లెసన్ ఇచ్చి పంపించేసరికి లేటయ్యింది." అపాలజిటిగ్గా అన్నాడు రోమెరో.

"ఫరవాలేదులే! ఇంకా పార్టీ జరుగుతూనే వుంది. అదుగో, ఆ బిల్డింగ్‌లోనే! త్వరగా వెళితే ఒక గ్లాస్ షాంపేనేనా వస్తుంది. వెళ్ళు." అన్నాడు భార్గవ్.

చేతిలోని పాకెట్ మల్లికకిచ్చాడు రోమెరో. "మీ వివాహ జీవితం సంతోషంగా గడపాలని కోరుకుంటున్నాను!"

"థాంక్స్." అంది మల్లిక.

"ఇంకా ఈ బహుమతి కూడా ఎందుకు రోమెరో? ఇప్పటికే మాకు గొప్ప సహాయం చేసి ఋణగ్రస్తులను చేశావు. ఏ విధంగా నీ ఋణం తీర్చుకోగలం?"

**జరిగిన కథ :–13** భార్గవ్ అమెరికాలో ఒక చిన్న ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. భార్గవ్‌కి మల్లిక పరిచయం అయ్యింది. ఆమె ఉద్యోగంలో చేరినాక వారిద్దరు పెళ్ళి చేసుకున్నారు. వారి జీవితం సాఫీగా సాగిపోతున్నా పిల్లలు మాత్రం కలుగలేదు. అందుకై ఆ దంపతులు డాక్టర్ల చుట్టూ తిరగటం ప్రారంభించారు. వారికి పిల్లలు పుట్టక పోవడానికి కారణాన్ని ఏ డాక్టరూ చెప్పలేకపోయాడు. కానీ భార్గవ్‌కి మాత్రం తమకు తప్పక పిల్లలు పుడుతారని నమ్మకం. ఒంటరి తనంతో బాధపడుతున్న మల్లికకి చిన్ననాటి స్నేహితురాలు అంజలి తారసపడటం ఆనందాన్ని కలుగజేసింది. పిల్లల్ని పెంపకం తీసుకునే విషయంలో తమకి ఆశక్తి లేదని డాక్టరుతో చెపుతాడు భార్గవ్. డాక్టరు మాటలువిన్న భార్గవ్‌కి తనింట్లో చిన్నప్పుడు పాలేరుగా ఉన్న చిట్టిగాడు, వాడి పిల్లలు జ్ఞప్తికి వస్తారు. చిట్టిగాడి పిల్లలకి ఏదో ఒక దారి చూపించాలనుకుంటాడు. చిట్టిగాడి భార్య చనిపోయిందని, వాడు క్షయతో బాధ పడుతున్నాడని తండ్రి ఉత్తరం ద్వారా తెలుసుకున్న భార్గవ్ ఆవేదన చెందుతాడు. డేవిడ్ తన ఇంట్లో కంపెనీ తరఫున ఇచ్చే 'క్రిస్మస్' పార్టీకి మల్లిక, భార్గవ్ వెళతారు. భార్గవ్ ఇదివరకటిలా ఉండటం లేదని స్నేహితురాలు అంజలికి చెప్పి బాధపడుతుంది మల్లిక. మల్లిక, భార్గవ్ సపోర్ట్ గ్రూప్ మీటింగ్‌కి వెళ్తారు. లావు తగ్గడానికే గాక, లావు పెరక్కుండా ఉండటానికి 'హెల్త్ స్పా'కి వెళ్ళాలనుకుంటుంది మల్లిక. మల్లిక, అంజలి కూడా హెల్త్ స్పా'కి వెళ్ళివస్తున్నారు. భార్గవ్ ప్రవర్తన మల్లికకు తీరని బాధని కలుగ చేస్తోంది.

అన్నాడు భార్గవ్.

"విధానం వుంది మాన్! మగబిడ్డ పుడితే నా పేరు పెట్టుకోండి." నవ్వుతూ అని బిల్డింగ్ వైపు వెళ్ళిపోయాడు రోమెరో.

అంతలో అటుకేసి టాక్సి రావటం చూసి, చెయ్యెత్తి దగ్గరకు పిల్చి, డ్రైవర్‌కి ఏదో చెప్పాడు భార్గవ్. కాస్త దూరంగా వున్న మల్లికకు అతను చెప్పింది వినిపించలేదు.

"మనం వెళ్ళేది నీ అపార్ట్‌మెంటుక్కాదా?" టాక్సీ వేరే దారి గుండా వెళ్ళటం గమనించి అడిగింది మల్లిక.

"'నీ' కాదు 'మన' అనాలి ఇకనుండి." అని ఆమెను సరిజేసి "కాదు" అన్నాడు.

"మరెక్కడికి?" ఆశ్చర్యంగా అడిగింది.

"నువ్వే చూస్తావుగా?"

'ప్లాజా హోటల్' అని నియాన్ లైట్లతో వెలుగుతున్న బోర్డుగల బిల్డింగ్ ముందుకి వచ్చి ఆగింది టాక్సి.

"అమ్మ బాబోయ్! ప్లాజా హోటలా? ఈ సిటీలో వున్న ఖరీదైన హోటళ్ళలో ఒకటని విన్నాను?" కళ్ళు పెద్దవి చేసింది మల్లిక.

"నువ్వన్నది కరెక్టే!" టాక్సీకి పే చేసి, ఆమె భుజం చుట్టూ చేతులు వేసి లోపలికి నడిపించాడు.

తొమ్మిదవ అంతస్తులో ఒక రూం తలుపు తీశాడు భార్గవ్.

లోపలికి అడుగుబెట్టబోయే మల్లికను వారించి, రెండు చేతులతో ఆమెను ఎత్తి గుమ్మం దాటాడు.

"మొదటిరాత్రి పెళ్ళికూతురు తనంతట తాను గుమ్మం దాటకూడదు. తెలుసా?" కొంటెగా అన్నాడు.

"అలాగా?" చిలిపిగా అని, అతని చేతుల్లో నుండి విడిపించుకుని క్రిందికి దిగింది మల్లిక. చుట్టూ చూసింది.

బ్రహ్మాండంగా వుంది గది, గదిలోని అలంకరణాను! కిటికీలో నుండి బైటికి చూసింది. ఎదురుగా సెంట్రల్ పార్క్ అక్కడక్కడా వెలిగే లైట్ల వెలుగులో అస్పష్టంగా కనబడుతోంది. పార్కు చుట్టూరా కనుచూపు మేరలో ఎత్తైన అద్దాల భవనాలు లైట్లకాంతితో నిండిపోయి, మణిదీపాల్లా ప్రకాశిస్తున్నాయి.

రాత్రికి, పగలకూ తేడా తెలియని నగరమిది అనుకుంటూ వెనక్కి తిరిగింది.

"ఎలా వుంది గది?" టై వూడదీస్తూ అడిగాడు భార్గవ్.

"ఎలా వుండటమేమిటి? పూపరి సలపనంత అందంగా వుంది! అది సరే, వూళ్ళో ఇల్లుంచుకుని ఇంత ఖరీదైన హోటల్లో వుండటమేమిటీ అని? దిమ్మతిరిగేట్టు, మిలియనేర్సు వుండే హోటల్ కదూ ఇది?"

"పెళ్ళయి గంటయిందో లేదో అప్పుడే మొదలయ్యింది నీ ఇల్లాలి పిసినారితనం? ఆడదాన్ననిపించుకున్నావ్ మొత్తానికి!" చిరుకోపంగా అన్నాడు.

"తమరి అంచనా తప్పు మహాశయా! ఇంత ఖర్చు పెట్టి ఈ వూళ్ళోనే వుండే బదులు మరేదైనా వూరెళ్ళవచ్చు గదాని నా బాధ! అంతకంటే మరేం కాదు."

"ఓ అదా? అయితే ఒకటి చెప్పనీ! మనం ఈ వూళ్ళోనే కలిశాం. ఈ వూళ్ళోనే పెళ్ళి చేసుకున్నాం. ఇది మన స్పెషల్ ప్లేస్! అందుకే ఈ వూళ్ళోనే హనీమూన్ జరుపుకోవాలని నా కోరిక. అఫ్‌కోర్స్, ఇంట్లో అయితే ఖర్చుండదు. కానీ బాదరబందీ లేకుండా, వంటావార్పు– మిగతా డైలీ చికాకులు లేకుండా, న్యూయార్క్ సిటీలో రెండు రోజులు విలాసంగా, ఫ్రీగా గడపాలని, మన మొదటి రాత్రి జీవితాంతం గుర్తు పెట్టుకునేలా వుండాలనీ, ఇలా ప్లాన్ చేశాను. అఫ్టరాల్, ఈ రాత్రి మళ్ళీ మళ్ళీ రాదు కదా?"

"మై గుడ్‌నెస్! నీలో ఇంత రొమాన్స్ వుందని నాకు తెలియదు సుమా!" ఆశ్చర్యంగా చూసింది మల్లిక.

"అప్పుడే ఏం చూశావ్?" అంటూ దగ్గరగా రాబోతున్న భార్గవ్‌కి దూరంగా వెళ్ళింది.

"అంతా బాగానే వుంది కాని ఒక్క విషయం మర్చిపోయావ్!"

"ఏమిటది?" ఆశ్చర్యంగా అడిగాడు.

"బట్టలు! వంటి మీది బట్టలతో రెండు రోజులు ఎలా గడపటం?"

"ఓ, అదా? ఒక్క నిముషం వుండు." అని ప్రక్కనే వున్న చిన్న గదిలోకి ్ళాడు. చేతిలో పెద్ద పాకెట్‌తో తిరిగి వచ్చాడు.

పాకెట్ మల్లిక చేతిలో పెట్టి "విప్పి చూడు." అన్నాడు. పాకెట్ వూడదీసిన ల్లిక చాలా ఆశ్చర్యపోయింది. అందులో తెల్లటి సిల్క్ నైట్ గౌన్, క్రొత్త ్టలు, మేకప్‌సామానులు వున్నాయి.

"మైగాడ్! అన్నీ ఆలోచించారన్న మాట." అవన్నీ అక్కడ పడేసి చటుక్కున ర్గవ్‌ని ముద్దుపెట్టుకుంది."

"ఒక ప్రశ్న! నా బట్టల సైజు నీకెలా తెలుసు?

"యూ టాక్ టూమచ్!" మల్లికపెదవుల్ని మరి కదలనియ్యలేదు భార్గవ్.

భార్గవ్ అన్నట్టుగానే, ఆ రెండు రోజులూ వాళ్ళ జీవితాల్లో మరపురాని జాలుగా గడిచాయి. రాత్రో పగలో, మిగతా లోకంలో ఏం జరుగుతోందో -లియనంతగా మనసా, వాచా ఒకరిలో ఒకరు లీనమైపోయారు. భోజనం కూడా ఆకలైందనిపించినప్పుడు రూం సర్వీస్ ద్వారా తెప్పించుకుని గదిలో నే తిన్నారు.

ఆఖరి రోజున మాత్రం హోటల్ డైనింగ్ రూంలో లంచ్ తిని, సెంట్రల్ పార్కంతా తిరిగి చూశారు. గుర్రపు బగ్గీలో విహారం చేశారు. పార్క్ జూలో తిరిగారు. పార్కులో మూలగా వున్న చరిత్ర తెలియని ఒక కోట ఎక్కి బండరాళ్ళ మీద కూర్చున్నారు. దాని ప్రక్కగా ప్రవహిస్తున్న సరస్సులోకి రాళ్ళు విసిరారు. పార్క్‌లో జాగ్ చేస్తున్న వాళ్ళనీ, సైకిళ్ళు తొక్కుతున్నవాళ్ళనీ, గుంపులుగా స్క్వేర్ డాన్సులు చేస్తున్నవాళ్ళనీ, ఫుట్‌బాల్ ఆడుతున్న వాళ్ళనీ, బోట్ రైడ్ చేస్తున్న వాళ్ళనీ చూస్తూ చాలా సేపు కూర్చున్నారు.

ఆ పార్కు, పార్కులో మనుషులు, చెట్లు, వాటి మధ్యలో నుండి కనబడే నీలాకాశం, సరస్సులూ, పక్షులు, ఆకులు, అలమలు – ప్రతి ఒక్కటీ, అంతకుముందు కనబడనంత అందంగా, రొమాంటిగ్గాకనపడసాగాయి.

ఇక పార్కులో వుంటే ప్రమాదం అనిపించే వేళ వరకూ అక్కడే.



కూర్చున్నారు! –

కారు ఇంటి దగ్గర ఆగినాక గాని ఇంటికొచ్చినట్లు తెలియలేదు మల్లికకు. అలవాటైన రోడ్లు గనక ఆటోమేటిగ్గా వచ్చేసినట్లుంది. ఇంకా నయం, ఆలోచనల్లో పడి ఏ యాక్సిడెంటో కాలేదు!

గబగబా ఇల్లంతా నీట్‌గా సర్దింది తోటలో పూసిన రెండు ఎర్ర గులాబీలు – విడీ విడలని మొగ్గలు, ఆకులతో వున్నవి తెచ్చి బెడ్‌రూంలో ఫ్లవర్‌వేజ్‌లో పెట్టింది బెడ్ మీది దుప్పట్లు తీసేసి క్లోజట్‌లో ఇస్త్రీ చేసి పెట్టిన శాటిన్ షీట్స్ వేసింది. వాటి మీద లైట్‌గా జాస్మిన్ పౌడర్ చల్లింది

తలస్నానం చేసి, రోబ్ చుట్టుకుని బ్లోడ్రయర్‌తో జుట్టు ఆరబెట్టుకుంది పెళ్ళి రోజు కట్టుకున్న చీర కట్టుకుంది బీరువాలో అడుగున వున్న తెల్ల సిల్క్ నైట్ గౌను తీసి బైట పెట్టింది ఆ రెంటికీ కాస్త గాలి పీల్చుకుని బైట ప్రపంచాన్ని చూసే భాగ్యం సంవత్సరానికి ఒక్కసారే గదా అనుకుని జాలిపడింది కాస్సేపు!

మల్లిక తయారై క్రిందికి వచ్చేసరికి ఆరు దాటింది ఇక భార్గవ్ వచ్చే వేళయ్యిందనుకుంటూ కిటికీలో నుండి చూసింది

చుట్టుపట్ల ఇళ్ళలోని చిన్న పిల్లలందరూ ఎదురింటి ఆవరణలో చేరి, స్విమ్మింగ్ డ్రెస్‌లు వేసుకుని, పెద్ద ప్లాస్టిక్ నీళ్ళ తొట్టిలో కూర్చుని జలకాలాడుతున్నారు ఎప్పట్నుండీ వాళ్ళలా ఎండలో ఆడుతున్నారో, ఒళ్ళంతా కమిలిపోయి గోధుమరంగుకి తిరిగింది

తన చిన్నతనం గుర్తొచ్చింది మల్లికకు కాస్త ఎండలోకి వెళితే, నల్లబడిపోతావు వద్దు అనేది అమ్మమ్మ శలవల్లో మధ్యాన్నం పూట, బలవంతంగానైనా, పడుకోబెట్టి కాపలాగా ఆవిడా ప్రక్కనే పడుకొనేది ఆవిడ గురక వినిపించగానే తను చప్పుడు చెయ్యకుండా బైటికి జారుకునేది. ఆ తర్వాత తిట్లు పడినా లెక్క చేసేది కాదు.

ఇక్కడంతా వ్యతిరేకం! ఒళ్ళు ఎంత నలుపుకి తిరిగితే అంత ఇష్టం వీళ్ళకి టాన్ అంటూ ఎంత దూరమైనా పోయి బీచ్‌లో, బికినీలతో, గంటల తరబడీ ఎండలో కూర్చొని వస్తారు.

కిటికీలో నుండి చూసీ, చూసీ మెడ నెప్పుట్టగా వెనక్కి వచ్చేసింది మల్లిక గోడ మీది గడియారం ఏడయినట్లు చూపిస్తోంది. ఈ రోజైనా తొందరగా వస్తాడేమోనని అనవసరంగా ఆశపడ్డానా అనుకుంది. అయినా, ఇంకా ఏడేగా అయ్యింది! ఈపాటికి వచ్చేస్తూ వుండాలి, అనుకుంటూ సోఫాలో జారగిలబడింది

టి వి ఆన్ చేసింది. ఈవినింగ్ న్యూస్ కాబోలు, వస్తోంది – ఏదో వూళ్ళొ హోమో సెక్స్యువల్ రైట్స్ కోసం ముమ్మర పోరాటం, ఇంకేదో వూళ్ళో ప్లేన్ నదిలో పడిపోయి వందలకొద్దీ మృతి, ఇంకొక చోట ఎవరో చిన్న పిల్లని హోస్టేజిగా తీసుకుని మిలియన్ డాలర్ల రేన్‌సమ్ కోసం చేస్తున్న డిమాండు –

ఈ న్యూస్ వింటే లేని డిప్రెషన్ కూడా రాగలదు, అనుకుంటు కళ్ళు మూసుకుంది. ఎప్పుడు పట్టిందో చిన్న కునుకులాంటిది పట్టింది.

ఏదో శబ్దానికి హటాత్తుగా మెలుకువ వచ్చింది టైం చూస్తే తొమ్మిదయ్యింది. భార్గవ్ మీద ఎప్పుడూ రానంత విసుగు వచ్చింది. మళ్ళీ అంతలోనే భయం వేసింది తొమ్మిది వరకూ ఎప్పుడూ రాకుండా వుండలేదు. ఏదైనా జరగలేదు గదా? ఏ యాక్సిడెంటైనా ఒళ్ళు ఝల్లుమంది

ఫోన్ మ్రోగింది

గబుక్కున పరిగెత్తింది.

"హల్లో" అవతలిది భార్గవ్ గొంతు కాదు

"హలో, ఎవరు మీరు?" ఆతృతగా అడిగింది. ఏ హాస్పిటల్ వాళ్ళో కారు కదా? గొంతులో ఉద్వేగం వుండలు తిరుగుతోంది

"నా పేరు రాబర్ట్ మిల్లర్! 'అమెరికన్ ఫుడ్స్' సేల్స్‌మన్‌ని. మేమ్! మీరు ఇల్లు కదలకుండా గ్రోసరీలన్నీ మీ ఇంటికే సప్లయ్ చేసే పథకం ఒకటి వుంది. మీకు నెలకు షుమారుగా మాంసం, గ్రుడ్లు, చికెన్, పాలు, కూరగాయలు మొదలైనవి ఎంతెంత కావాలో చెబితే, నెలనెలా ట్రక్‌లో వచ్చి ఇంటివద్ద దింపి వెళతాం ఇదెంతో సులభ పద్ధతి మీకు శ్రమా తప్పుతుంది" వ్యాపార పక్కీతో గడగడా చెప్పుకుపోతున్నాడు

అర్ధరాత్రి వేళ మద్దెల దరువన్నట్లు నీకీ సమయమే దొరికిందా అని మనస్సులో విసుక్కుని, 'నో థాంక్స్!' అని మధ్యలోనే ఫోన్ పెట్టేసింది.

ఆకలికి కళ్ళు తిరుగుతున్నాయి మధ్యాన్నమెప్పుడో తిన్న లైట్ లంచ్!

రెఫ్రిజిరేటర్‌లో నిన్నటివేవో వుంటె తీసి స్టవ్‌మీద పెట్టింది. రైస్ కుక్కర్‌లో బియ్యం కడిగి పడేసింది. యాపిల్ జ్యూస్ గ్లాసులో పోసుకుని డెన్‌లోకి వచ్చింది. భార్గవ్ వస్తున్న జాడలేమీ లేవు నీర్సంగా కూలబడింది తొమ్మిదన్నరయినా ఇంకా రాకపోగా ఫోనయినా చెయ్యలేదు ఏమయి వుంటుంది?

పదయ్యింది. మళ్ళీ ఫోన్ మ్రోగింది. గబగబా వెళ్ళింది

"హలో మల్లికా!" జిమ్ కంఠంలా వుంది

"జిమ్ ! నువ్వేనా? నేనే ఫోన్ చేద్దామనుకుంటున్నాను భార్గవ్ ఇంకా ఇంటికి రాలేదు. నీకేమైనా తెలుసా?" గుండెలు కొట్టుకుంటుండగా అడిగింది.

"భార్గవ్ నా అపార్ట్‌మెంటులోనే వున్నాడు." నెమ్మదిగా అన్నాడు జిమ్.

"నీ అపార్ట్‌మెంటులోనా? ఎందుకని? అతనికేం కాలేదు కదా?" ఆతృతగా అడిగింది.

"కామ్ డౌన్ మల్లికా! అతను బాగానే వున్నాడు సాయంత్రం కాస్సేపు గడపటానికి నా ప్లేస్‌కి వచ్చాడు ఇద్దరం పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ

# బడిపిల్లలకు ఉచిత వైద్యం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, జులై 1 : ఆతుపత్తు కొద్దిగ గల కుటుంబాల వారి పిల్లలకు ప్రాథమిక పాఠశాలల్లో ఉచిత ఆరోగ్య చికిత్సా సౌకర్యాన్ని ప్రస్తుత సంవత్సరం నుంచి ప్రారంభించాలని రాష్ట్ర మంత్రి వ్యాధి వివరాలగురించి, చికిత్సగురించ కార్డుపైన నమోదు చేస్తారని. వ్యాధి తీవ్ర తను బట్టి జిల్లా ఆరోగ్య కేంద్రాలలోను ఇతర ప్రత్యేక ఆసుపత్రులలో పరీక్ష చేసి చికిత్స చేస్తారని ముఖ్యమంత్రి చెప్పారు. మొత్తం ఈ విధంగా అయిదేళ్ల

ప్చ్... ఇదివరకటిలా కడుపునొప్పని, తలనొప్పని చెప్పి స్కూలుకి ఎగ్గొట్టడానికి కుదరడంలా... ఏదయినా చెప్తే ఇంజక్షన్లు, మందులు ఇస్తున్నారు!!

ఓరేనాన్నో!!... మీఅమ్మకి తలనొప్పిగా వుందటగాని... నీకు తలనొప్పిగా వుందని- చెప్పి మీ స్కూల్లో ఇచ్చే మందులు తీసుకురారా...

గురువుగారూ! బడి పిల్లలకి చేసే ఉచిత- వైద్య సహాయపథకం కూడా మధ్యాహ్న- భోజన పథకం లాగా మూన్నాళ్ళ- ముచ్చట కాదు కదా!!...

ప్రాథమిక పాఠశాల

చూడరా... నేను కొనుక్కున్న ఐస్‌క్రీంని 'జలుబు చేస్తుంది తినకూడదు' అంటూ ఆ డాక్టర్ లాక్కున్నారు...!

ప్రాథమిక పాఠశాల

ప్రసాద్‌కెజె చైతన్య

మందులతో పాటు బలానికి 'టానిక్' కూడా ఇస్తే బాగుణ్ణు! ఇంత బరువు మోయలేక చస్తున్నాం!!

మా మాష్టారుగారు కొట్టారు. బాగా వొళ్ళునొప్పులుగా వున్నాయిగాని!... కాస్తా ఉచిత వైద్యం చేస్తారా...

ఉచిత వైద్యం చేయబడును.

టైమెంతయిందో గమనించలేదు. నువ్వు కంగారుపడతావని ఫోన్ చేస్తున్నాను."

"ఇప్పుడా ఫోన్ చెయ్యటం? అయినా నువ్వు చెయ్యటమేమిటి? భార్గవ్ ఏం చేస్తున్నాడు?" కోపంగా అడిగింది.

"కాస్త లిక్కర్ డోస్ ఎక్కువైనట్టుంది! మనవాడు మన లోకంలో లేడు. ఈ రాత్రికి ఇక్కడే వుండటం మంచిది. గుడ్‌నైట్ మల్లికా!"

ఫోన్ అలాగే పట్టుకొని నిలబడింది మల్లిక. ఏమైపోయాడో అని తనిక్కడ కంగారుపడుతున్న సమయంలో అతనక్కడ హాయిగా తప్ప తాగి నిద్రపోతున్నాడన్న మాట! అందులోనూ ఈ రోజు కూడా గుర్తుపెట్టుకోకుండా.

ఎందుకిలా మారిపోతున్నాడు? ఏమైందతనికి? ఏమవ్వబోతూంది తమ జీవితం? అతని మీద కోపం క్రమంగా విషాదంగా మారి మల్లిక హృదయమంతా పరుచుకుంది. మనస్సంతా శూన్యంగా అయ్యింది.

అన్నం వుడికిందానికి సూచనగా రైస్‌కుక్కర్ టక్‌మన్న చప్పుడుతో ఆగిపోయింది. మల్లికకు ఆకలిగా వున్నా అన్నం తినబుద్ధి కాలేదు. క్రింద లైట్లన్నీ తీసేసి పైకెళ్ళింది. చీర వూడదీసి, మడతబెట్టి, దానితో బాటు బైటపెట్టిన నైట్‌గౌను కూడా బీరువాలో పెట్టేసింది. రోజువారీ నైట్‌గౌన్ వేసుకుని పక్క మీద వాలింది. మెత్తటి శాటిన్ షీట్స్‌లో నుండి వస్తున్న జాస్మిన్ పరిమళం సన్నగా ముక్కుపుటాలను సోకుతోంది అయినా మల్లిక మనస్సులో కదలిక లేదు అలాగే ఇంటికప్పుకేసి చూస్తూ పడుకుంది.

వీధి లైట్ల కాంతి లోపలపడి గోడల మీద వెలుగునీడలు పరుచుకుంటున్నాయి రెఫ్రిజిరేటర్ చప్పుడూ, ఏ. సి. చప్పుడు కొంచంసేపు ఆగిపోవటంతో, ఇల్లంతా వుచ్ఛ్వాసనిశ్వాసాలు కూడా వినబడేంత నిశ్శబ్దంగా వుంది ఆ నిశ్శబ్దంలో, మూసి వుంచిన కిటికీల గుండా కూడా చొచ్చుకుని వస్తున్న కీచురాళ్ళ ధ్వని అతి భీకరంగా వినిపిస్తోంది మల్లికకు – ఏదో మహారణ్యంలో, భయంకరమైన మృగాల మధ్య ఒంటరిగా, అతి ఒంటరిగా వున్నట్టుందామె మనస్సు.

* * * * *

మర్నాడు ఆఫీసు నుండి నేరుగా అంజలి ఇంటికి వెళ్ళి ఆమెను తీసుకుని 'హెల్త్ స్పా'కి వెళ్ళింది మల్లిక.

"ఏమిటి ముఖం అదోలా వుంది?" దార్లో అడిగింది అంజలి

"నిన్న మా వెడ్డింగ్ యానివర్సరీ." యధాలాపంగా అంది మల్లిక.

"అదీ, అట్లా చెప్పు!"

ఆమె అన్న తీరుకి మల్లిక చటుక్కున తలతిప్పి చూసింది. అంజలి ముఖం మీద ముసిముసి నవ్వులు కదలాడుతున్నాయి.

"యూ ఫూల్! నీదెప్పుడూ వన్‌ట్రాక్ మైండే! చెప్పేది సాంతం వినవేం?" విసుక్కుంది మల్లిక

"సరే చెప్పు "

"రాత్రంతా భార్గవ్ ఇంటికేరాలేదు "

అంజలి ముఖంలో నవ్వు మాయమయ్యింది.

"ఇంటికి రాలేదా? ఎక్కడికెళ్ళారు?"

"జిమ్ అని భార్గవ్ స్నేహితుడున్నాడు. అతనింట్లో బాగా తాగి పడిపోయినట్లున్నాడు రాత్రికి అక్కడే వుండిపోయాడు."

"మామూలుగా అలా జరుగుతుంటుందా?"

"లేదు ఇదే మొదటిసారి."

ఇద్దరూ చాలా సేపు మాట్లాడలేదు.

'ఇలా ఎప్పుడూ జరగలేదు అంజలీ! ఏది మర్చిపోయినా భార్గవ్ యానివర్సరీ రోజుని ఎప్పుడూ మర్చిపోడు. అట్లాంటిది రాత్రంతా కూడా ఇంటికి రాలేదంటే అతని మనస్సులో ఏముందో? నాకొక్కటే తోస్తోంది ఎల్లలు లేకపోవటం వల్ల ఇలా చేస్తున్నాడేమోనని!" ఎంత తమాయించుకున్నా మల్లిక కంఠంలో వ్యధ తొంగి చూస్తూనే వుంది.

"నువ్వు మరీ గోరంతలు కొండంతలు చెస్తావే మల్లీ! ఫ్రెండ్సుద్దరూ మాటల్లోపడి బాగా తాగుంటారు ఆ తర్వాత ఏదీ గుర్తుండి వుండదు ఒక యానివర్సరీ గుర్తు పెట్టుకోనందుకు ఇంతలా వాపోతున్నావు మా ఆయనకి మా యానివర్సరీ ఎప్పుడో కూడా తెలియదు నన్నెంత బాధపడమంటావు మరి?"

"నీ కర్మం కావటం లేదా అంజలీ? మీ ఆయన మొదటి నుండి అలాగే కాబట్టి ఆయన స్వభావం అంతేనని సరిపెట్టుకోవచ్చు కాని భార్గవ్ సడెన్‌గా స్వభావ విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు అదే నా భయం! అంతేగాని ఒకసారి తప్ప తాగి పడిపోయినందుకూ కాదు, ఒక యానివర్సరీ గుర్తుపెట్టుకోనందుకూ కాదు!

* * * * *

మల్లిక 'స్పా' నుండి ఇంటికి వచ్చేసరికి ఆరున్నరయ్యింది. భార్గవ్ అప్పటికే వచ్చి వున్నాడు డెన్‌లో సోఫాలో పడుకుని న్యూస్‌పేపర్ చదువుతున్నాడు

మల్లిక అతని వైపు చూడకుండానే పైకెళ్ళిపోయింది

భార్గవ్ పేపర్ పడేసి తనూ వెళ్ళాడు. మల్లిక స్నానం చెయ్యటానికి సిద్ధమౌతోంది. బాత్‌రూం వైపు వెళ్తున్న ఆమెను చెయ్యిపట్టి ఆపాడు

"మల్లీ! కోపమొచ్చిందా?"

ఆ ప్రశ్న అడిగినందుకే అతన్ని తినేసేలా చూసింది మల్లిక

"నీకు ఫోనయినా చెయ్యకుండా, రాత్రంతా ఇంటికి రాకుండా, బైట గడపటం పొరబాటే! కాని, దానికి కారణం వివరించగలను మేం కనిపెట్టబోయే ప్రాడక్ట్‌కి 'బ్రేక్‌త్రూ' వచ్చినట్లే వచ్చి చేజారిపోయింది. నిన్నటితో ఫైనల్ రిజల్ట్ వచ్చేస్తుందని ఎంతో ఆశపడ్డాను కానీ 'ఫాల్స్ అలారం' అని తెలియగానే ఎంత నిరాశపడ్డానో నీకు తెలియదు! మనస్సు బాగుండక అటూ ఇటూ తిరుగుతూ, నాకు తెలియకుండానే జిమ్ అపార్ట్‌మెంట్ వరకూ వెళ్ళాను ఒక డ్రింక్ తర్వాత ఇంకొక డ్రింక్ – అలా నాకు తెలిసేసరికే శ్రుతి మించిపోయింది ఆ తర్వాతి స్టోరీ నీకు తెలుసు."

ఇంకా ఏమైనా చెబుతాడేమోనని ఎదురు చూసిన మల్లిక అతను మాట్లాడటం ముగించాడని తెలియగానే స్తబ్ధయ్యింది. చల్లారబోతున్న కోపం మళ్ళీ తలెత్తింది చెయ్యి విదిలించుకుని బాత్‌రూంలోకి వెళ్ళిపోయింది.

అసలే, రాత్రి బాగా తాగటం వల్ల ప్రొద్దున్న లేచిన దగ్గర నుండీ 'హాంగోవర్'తో బాధగా వుంది. నరాలు తెగిపోయేట్టు తలపోటుగా వుంది.

అతనిలో కోపం బుస్సున పొంగింది.

"అంటే, నీకు సాష్టాంగపడి క్షమార్పణలు చెప్పుకోవాలా? ఒక్కసారి మనస్సు బాగుండక కాస్త ఎక్కువ తాగినందుకు ఫెడరల్ కేసులాగా ఇంత రాద్ధాంతమా? ఈ మాత్రం పరిస్థితుల నర్థం చేసుకోలేని నీకూ, ఒక పల్లెటూరి మొద్దుకూ తేడా ఏముందికి?" అనేసి, గబగబా క్రిందికెళ్ళిపోయాడు

జల్లులా పడుతున్న షవర్ క్రింద స్థాణువులా నిలబడిపోయింది మల్లిక నీళ్ళు బాగా వేడిగా పడుతున్నా ఆమె శరీరానికి తగలటం లేదు చన్నీళ్ళ టా తిప్పాలన్న ధ్యాసే లేదామెకు

* * * * *

ఆఫీసులో ఎవరిదో బర్త్‌డే అయితే అందరూ డబ్బులేసుకుని విందు చేసుకుంటున్నారు

మల్లిక ఒక్కతే ఒక టేబుల్ దగ్గర కూర్చుంది ఫిలిప్ కేకు ముక్క, ... పంచ్ పట్టుకుని మల్లిక దగ్గరకొచ్చాడు బైటికి చూస్తూ కూర్చున్న మల్లిక అతను రావటం గమనించలేదు

"హలో, హలో! ఎ పెన్నీ ఫర్ యువర్ థాట్స్!" చెయ్యి ఆమె ముఖం ముందు ఆడిస్తూ అన్నాడు

వులిక్కిపడి చూసింది మల్లిక

"ఏ లోకంలో వున్నావ్ మల్లికా? ఎప్పట్నుండో గమనిస్తున్నాను అందరి మధ్య నువ్వీ లోకంలో ఉండటంలేదు వున్నా నీ ముఖం మీద నవ్వే కనబట్టం







లేదు. కారణం ఏమిటి?"

"అందరూ నీలాగే నవ్వుతూ, తుళ్ళుతూ వుంటారా?" జవాబు చెప్పకుండా ఎదురు ప్రశ్న వేసింది.

"నవ్వుతూ, తుళ్ళుతూ వుండేవాళ్ళంతా సంతోషంగా వుంటారని అర్థంకాదు మై డియర్! ముందు నీ బాధేమిటో చెప్పు."

ఫిలిప్ వంక చూసింది మల్లిక. అతని ముఖం ఎప్పటిలా కాక సీరియస్‌గా వుంది. ఎప్పుడూ చిలిపిగా చూసే అతని బూడిద రంగు కళ్ళు అతి గంభీరంగా వున్నాయి. ఆషామాషీగా తిరిగే పాతికేళ్ళ కుర్రాడిలా కాక నడిమలుపు తిరిగిన పెద్దమనిష్యిలా కనపడుతున్నాడు.

"ఫిలిప్! ఎప్పుడూ నా గురించి అడుగుతావు గాని నీ విషయాలెప్పుడూ చెప్పలేదు. తెలుసుకోవచ్చా?" అప్రయత్నంగా అడిగింది. ఎందుకో, కులాసాగా కనపడే ఈ యువకుడిలో ఏదో నిగూఢమైన బాధ వుందని మొదటిసారిగా అనిపించింది.

నవ్వాడు ఫిలిప్. "నా జీవితంలో తెలుసుకోవాల్సినంతగా విశేషాలేం లేవు మల్లికా! మా అమ్మ చిన్నప్పుడే నన్నూ, మా నాన్ననూ విడిచిపెట్టి ఎక్కడికో వెళ్ళిపోయింది. మా నాన్నకి కడుపునిండా మందు కొడితే ప్రపంచమే అక్కర్లేదు! మా నాన్న తాగుబోతు అవటం మూలాన మా అమ్మ వెళ్ళిపోయిందో, మా అమ్మ వెళ్ళిపోవటం మూలాన మా నాన్న తాగుబోతు అయ్యాడో ఇప్పటికీ నాకు తెలియదు.

సరే, నాన్నా నేనూ మిగిలాం అని చెప్పాను గదూ? బ్రాంక్స్‌లో ఒక పాడుబడిన చీప్ అపార్ట్‌మెంటులో మా నివాసం! ఎందుకంటే మా నాన్నకి ఎప్పుడూ ఉద్యోగం వుండేదికాదు. పనిలో కూడా తాగే వాళ్ళకి వుద్యోగం ఏం నిలుస్తుంది? వెల్‌ఫేర్ వాళ్ళిచ్చే డబ్బు ఆయన తాగుడికే సరిపోయేది. గవర్నమెంటు వాళ్ళిచ్చే ఫుడ్ స్టాంప్స్‌తో ఒక పూట తిని, ఒక పూట తినకాగడిపేవాళ్ళం.

ఎలా హైస్కూలు చదువు పూర్తి చేశానో నాకే తెలియదు. ఒక విధంగా నా పేరంట్స్ మీద వున్న అసహ్యమే నాలో పట్టుదలగా మారిందనుకుంటాను. ఎలాగోలా ఆ మురికి కూపం నుండి బయటపడాలన్నదే అప్పటి నా ధ్యేయం!

ఆ టైంలో నే మా నాన్న చనిపోయాడు. నామ మాత్రంగా వున్న తండ్రి, నా అనుకున్న ఒక్క మనిషి కూడా పోయాడు. అప్పట్నుండీ ఈ లోకంలో నేను ఏకాకినే!"

"మీ అమ్మ?"

"ఆవిడ వుందో లేదో, వున్నా ఎక్కడుందో నాకు తెలియదు. తెలుసుకోవాలని లేదు కూడా!"

"మరి, పెళ్ళి చేసుకోవచ్చు కదా? నీ సంసారం, నీ భార్యా పిల్లలు – నీ వాళ్ళుంటారు గదా?"

పెళ్ళి చేసుకున్నంత మాత్రాన సంసారం ఏర్పడుతుందా? మా పేరెంట్స్‌ని చూస్తే తెలియటం లేదా?"

"అందరూ అలాగే వుండరు ఫిలిప్! ఒక మంచమ్మాయిని చూసుకుని పెళ్ళి చేసుకో."

"నీలాంటి మంచమ్మాయి దొరకాలిగా?" ఎప్పటి చిలిపితనంతో అన్నాడు.

మల్లిక అతని మాటలు పట్టించుకోలేదు. "నీలో ఇంత విషాదం దాగి వుందని ఈ రోజు వరకూ నాకు తెలియదు ఫిలిప్! అయామ్ సారీ!"

"ఎప్పుడో తప్ప నాకే గుర్తుండదు. డోంట్ బి సారీ!"

"అమెరికా ధనిక దేశం కాబట్టి ఈ దేశంలో అందరూ సుఖశాంతులతో బ్రతుకుతారని అనుకుంటారు బైటివాళ్ళు. అదెంత తప్పభిప్రాయమో నీలాంటి వాళ్ళను చూస్తే తెలుస్తుంది." తనలో తనే అనుకున్నట్టు అంది మల్లిక.

"దేశం ఏదైనా, మనుమలక్కడే మల్లికా! నిండు జీవితాన్ని నేలపాలు చేసుకొనేవాళ్ళు ఎక్కడైనా వుంటారు. పేదరికానికీ దానికీ సంబంధంలేదు."

మల్లిక మాట్లాడలేదు.

"ఎలాగైతేనేం సంభాషణని వేరే దారి త్రొక్కించావు. సరే, ఇప్పుడు చెప్పు."

"ఏం చెప్పను?" ఆశ్చర్యంగా చూసింది మల్లిక.

"ఈ మధ్య నువ్వలా ఎందుకుంటున్నావో?"

అప్పుడు గుర్తొచ్చింది మల్లికకు, సంభాషణ ఎక్కడ ప్రారంభమయ్యిందో! కాని, మల్లిక మనస్సులో సమస్య ఇప్పుడంత పెద్దగా కనిపించటం లేదు. చిన్న గీత ప్రక్కన పెద్ద గీత గీసినట్టు, బహుశ ఫిలిప్ జీవిత గాథని విన్నందువల్లనేమో!

అయినా చెప్పింది మల్లిక. ఈ రోజున ఫిలిప్‌ని చూస్తుంటే మనస్సులోని బాధ చెప్పుకోవాలనిపించింది. ఎప్పుడో తప్పిపోయిన చిన్నతమ్ముడిలా కన్పిస్తున్నాడతను.! ఎందుకో, తన జీవితానికీ, అతని జీవితానికీ పోలికలున్నాయనిపించింది.

చిన్నప్పుడే తన తల్లిదండ్రులు యాక్సిడెంట్‌లో చనిపోతే అతని తల్లిదండ్రులు వున్నా లేనట్టే అయ్యారు. అయితే తనకు అదృష్టవశాత్తూ అమ్మమ్మ ఆదరణ లభించింది. అతనికి అదీ లేదు!

అంతా విని అన్నాడు ఫిలిప్. "ఎక్కడో చదివాను మల్లికా! జీవితం ఒక తోటలాంటిదట. మాలి ఎంత కృషి చేస్తే ఆ తోట అంత పచ్చగా, అందంగా కళకళలాడుతుందట. ఎక్కడైనా చీడ పురుగులు పట్టినా, కలుపు మొక్కలు లేచినా విచారపడుతూ కూర్చోకుండా, ఆ భాగాన్ని తీసివేసి మిగిలినదానికి తగిన చికిత్స చేస్తే తోట మళ్ళీ పూర్వంలా ఆరోగ్యంగా వుంటుంది. జీవితమూ అంతే! నీలోని సహనాన్ని తగ్గనివ్వకు. అది జీవితమనే తోటకి ఎరువు లాంటిది!"

ఫిలిప్ మాటలు వింటుంటే మల్లికకు ఎదురింటి వాళ్ళ తోట గుర్తొచ్చింది.

(ఇంకా ఉంది)

# రచయితే మేల్కొన్నాడు!

వేదాంతం శరచ్చంద్రబాబు

గిరి నాలుగు దస్తాల తెల్లకాగితాలు కొన్నాడు. పది సిగరెట్ పెట్టిలూ ఓ అరడజను పీటీ కిల్లీలు తీసుకున్నాడు. ఎందుకైనా మంచిదని ఓ వంద గ్రాముల వక్కపొడి కూడా వాటికి జత చేశాడు. ఇన్ని ఉండగా ఆ ఒక్కటీ లోపమెందుకని ఓ ఫుల్ బాటిల్ విస్కీ కొనేశాడు. దానికి తోడుగా రెండు పొటాటో చిప్స్ పాకెట్లు కూడా కొని సంచీలో పడేశాడు. హుషారుగా యింటిదారి పట్టాడు.

గిరి నడుస్తున్నాడు. అతని కాళ్ళు యింటికి దారి తీస్తుంటే ఆలోచనలు మాత్రం ఆఫీసు చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. ఆఫీసులో మంగతాయారు ఓ పెద్ద రచయిత్రిలా పోజిచ్చేస్తుంటే తనకి ఒళ్ళు మండుకొచ్చేస్తుంది. నాలుగు కథలు రాసిందో లేదో ఎంత గర్వం? ఆఫీసులో అటెండరు దగ్గర్నుంచి ఆఫీసరు దాకా ఆమె కిచ్చే ప్రత్యేక గౌరవం మర్యాదా చూస్తుంటే తనకి మహా అక్కసుగా ఉంటుంది!

మంగతాయారు!– అప్పరాల్ తనకి ఫాలోసబ్ జూనియర్ మంగతాయారు ఉత్తరాల రచయిత్రి మంగతాయారు! ఎలాగో కొన్నాళ్ళకి వంటలూ వార్పులూ రాయటందాకా ఎదిగిందే అనుకో– ఉన్నట్టుండి ఓ రోజున ప్రేమ కథల రచయిత్రిగా పేద్ద పేరు తెచ్చేసుకుంటుందా? ఆ ప్రేమ కథలంటే కుర్రకారు నుంచి ముసలి పీనుగుల దాకా ఎగబడి చదువుతారా? తెగ మెచ్చుకుంటారా? ఛీ ఛీ!! ఎందుకీ మగ రచయిత జన్మ?!

ఆ రోజు ఉదయం– హోటల్లో భోజనం చేస్తుంటే– ఆ పక్కన కూర్చున్న కాలేజి కుర్రాళ్ళు చవులూరించే సంతానమయ్యర్ వంటకాల్లో రుచులు మరిచిపోయి మంగతాయారు కథల్లోని రుచుల్ని పరిపరి విధాల వర్ణించుకుంటూ



పరవశించి పోతారా? వాళ్లలా చెవులు కోసిన మేకల్లా అరుస్తూ పోటీలుపడి మంగతాయారునీ, ఆమె ప్రేమ కథల్నీ పొగిడేస్తూంటే తనకు ముద్ద మింగుడు పడలేదు! వెధవలు- వీళ్లకి చదువూ సంధ్యా అనే ధ్యాసే లేదు ఎంతసేపూ సినిమాలూ, నవలలూ, కథలూ, క్రికెట్ మాచ్‌లూ- ఇవే లోకమై పోయాయి! మరి జనరేషన్ చెడిపోతోందీ అంటే- చెడిపోవటం లేదూ?

ఊఁ. పిచ్చిగాని- జనరేషన్ ఎటుపోతే ఎవరికి కావాలి? కావాల్సింది పేరూ, డబ్బూ! ప్రేమ కథలు రాస్తే అవి వద్దన్నా వచ్చిపడతాయి! మంగతాయారు ఆ రహస్యంతెలుసుకుంది!విజృంభించింది! వరసబెట్టి కథ మీద కథరాసి పారేస్తోంది!

'డామిట్! ఇహ తప్పదు! అపాటి కథలు నేను మాత్రం రాయలేనా? రాస్తాను! ప్రముఖ ప్రేమ కథా రచయిత గిరి- అంటూ కుర్రకారంతా బ్రహ్మరథం పట్టేయాలి! ఆఫీసులో మంగతాయారు వెలిగిస్తున్న ఏకచ్ఛత్రాధిపత్యాన్ని ఈ దెబ్బతో కొట్టేయాలి!" అని గట్టిగా నిర్ణయించుకున్నాడు ఆ పట్టుదలతో నే నడుస్తున్నాడు

గిరి ఆలోచనల్లోంచి తేరుకుని తలెత్తేసరికి ఇంటి గుమ్మం వచ్చేసింది. ఆ గుమ్మంలో శ్రీమతి రోజా తనకోసం ఎదురు చూస్తూ నిలబడేది ఆ రోజు తాళం ఎదురు చూస్తోంది! అప్పుడు మతి కొచ్చింది గిరికి- శ్రీమతి పిల్లలతో పుట్టింటికి వెళ్ళిన సంగతి!

అదికూడా ఒక మంచికే జరిగింది. తన రచనా వ్యాసంగానికి పెళ్లాం బిడ్డల బెడద ఉండదు!

అసలు మంగతాయారు ఇన్ని ప్రేమ కథలు రాసి పారేస్తోందీ- అంటే ఇంకా పెళ్లి కాలేదు కాబట్టే! తను స్వయంగా అందుకోలేని అనుభవాల్ని కాగితం మీద పెట్టి తృప్తి పడుతోంది! అయినా అంత వయస్సు నెత్తి కెక్కిన తర్వాత ఆ మాత్రం ఏదో వ్యాపకం లేకపోతే పొద్దెలా పోతుంది? పొద్దు పోవటానికి కొందరు సినీమాల కెగబడతారు- కొందరు బీచ్‌లనీ పార్కులనీ షికార్లు మొదలెడతారు కొందరు తాగుడు మరిగితే- మరి కొందరు పేకాట కలవాటు పడతారు- ఇంకొందరు లోకాభిరామాయణంతో రోజులు వెళ్లబుచ్చుతారు. ఇలా ఒక్కొక్కరూ ఒక్కొక్క దారి వెదుక్కుంటారు పాపం- మంగతాయారు అసలే ఆడది. అందునా వయసు ముదిరినా పెళ్లికాని ఆడది! ఏం చేస్తుంది? ఊహాలోకంలో విహరిస్తూ తన అచ్చట్లు ముచ్చట్లు తీర్చుకుంటోంది. అవే కథలుగా కాగితాలమీదికి ఎక్కిస్తోంది! తృప్తిపడుతోంది! పోనీ పాపం- పూర్ క్రీచర్!

ఉన్నట్టుండి మంగతాయారు మీద ఎక్కడలేని సానుభూతి ముంచుకొచ్చింది గిరికి!

ఆలోచిస్తూనే గిరి టేబుల్ నీట్‌గా సర్దాడు తను తెచ్చిన నాలుగు దస్తాల తెల్ల కాగితాలు సిద్ధంగా టేబుల్ మీద పెట్టుకున్నాడు సరంజామా అంతా అందుబాటులో ఉంచుకున్నాడు

"మహా మహా రచయితలంతా మందు కొట్టేవాళ్లేనోయ్!" అని అంజనేయులనే మాట గుర్తొచ్చి గిరి చిన్నగా నవ్వుకున్నాడు సిగరెట్ చేతి కందుకున్నాడు వెలిగించి పొగల వలయాలు సృష్టిస్తూ ఆలోచనల వలయాల్లో పడి విలవిలలాడుతున్నాడు

కాసేపు కూర్చుని ఆలోచించాడు కాసేపు నిలబడి ఆలోచించాడు మరికాసేపు ఈజీ చైర్లో పడుకుని కళ్లు మూసుకుని మరీ ఆలోచించాడు చివరికిలాకాదని లేచి గదిలో పచార్లు మొదలెట్టాడు కాలం చెప్పకుండా చెందకుండా గడిచి పోతూనే ఉంది కానీ కథకు మాత్రం తలా తోకా దొరకలేదు తన అశక్తతకు నిట్టూరుస్తూ టేబుల్ ముందు చదికిల బడ్డాడు గిరి ఆశ్చర్యం! నాలుగు సిగరెట్ పెట్టెలూ, రెండు పెగ్గుల మందూ ఒక చిప్స్ పాకెట్, సగానికి సగం వక్కపొడి ఖాళీ!

నిజంగా సిగ్గు పడ్డాడు గిరి!

ఇక ఇలా లాభం లేదనుకున్నాడు ఇటు నుంచి కుదరక పోతే అటునుంచి నరుక్కు రమ్మన్నారు- మరి! ముందు చక్కని పేరు కుదిరితే ఆపైన అందమైన కథ అదే దొరుకుతుంది!

మరో సిగరెట్ వెలిగించి పేరు కోసం ఆలోచన మొదలెట్టాడుగిరి!

'అందమైన కథ" అని పెట్టేస్తే? అబ్బే! చప్పగా ఉంది! కథ అందమైన ప్రదేశంలో అందమైన పాత్రలతో, అందమైన సంఘటనలతో ఆనందంగా సాగిపోవాలి!

కాశ్మీర్!- అవును కాశ్మీర్ ఎంత అందమైన ప్రదేశం? ఆ అందమైన కాశ్మీర్ సీమలో ఓ అందమైన జంట- ప్రేమలో పడితే?- బాగానే ఉంటుంది గానీ తెలుగుదనం లోపిస్తుంది! అంచేత తెలుగు నేలమీదే- తెలుగు జంట ప్రేమించుకోవడం మొదలెట్టాలి! వాళ్ల ప్రేమ కాశ్మీర్‌లో ఫలించాలి! అప్పుడు కథ పేరు- "కాశ్మీర్‌లో ప్రేమ" అని పెట్టొచ్చు! ఛ-- ఛ- బ్లడీ తెలుగు! ఇంచక్కా ఇంగ్లీషులో "లవ్ ఇన్ కాశ్మీర్" అంటే ఇంపుగా ఉంటుంది! "లవ్ ఇన్ కాశ్మీర్" అని కథ పేరు చదవగానే కుర్రకారు వెర్రెత్తిపోరూ?

వెంటనే గిరి టేబుల్ దగ్గర కొచ్చి "లవ్ ఇన్ కాశ్మీర్" అని పెద్ద పెద్ద అక్షరాల్లో అందంగా టైటిల్ రాశాడు పేరు ముచ్చటగా కుదిరినందుకు మరీ మరీ చూసుకుని మురిసి పోతూ కింద తన పేరు కూడా అందంగా రాసుకున్నాడు

టైటిల్ దొరికింది! ఇక కథ దొరకాలి! మళ్లీ ఓ సిగరెట్ వెలిగించాడు. పచార్లు మొదలెట్టాడు

పేరు అందంగా కుదిరింది ఇక కథ అందంగా కుదరాలి! కథలో హీరో హీరోయిన్లు ఉండాలి! ఊరికే ఉండటం కాదు అందంగా ఉండాలి! వాళ్ల పేర్లు అంతకంటె అందంగా ఉండాలి! ఇంక ఆ అందమైన హీరో హీరోయిన్లకు ఆకాశాన్నంటే అందమైన మేడలూ, ఇంపోర్టెడ్ ఏ సి కార్లూ, ఊరంత



ఉద్యానవనాలూ వగైరా వగైరా ఏటూ ఉంటాయి!

ఊహ ఊపందుకుంది! కథేదో చేతి కందినట్టే అనిపిస్తోంది సిగరెట్ మీద సిగరెట్ వెలిగిస్తున్నాడు ఆలోచిస్తూ పచార్లు చేస్తున్నాడు గిరి!

హీరోయిన్ పేరు ఏం పెట్టాలి? ప్రేమకి సంకేతం రాధ! అవును– హీరోయిన్ పేరు రాధ! ఓహ్! అందంగా ఉంది పేరు. పేరే కాదు రూపం కూడా అందంగానే ఉంటుంది! చదివే రోజుల్లో "కాలేజీ బ్యూటీ" అని పిలిపించుకున్నది ఆ మాజీ కాలేజి బ్యూటీకి కావలసినంత ఆస్తీ, అంతకంటె రెట్టింపు ప్రేమా ఉన్న తండ్రి ఉంటాడు!

ఇక హీరో! హీరో పేరు?– హీరోయిన్ రాధ కాబట్టి హీరో పేరు కృష్ణ అయితే?– ఊహుఁ! బాగా లేదు– పాత చింతకాయ పచ్చడి! మరి? "ఆనంద్" అంటేనో?– ఫర్వాలేదు! ప్రస్తుతానికి "ఆనంద్" అనే అందాం! ఆనంద్ అందమైన యువకుడు! డాక్టరు! పెళ్లికాలేదు! కవిత్వం వచ్చు! కమ్మగా పాడతాడు కూడా!

రాధ కేదో జబ్బు చేస్తుంది ఆనంద్ ఆమెకు చికిత్స చేస్తాడు ఆమె కా జబ్బు నయమవుతుంది మరో జబ్బు మొదలవుతుంది! ఆ జబ్బు బాగా ముదరటానికి ఆనంద్ స్ట్రాంగ్ డోస్ ఇచ్చేస్తాడు! ఆ జబ్బు ముదిరిపోయిన రాధ కలవరింతలూ పలవరింతలూ! రాధకు పట్టింది ప్రేమ జబ్బని తెలుసుకున్న తండ్రి ధుమధుమలూ చిటపటలూ! తన చిటపటల చిట్కాలతో కూతురి జబ్బు నయంకాదని తెలుసుకున్న తండ్రికొత్త చిట్కా ప్రయోగిస్తాడు ఆనంద్‌కి మరో ప్రియురాలు ఉన్నదన్న అపోహ కల్పిస్తాడు. రాధ మనసు విరిగి పోతుంది విరిగిపోయిన మనసు ముక్కల్లో కూడా ఆనందే కన్పించి కలవర పెడుతుంటాడు అది కనిపెట్టిన తండ్రి ఆనంద్‌ని మరిచిపోవటానికి రాధని కాశ్మీరు తీసుకెళ్తాడు

రాధ ఏమయిందో తెలియక ఎంతో బాధపడతాడు ఆనంద్! మనశ్శాంతి కరువై పోతుంది కన్నీరే చెరువై పోతుంది ఆసుపత్రి అనాథగా మిగులుతుంది. పిచ్చివాడిలా తయారైన ఆనంద్‌ను అతని చెల్లెలు కాశ్మీరు తీసుకెళ్తుంది!

అక్కడ చెల్లెలితో తిరుగుతున్న ఆనంద్‌ను రాధ చూస్తుంది రహస్యంగా వాళ్లను అనుసరిస్తుంది ఆనంద్ అడ్రెసు తెలుసుకుంటుంది! ఆనంద్ లేకుండా చూసి అతని చెల్లెల్ని కలుసుకుంటుంది ఆమె ఆనంద్ చెల్లెలనీ ప్రియురాలు కాదనీ నిజం తెలుసుకుంటుంది! ఆనంద్ తననే ఆరాధిస్తున్నాడనీ తన కోసమే పరితపిస్తూ పిచ్చివాడిలా తిరుగుతున్నాడనీ తెలిసి చాలా బాధపడుతుంది ఆనంద్‌ని క్షమాభిక్ష కోరుకోవాలను కుంటుంది!

ఈలోగా రాధ తండ్రి ఒక ప్రమాదానికి గురవుతాడు. ఆనంద్ ప్రాణాలకు తెగించి అతన్ని

# రచయిత మేల్కొన్నాడు!

రక్షిస్తాడు ఆనంద్‌లోని మంచితనానికి రాధ తండ్రి కరిగిపోతాడు

బాధపడిన కూతురు, కరిగిపోయిన తండ్రి కలిసి ఒకరి మనసు ఒకరు తెలుసుకునేసరికి ఆనంద్ ఆ యింటికి అల్లుడై కూర్చుంటాడు కథ సుఖాంతం ఇక కొసమెరుపుగా– మొదటిరాత్రిని మాంచి మజాగా వర్ణించాలి! ఆ దెబ్బతో కుర్రకారు నుంచి ముసలివాళ్లదాకా తల దిమ్మ దిరిగి పోవాలి! తనకు బ్రహ్మరథం పట్టాలి!

ఓహ్! బ్రహ్మాండంగా కుదిరింది కథ! అనుకున్నాడు గిరి ఎగిరి గంతేసినంత పని చేశాడు మంగతాయారు కథలన్నీ కలిపినా ఈ ఒక్క కథతో సరితూగవు! తన కథ చదువుతూ పాఠకులు సెవెన్టీ ఎమ్మెమ్ సినీమా చూస్తున్న మధురానుభూతి పొందాల్సిందే! ఇక మీదట మంగతాయారురాసే థర్టీ ఫైవ్ ఎమ్మెమ్ బ్లాక్ అండ్ వైట్ కథలకి కాలం చెల్లిపోయినట్టే!

ఉత్సాహంగా ఊపిరి పీల్చుకున్నాడు గిరి!

ఇహ తను ఊహించిన కథను అందంగా, ఉత్కంఠతో చదివించే విధంగా కాగితాల మీది కెక్కించటమే మిగిలింది! మళ్లీ ఒక కిళ్లీ బిగించి, సిగిరెట్ వెలిగించి, కలం చేతబట్టి కథారచన కుపక్రమించాడు

అంతలో– సరిగ్గా గిరి యింటి ఎదురుగా రోడ్డుమీద పెద్ద గోల!

"ఛీ–ఛీ! వెధవగోల!" అని విసుక్కున్నాడు గిరి! అయినా యీ మాత్రం గోలకే మూడ్ చెడిపోతే ఎలా? పిడుగులు పడనీ, భూమి బద్దలై పోనీ ఉప్పెనలు రానీ, ఊళ్లు మునిగిపోనీ– అందమైన ఊహల్లో తేలుతూ, బావ ప్రపంచంలో హాయిగా విహరించే వాడే– భావకుడు. అలాంటి బావుకుడే బాధల బ్రతుకుల్ని దరి జేర్చే నావికుడు! అని ఎక్కడో చదివిన మాట గుర్తొచ్చింది గిరికి! గర్వంగా రొమ్ము విరుచుకున్నాడు మళ్లీ మూడ్ తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు

బయట గోల అంతకంతకూ ఎక్కువైపోతోంది ఆ గోల ఎక్కువైన కొద్దీ గిరి మూడ్ చెదిరి పోతోంది పట్టుదల సడలి పోతోంది

ఉన్నట్టుండి విసుగ్గా పైకి లేచాడు గబగబా బయటికి నడిచాడు అక్కడి దృశ్యాన్ని చూసి నిశ్చేష్టుడై నిలిచిపోయాడు

ఎదురింటి డబ్బున్న సుబ్బారాయుడి అల్సేషన్ కుక్క భీకరంగా మొరుగుతూ ముందుకు దూకటానికి ప్రయత్నిస్తోంది గొలుసును లాగిపట్టుకున్న సుబ్బారాయుడు వెనక్కూ ముందుకూ ఊగిపోతూ కుక్కకన్న కర్కశంగా అరుస్తున్నాడు ఇరుగు పొరుగు కొందరు వీధిలో కొచ్చి, మరి కొందరు గుమ్మాలలో నిలబడి ఆ దృశ్యాన్ని ఆసక్తిగా చూస్తున్నారు

అక్కడ ఓ ఆడది అర్ధనగ్నంగా నేలమీద కూలబడి ఉంది మొల మీంచి మోకాళ్ల వరకు మాసి చినిగి పీలికలైన పావడా మాత్రం ఉండీ లేనట్టే ఉంది. దాని చంకలోంచి జారిపడిన బిడ్డ గొల్లున ఏడుస్తూ, రెండు చేతులతో తల్లి గుండెల మీదా వీపుమీదా బాదుతూ ఎండిన రొమ్ముల మీది కెగబాకుతోంది! ఏడుస్తున్న బిడ్డను ఓదార్చే ప్రయత్నమే చెయ్యటం లేదా తల్లి!

అల్లంత దూరంలో చినిగి పీలికలై పోయిన పైటగుడ్డ– దానికి కొంచెం ఇవతలగా నేలపాలైన పాత సత్తు బొచ్చె– ఆ బొచ్చెలోంచి చిందర వందరగా పడిపోయిన మెతుకులు ఎదురుగా మీదికి దూకటానికి ప్రయత్నిస్తూ భయంకరంగా మొరుగుతున్న కుక్క ఆ కుక్క గొలుసును లాగిపట్టుకుని దానికన్న క్రూరంగా అరుస్తున్న సుబ్బారాయుడు

ఆ ఆడది ఏడుస్తున్న బిడ్డ వంక చూస్తుంది! పీలికలైన పైటగుడ్డ వంక చూస్తుంది! మట్టిపాలైన మెతుకుల వంక చూస్తుంది! ఎగబడి వస్తున్న కుక్క వంక చూస్తుంది! హుంకరిస్తున్న సుబ్బారాయుడి వంక చూస్తుంది! జాలీ, నిస్సహాయతా, దైన్యమూ, భయమూ, అసహ్యమూ అన్నీ కలగలిసి దాని చూపులు శూన్యంగా మారాయి! కంటికి కడివెడు నీళ్లుగా కారుతున్నాయి! దాని ఎక్కల మీద కుక్క కరిచిన గాయాలు నెత్తురోడు తున్నాయి!

"ఇంకా అక్కడే తగలడ్డావేం? దొంగముండా! అక్కణ్నుంచి లే ముందు! అడుక్కునే వంక బెట్టుకొచ్చి, ఇళ్లల్లో జొరబడి చేతికందింది ఎత్తుకు పోతారు! సన్నాసి జాతి! ఈసారి యీ వీధిలో కనిపించావంటే– చూశావుగా ఈ కుక్కని"– అంటూ సగర్వంగా తన కుక్కవైపు చూశాడు రాయుడు యజమానిని అర్థం చేసుకున్నట్టుగా భయంకరంగా మొరుగుతోంది కుక్క!

ఆ బిచ్చగత్తె భయంతో గజగజ వణుకుతూ

నా దిగులుకి కారణం ఏమని చెప్పను లక్ష్మీ... నా భక్తుడు - తన పిల్లలకు టెక్స్ట్ పుస్తకాలు కావాలని కోరాడు, వాటినెలా ఇవ్వాలో అర్థం గావటం లేదు...



"మరి!" ప్రశ్నార్థకంగా చూశాడు అప్రావ్

"రెండు నెలలపాటు మీ పోర్షన్ మొత్తం కావాలి. అందుచేత వేరేయిల్లు చూసుకోండి" ఇక చెప్పేది ఏమీలేనట్లు లోపలికి వెళ్ళిపోయాడు.

బాంబు ప్రేలినట్లు అదిరిపడ్డాడు అప్రావ్.

"పెళ్ళి మీ అమ్మాయిక్కాదు మా కు చేస్తున్నారు" మనసులో గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు అప్రావ్.

మళ్ళీ అద్దెయింటి వేటలో పడ్డాడు అప్రావ్.

ఒకచోట యిల్లు ఖాళీగా వుందిట.

ఇల్లు బాగానే వున్నది. అన్ని సౌకర్యాలున్నాయి. అద్దె సరసంగానే వున్నది. కాని వారి యింట్లో ఆడపిల్లలు తెగతిరుగు తున్నారు.లెక్కపెట్టాడు.

ఆరుగురు! అందులో పెళ్ళీడుకొచ్చినవాళ్ళు ముగ్గురు !

అది గమనించిన అప్రావ్ యథాలాపంగా అడిగాడు.

"పెళ్ళంటూ జరిగితే స్వంతంలో కదా చేసేది"

"నాకెప్పుడో పెళ్ళి అయిపోయింది బాబూ! పైగా ఆరుగురు ఆడపిల్లలు కూడాను"

"మీక్కాదండీ ! మీ ఆడపిల్లలకు"

"ఆకాశమంత పందిరీ, భూదేవంత అరుగూ వేసి ఇద్దరమ్మాయిలకు పెళ్ళి చేశాం. చుట్టు ప్రక్కల రెండు మూడు కొంపలని ఖాళీ చేయించి మరి అట్టహాసంగా చేశాము. మిగతా అమ్మాయిలకు కూడా యిలాగే వైభవంగా పెళ్ళి..." ఆయన అలా మాట్లాడుతునే వున్నాడు.

ఇలా అప్రావ్ ఒక నమస్కారం పెట్టి వెళ్ళనూ వెళ్ళిపోయాడు.

మరో యిల్లు చూశాడు అప్రావ్.

తలుపు తట్టాడు.

తలుపు తీశాడు ఆ యింటి యజమాని.

"మీ యింట్లో ఆడపిల్లలున్నారా ?" అడిగాడు అప్రావ్ ఇటునుంచి నరుక్కొస్తే మంచిదని.

అప్రావ్ కాలరు పట్టుకున్నాడతను.

"ఎవడ్రా నువ్వు! మా ఆడపిల్లలతో నీకేమి పని ?'

దిగ్భ్రాంతి చెందాడు అప్రావ్. "అది కాదన్నార్ ! పెళ్ళి అయిన ఆడపిల్లలు. పెళ్ళి కావలసిన ఆడపిల్ల లెంతమంది ?" అయోమయంలోపడి అడ్డదిడ్డంగా మాట్లాడటం మొదలెట్టాడు అప్రావ్ !

అప్రావ్ చెంప చెళ్ళుమంది.

ఆ దెబ్బతో మత్తు వదిలిపోయింది

"మీ యింట్లో అద్దెకిచ్చే పోర్షన్‌వుందిటగా! సర్దుకుని అన్నాడు అప్రావ్.

"మా యింట్లో అద్దెకుండి ఆడపిల్లలను వేధించుదామనా రాస్కెల్ !"

మెడ పట్టి బయటకు గెంటాడు అతను.

రోడ్డుమీద పడ్డ అప్రావ్ బట్టలు దులుపుకున్నాడు. ఛ ! ఛ . రాంగ్ రూటులో మాట్లాడినట్లున్నానని గొణుక్కున్నాడు.

ఇంకో యిల్లు చూశాడు అప్రావ్.

(పాఠకులు క్షమించాలి. ఏమిటీ ఈమహానుభావుడు దేశంలో యిళ్ళన్నీ తిప్పి బోర్ కొట్టిస్తున్నాడు అని విసుక్కోవచ్చు. కథ రసవత్తరంగా సాగాలంటే యీ మాత్రం బోర్ తప్పదు)

ఫరవాలేదు.

మూడు వాటాలు... ఎవరి వాటా వాళ్ళకు వేరే పంపూ. లెట్రినూ !

"గొడవలు రాకుండా ఎవరికి కావలసినవి వాళ్ళకు ప్రత్యేకంగా కట్టించాను ! యికిలించాడు యజమాని.

ముగ్ధుడయ్యాడు అప్రావ్.

అద్దె యింటి వాళ్ళ వాటాల మధ్య గొడవలు రాకుండా శాంతిని స్థాపించ గలిగిన యీ మహోన్నతుని సేవలు వినియోగించు కుంటే దేశం అంతటా శాంతి నెలకొనదా !

తిరిగి పాత పాట ప్రారంభించాడు అప్రావ్ "మీ పిల్లలకి......"

"ఏం పిల్లలండి బాబూ! చెడిపోతున్నారు. పిదపకాలం పిదప బుద్ధులు! వినే రకాలా!"

"మీ పిల్లలకి......"

"పిల్లలు పాడయిపోతున్నారండి. వెనుకటి కాలంలో ఈ వెధవ ఫ్యాషన్‌లుండేవా? ఆ రోజులలో మంగలిముందు తలవంచుకుని బుద్ధిగా పెద్దలు శాసించినట్లుగా డిప్పలు కొట్టించుకునే వారు... ఇపుడో! నల్లకళ్ళజోడెట్టుకుని వంటినిండా జుట్టుతో ఎలుగుబంటిలా వుంటున్నారు. అలాగే పెద్దలు నిర్ణయించిన పెళ్ళిళ్ళనే చేసుకుని సుఖంగా కాపురాలు చేసుకునేవారు. ఇప్పుడు ప్రేమ వివాహాలు, వర్ణాంతర వివాహాలూ! ఛ!ఛ! మాయదారి కాలం!" అనర్గళంగా చెప్పుకు పోతున్నాడు ఆయన.

"మీ పిల్లలకి......"

"అసలు కాలేజీలకు వెడుతోంది ఎందుకంట! ప్రేమించుకోవటానికి, స్ట్రైకులు చేయటానికీ కాకపోతే! పరిస్థితి యిలా వుంటే దేశం పాడవక ఏమవుతుందట!" రంకెలు వేస్తున్నాడాయన.

భయం వేసింది అప్రావ్‌కి.

"మీ పిల్లలకి......" నీరసంగా అన్నాడు అప్రావ్.

"ఏమిటన్నారూ"

"మీ పిల్లలకి!"

"ఆఁ! నా పిల్లలకి" క్వొశ్చెను మార్కు మొహం పెట్టాడు.

"పెళ్ళి చేశారా" నోరు పెగల్చుకుని అన్నాడు అప్రావ్.

ఆయన ఆశ్చర్యపోయి పకీపకీ నవ్వసాగాడు.

బిక్కమొహం పెట్టాడు అప్రావ్.

"చూడండి. చూడండి నా పిల్లలకు సంబంధాలు! కాకపోతే వధూవరులకు అయిదేళ్ళ ఎడం వుండాలి. అలా చూడగల్గితే యిప్పుడే చేసేస్తాను వాళ్ళకు పెళ్ళి!" అంటూ లోపలికి వెళ్ళి ఇద్దరు మగపిల్లలను తీసుకొచ్చాడు.

"వీరే నా సంతానం! ఆ వెధవకి మూడేళ్ళు! ఈ కుంకకి ఏడాది!" అన్నాడు సీరియస్‌గా.

అర్థం చేసుకున్న అప్రావ్ ఏడవలేక నవ్వాడు.

ఇహ అద్దె!

"అంత!" అంటాడు యజమాని.

"యింత!" అంటాడు అప్రావ్.

"సరే! రేపు రండి! ఆలోచించి చెబుతాను" అన్నాడు యజమాని.

మర్నాడు ఎగురుకుంటూ వెళ్ళాడు అప్రావ్.

"సారీ! మనం అనుకున్న అద్దెకంటె యాభయి రూపాయిలు ఎక్కువ యిస్తానన్నారు మరొకరు— ఎలా వదులుకొనేది చెప్పండి. పైగా నిన్న రాత్రి అడ్వాన్సుకూడా యిచ్చేశాడు" అన్నాడు యజమాని మొహం చాటుచేసుకుంటూ.

శాంతిదూతగా దీనజనోద్ధారకుడుగా నిన్నటి వరకు కన్పించిన ఈ యజమాని దేశాధినేతను చేస్తే డబ్బుకోసం దేశాన్ని అమ్మేయగలడన్పించింది. వాగ్దానాలను గడ్డిపోచగా, డబ్బే పరమావధిగా పరిగణించే ఆ యజమాని యింట్లోఎవరు అద్దెకుండగలరు ?

దిగాలుపడి తిరిగి రోడ్డున పడ్డాడు అప్రావ్.

"అప్రావ్ !"

కేకవిని వెనక్కి తిరిగిచూశాడు అప్రావ్.

సుబ్రావ్

"ఈ వీధి చివరిలో ఒక పోర్షను అద్దెకుందిట. వెళ్ళి చూడు !" అన్నాడు.

ఆ యింటి యజమాని అసల్సిత బ్రహ్మచారిట. పెళ్ళిపెటాకులు పిల్లాపీచూ బాదరబందేమీ లేవుట !

అఘ మేఘాలమీద వెళ్ళాడు అప్రావ్.

ఇంటికి సున్నం వేస్తున్నారు.

ఇహ అద్దెకిస్తారు కాబోలు.

లోపలికి వెళ్ళాడు.

ఇద్దరువ్యక్తులు కనిపించారు.

అందులో ఒకరు యింటి యజమాని. మరొకరు ఎవరబ్బా !

వచ్చినపని చెప్పాడు అప్రావ్

"లాభం లేదండీ ! వీరి కిచ్చేశాను. నిన్నే వచ్చి ఆక్రమించుకున్నారు" అంటూ రెండో వ్యక్తిని చూపించాడు.

అందినట్లే అంది చేజారిన పెన్నిధి అయిందే అని లబలబ లాడాడు అప్రావ్ !

తనరాజ్యాన్ని అక్రమంగా ఆక్రమించిన ఆ రెండోవ్యక్తి వంక గుర్రుగా చూశాడు అప్రావ్ !

వెంటనే అప్రావ్‌కి ఒక ఐడియా తట్టింది.

సదరు రెండోవ్యక్తిని అడిగాడు.

"ఎక్కడ నుంచి ఖాళీ చేస్తున్నారు ?"

ఫలానా యింట్లోంచి"

"అరే ! ఆ యిల్లా ! ఆయన నాకు బాగా తెల్సినవాడేనే ! అంతకుముందు వెళ్ళి అడిగితే లేదన్నాడే"

"అవును ! అప్పుడు లేదు. యిపుడుందిగా! వెళ్ళి కనుకోకుండి !"

అప్రావ్‌కి అనుమానం వచ్చింది.

"మరి మీరెందుకు ఖాళీ చేస్తున్నట్లు"

## అప్పారావు-అద్దెయిల్లు

"పిల్లలకు స్కూలు దూరమని !" సమాధానం ఇచ్చి అప్రావ్‌కి మరొక ప్రశ్నకు అవకాశం యివ్వకుండా సైకిలుమీద రివ్వున వెళ్ళిపోయాడు.

అప్రావ్‌కి మరొక అనుమానం పట్టుకుంది.

ఆ యింటి ఓనర్‌ది కుచేల సంతానం. పెళ్ళిళ్ళు అయినాయో ! లేవో ! కనుక్కుంటేసరి.

వెళ్ళాడు అప్రావ్.

"బాగున్నారా సార్ !" పలకరించాడు అప్రావ్.

"ఓ. కె." అన్నాడాయన.

ఎన్‌క్వైరీ మొదలెట్టాడు అప్రావ్.

"యింట్లో ఎవరూ లేనట్లుంది. మీరు మీ భార్యా కనబడుతున్నారు"

"పిల్లలు ఎప్పుడూ పిల్లలుగా వుంటారుటయ్యా ; ఎదగరూ ! ఆడపిల్లలు సలక్షణంగా కాపురాలు చేసుకుంటున్నారు. మగపిల్లలు ఎక్కడెక్కడో ఉద్యోగాలు చేసుకుంటున్నారు. పిల్లా పాపలతో కళకళ్ళాడుతున్నారు !" అంటూ ఫెళ్ళున నవ్వాడు.

"మొత్తానికి పిల్లలందరికి పెళ్ళిళ్ళు చేసి గట్టున వడ్డారన్నమాట ! గుడ్ !" మెచ్చుకున్నాడు అప్రావ్.

చిరునవ్వు నవ్వాడు ఆయన మీసం దువ్వుకుంటూ.

"ఇహ నా షష్ఠి పూర్తి"

ఉలిక్కిపడ్డాడు అప్రావ్.

"అదీ కూడా మూడు నెలల క్రిందటే అయిపోయింది !"

దీర్ఘంగా నిట్టూర్చాడు అప్రావ్.

"మీ యింట్లో అద్దెకిచ్చే అయిదు పోర్షనులలో ఒక పోర్షను ఖాళీ అయినట్లు విన్నాను"

"మరే !"

"అది నాకు కావాలి"

"సరే !"

"ఎంత ?"

"యింత !"

"దారుణం ! ఎక్కువేనండీ"

"అయితే వెళ్ళిపొండి"

"అమ్మమ్మ ! అంత మాటనకండి ! సరే కానివ్వండి ! అవసరం నాది కనుక తప్పదు"

ఇల్లు కలవాళ్ళకి యిల్లు లేనివాళ్ళంటే ఎంత చులకన ! నిలువునా దోపిడి చేస్తున్నారని వగచాడు అప్రావ్.

తను యింటికెళ్ళి సామాన్లను గోనెసంచుల లోనూ బుట్టలలోనూ సర్దాడు. "కొత్త యింటికి వెళ్ళగానే ఆ ప్యాకేజీలు గోనె సంచులు విప్పకు ! అలాగే కొంతకాలం వుంచుకుందాం" అన్నాడు భార్యతో సీరియస్‌గా అప్రావ్

"మీకేమి మతి పోలేదు కద ! సామానులు తీయకుండా అక్కడ పనులు ఎలా జరుగుతాయండీ ?" అన్నది భార్య ఆశ్చర్యపోతూ

"ఏదో వంక పెట్టి ఆ కొత్త యింటివాళ్ళు ఏ క్షణాన ఖాళీ చెయ్యమంటారో ! రోజులు అలా వున్నాయి" నవ్వాడు అప్రావ్.

"నేను యమ్మెల్యే కావడం ఖాయం !" కాలరెగరేసుకుంటూ మళ్ళీ అన్నాడు అప్రావ్.

వింతగా చూచింది అప్రావ్ భార్య. ఈయనకేమీ పిచ్చెక్క లేదు కద !

"ఏం యిపుడు చేస్తున్న ఉద్యోగం బాగా లేదా ! గెలిచి ఏకంగా మంత్రి అవుదామనా ! మన్త్రబతుక్కి అదొక్కటే తక్కువ !" ఈసడించింది అప్రావ్ భార్య.

"అదికాదే వెర్రిమొహమా ! ఇలా మనం ప్రతి మూడు నెలలకు నాలుగుమూలలా ఇల్లు మారుతుంటే మనకి మరింత పలుకుబడి వుంటుంది. యమ్మెల్యేకి పోటీచేసి గెలవడం తేలిక !" మరింత గట్టిగా నవ్వాడు అప్రావ్.

"సంతోషించాం ! మీ జోకులకు ! ముందు మిగతా సామాన్లు సర్దండి ! అవతల తోపుడు బళ్ళవాళ్ళొచ్చారు." అని పనిలోనికి మునిగి పోయింది అప్రావ్ భార్య.

"ఏఁవాయ్! ఈ తోపుడుబండి ఖరీదు ఎంత వుంటుంది" అడిగాడు అప్రావ్ బండివాడిని సిరియస్‌గా.

"ఎందుకండి తమకుబండి" ఆశ్చర్యంగా అడిగాడతను.

"ఏంలేదోయ్ ! క్షణ క్షణానికి ఇళ్ళు మారుతూ బండ్లకు బోలెడు తగలేసేబదులు ఆ బండ్లేవో కొని నేను, నాపిల్లలు లాగిస్తే కలిసొస్తుంది కదా అని!" యికిలించాడు అప్రావ్.

"బలేవారు బాబయ్యా ! మీరు" నవ్వాడు బండి అతను.

సామానులన్ని బండ్లలోవేసి కొత్తయింటికి దారి తీశాడు.

వెంకట్రావ్ తగిలాడు.

ఏరోయ్ ! సేల్సు రిప్రజంటేటివ్‌లాగా ఎప్పుడూ బండ్ల సామానులతో కనబడతావ్ ! కొంపదీసి మళ్ళీ కొంపమారావా ఏమిటీ ?" కిసుక్కున నవ్వి సైకిల్‌మీద రివ్వున వెళ్ళిపోయాడు.

ఒక వెర్రినవ్వునవ్వి ముందుకు నడిచాడు అప్రావ్.

దారిలో పోస్టుమేన్ సింహాచలం కన్పించా

"సింహాచలం ! నేను మళ్ళీ యిల్లుమారా ఆదిగో అక్కడ కనబడుతోందే ఆ యింట్లోకి. పాత అడ్రసులకు వచ్చే నా వుత్తరాలన్నీ ఆ యింట్లో యిస్తూండు" అన్నాడు అప్రావ్.

"ఎన్ని యిళ్ళు గుర్తుంచుకుని చావమంటారు నన్ను ! యిదంతా నాకు తెలవదు. మీరే పోష్టాపీసుకువచ్చి తీసుకెళ్ళండి" అని కొంచెం ఆగి "యీ తిప్పలు ఎందుకండి. ఎంచక్కా ఆఫీసు అడ్రసుకు రాయమనండి. పర్మనెంటుగా

వుంటుంది'' అని ఉచిత సలహా పారేసి చక్కా పోయాడు సింహాచలం.

''హతవిధీ! నీక్కూడా లోకువైపోయాను గదరా సింహాచలం! యిల్లులేని వాడంటె ఎంత చులకన! అందులోను చీటికి మాటికి మారే వాళ్ళంటేను'' వాపోయాడు అప్రావ్.

మొత్తానికి కొత్త యింటిలో మారాడు అప్రావ్.

కొన్నాళ్ళు బాగానే జరిగింది.

ఇంతలో ఆవతలి వాటావాళ్ళను ఖాళీ చేయ మన్నారు.

ముందు ఎదిరించినా తరువాత లొంగిపోయి చివరికి ఖాళీచేసి వెళ్ళిపోయారు.

తరువాత రెంట్టింపు అద్దెతో మరొకరికి యిచ్చారు.

తిరిగి వెనుకవాటా వాళ్ళను ఖాళీ చేయ మన్నారు.

దాంతో విసిగిపోయి అప్రావ్ మొదలైన అద్దెకున్నవాళ్ళంతా ఒక రవుడీని మాట్లాడు కున్నారు. నెలకింత అని ఒక్కొక్క అద్దెయింటి వారు యిచ్చేటట్లు ఒప్పందం కుదుర్చుకున్నారు.

ఆ రౌడీ చేయాల్సిన పనేమిటంటే—

''ఖాళీ చెయ్!'' యింటివారు అనడమే తడవు—

''ముందు మీవని ఖాళీ!'' కత్తి చూపిస్తూ యింటివారిమీదకు వచ్చేవాడు రౌడీ.

దాంతో తారెత్తి లోపలికెళ్లి తలుపులు వేసుకునేవారు యింటివారు.

అద్దెకుంటున్నవాళ్లు విజయగర్వంతో వ్వూరేగారు.

కాని వారి ఆనందం ఎంతోకాలం నిలువలేదు.

కారణం!

ఇంటివాళ్లు కూడా ఒక రౌడీని పెట్టారు.

''ఖాళీ చేస్తారా!''అని స్వంత రౌడీ.

''నేనుండగా ఎలా ఖాళీ చేయిస్తావురా!'' అని అద్దె రౌడీ.

''అదికాదు గురూ! నీవు డబ్బు పుచ్చుకుని చేస్తున్నట్లే నేను కూడా డబ్బులు పుచ్చుకుని చేస్తున్నాను''అని స్వంత రౌడీ.

ఒకరోజు స్వంత రౌడీ అద్దెకుంటున్న వాళ్లకు అల్టిమేటమ్ యిచ్చాడు.

''మీరందరూ నాలుగు రోజులలో ఖాళీ చెయాలి! లేకపోతే...''

''హుఁ! లేకపోతే!'' మధ్యలో అడ్డువచ్చాడు అద్దె రౌడీ.

''సామానులు రోడ్డుమీదకు గిరాటేస్తాను''

''ఏమిటీ! సామానులు రోడ్డుమీదకు గిరాటేస్తావా! అదీ నా కళ్లకెదురుగానే! నేనంత చవటననుకున్నావా''

''లేకపోతే నేను చవటననుకున్నావా''

మీదమీదకు వస్తున్నారు ఆ రౌడీలు.

''సరే! మనిద్దరిలో ఎవరు చవటో తేల్చుకుందాం'' భుజాలు, తొడలు చరిచాడు.

మీసాలు మెలేశాడు అద్దె రౌడీ.

అంతే!

ఇద్దరూ హోరాహోరిగా కుస్తీ పట్లు పట్టారు. పెరడంతాఒకళ్లనొకళ్లు తోసుకుంటూ కుమ్ములాడుకున్నారు. దొర్లారు. ఆ యుద్ధంలో అందంగా పెరిగిన పూలమొక్కలు, కూరపాదులు వారికింద నలిగి పచ్చడిపచ్చడయి నాశనంఅయింది.

పంపుదగ్గర పెట్టిన బిందెలు, తప్పేలాలు, చెంబులు యధేచ్ఛగా వాడుకున్నారు. అవన్నీ సొట్టలుపడి వికృతాకారంపొంది నాలుగుమూలాలా పడివున్నాయి.

ఇంటివాళ్లు, అద్దెకున్నవాళ్లు తలుపుతలు వేసుకుని కిటికీలోనుంచి ఆ యుద్ధకాండను భయంభయంగా అదురుతున్న గుండెలతో చూస్తున్నారు.

ఆ యిద్దరిలో ఎవరూ గెలిచేటట్లులేరు. ఓడేటట్లు లేరు.

ఆ యిద్దరి ద్వంద్వ యుద్ధం అనంతంగా సాగుతూనే వున్నది.

యిహ లాభంలేదని ఇంటివాళ్లు,అద్దెకున్న వాళ్లు బయటకువచ్చి ఆ రౌడీలను బలవంతాన విడిపించారు.

ఈ విషయంలో అందరూ ఏకమై రౌడీలను ప్రార్థించారు.

''బాబులూ! యిహవెళ్లిరండి! ఇంతవరకు చేసింది చాలు!''అన్నారు ముక్తకంఠంతో చేతులు జోడిస్తూ.

''చెరొక యాభయి రూపాయలు యిలా పారెయ్యండి! వెళ్ళిపోతాం!'' అన్నారు రౌడీలు దర్పంగా.

వెళ్ళిపోతే చాలనుకుని చెరొక యాభయి రూపాయిలిచ్చారు. స్వంత యింటివారు అద్దెకుంటున్నవారు.

వాళ్ళిద్దరూ ఒకరి భుజాన ఒకరు చేతు లేసుకుని నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

వెర్రిమొహాలేసుకుని వెడుతున్న వారిద్దరి వంక చూస్తూండిపోయారందరూ.

రౌడీని పెట్టి అంతా పాడు చేశారనే కసి తోనూ, చులకనతోనూ యింటివారు అద్దెకున్న వాళ్ళను బాధపెట్టడం మొదలెట్టారు.

అద్దెకున్నవాళ్ళ సహనం నశించింది.

అందరూ ఐక్యమై ఎదిరించడమే మార్గ మనుకున్నారు.

ఆచరణలో పెట్టేశారు.

పంపు దగ్గర యింటివాళ్ళ బిందెలు కన బడితే తీసి అవతలగిరాటేసి తమ బిందెలను పెట్టుకునేవారు.

లావెట్రీ తలుపులు లాక్ చేసి తాళంచెవులు తమ దగ్గర వుంచుకునేవారు. ఇంటివాళ్ళు కనబడటం ఆలస్యం తిట్ల దండకం లంకించు కునేవారు. అద్దె నెల నెలా యివ్వడం మానేశారు. ఎవరిష్టం వచ్చినపుడు వారు ఎపుడో బుద్ధి పుట్టినప్పుడు యిచ్చేవారు.

ఇది ఒక రకంగా గెరిల్లా యుద్ధం అన్న మాట!

ఒకరోజు!

తెల్లారి లేచి చూస్తే యింటివాళ్ళున్న పోర్షన్ తాళం వేసివుంది!

''అరే! ఇంటివాళ్ళు ఏమైనట్లు? కొంపదీసి ఖాళీచేసి వెళ్ళిపోయారా ఏమిటి! ఎంత విప్లవాత్మకమైన మార్పు!'' అంటూ అప్రావ్‌తోసహా అందరూ ముక్కుమీద వేలుంచుకున్నారు..

మరునాడు—

ఎవరో ఒకాయన కుటుంబంతో బండెడు సామానులతో వచ్చి యింటివాళ్ల పోర్షన్ తాళం తీశాడు.

అద్దెకున్నవాళ్లు నోరెళ్లబెట్టి చూస్తున్నారు. ''ఈయనెవరు? యింటి ఓనర్ ఏమైనట్టు?''

అప్రావ్ ఆయనదగ్గరకు వెళ్ళాడు.

తన సందేహాన్ని బయటపెట్టాడు.

''ఏముందీ! ఈ యింటాయన మీ బాధలు పడలేక అక్కడ మా పోర్షన్‌లోనికి అద్దెకు వచ్చాడు. ఇహ నేను అక్కడ మా యింట్లో అద్దెకున్నవాళ్ళ బాధలు పడలేక యీ పోర్షన్‌లో అద్దెకు వచ్చాను!'' అన్నాడాయన ఏటోచూస్తూ.

''మ్యుచ్యువల్ ట్రాన్స్‌ఫరన్న మాట!''

అప్రావ్ బిగ్గరగా నవ్వాడు. మిగతా వాళ్ళందరూ నవ్వాలా. వద్దా అన్నట్లు చూస్తూండి పోయారు. □

## నార్లగారికి పంచధార నివాళి:–

ఆంధ్రప్రదేశ్ మరాఠీ సాహిత్య పరిషద్ సాహిత్యం ద్వారా సమైక్యాన్ని సాధించడానికి సాగిస్తున్న మహాయజ్ఞం పంచదారా ప్రకటన. ఇరుగు పొరుగు భాషలైన తెలుగు కన్నడ ఉరుదూ మలయాళ హిందీ భాషల సాహిత్య సౌరభాలను మహారాష్ట్రులకు అందిస్తూ ఈ భాషలవారి మధ్య సదవగాహనకు, సామరస్యానికీ ఈ త్రైమాసిక పత్రిక అపూర్వ కృషి చేస్తున్నది. దీనికి సంపాదకురాలు శ్రీమతి డాక్టర్ నళినీ సాధవే. ఈమె ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖలో రీడరు. సంస్కృతాంగ్ల హిందీ మరాఠీలలో గొప్ప వక్త్రి, కవయిత్రి. తులసీదాస్ రామాయణాన్ని సంస్కృతీకరించి గొప్ప మెప్పు పొందారు. తెలుగులోను ధారాళంగా ప్రసంగించగలరు. ఇదివరకు శ్రీ గుడిపాటి వెంకటచలం 'ఒక పూవు పూచింది' మున్నగు రచనలను మహారాష్ట్రానికి అనువదించారు. ప్రస్తుతం శ్రీ నార్లగారి 'సీత జోస్యం'నాటకాన్ని అనువదించారు. ఈ అనువాదం, శ్రీ డి. రామలింగం శ్రీ నార్లగారిపై వ్రాసిన ప్రత్యేక వ్యాసం గల పంచధార ప్రత్యేక సంచిక ఆవిష్కరణ జూన్ 27న సుల్తాన్‌బజార్‌లోని వై. ఎం. ఐ. ఎస్. హాలులో జరిగింది. సభకు రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పి. ఎ. చౌధరీ అధ్యక్షత వహించారు. రాష్ట్ర మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ గోపాల్‌రావ్ ఎక్‌బోటే స్వాగతం చెబుతూ పంచధార ఉద్దేశాలు వివరించారు. శ్రీ నార్ల ఆంగ్లంలో రచనలు సాగించి వుంటే అంతర్జాతీయ ఖ్యాతి పొంది వుండేవారని అన్నారు. మరాఠీ సాహిత్య పరిషత్తు కార్యదర్శి శ్రీ డి. పి. జోషి ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు మున్నగువారు పంపిన సందేశాలను చదివారు. తర్వాత శ్రీ డి. రామలింగం శ్రీ నార్లగారి బహుముఖ సేవను వివరించారు. తర్వాత ఇండియన్ ఎక్స్‌ప్రెస్ స్థానిక సంపాదకులు శ్రీ జి. ఎస్. భార్గవ శ్రీ నార్లగారి స్మారకార్థం ప్రచురించిన పంచధార ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. శ్రీ నార్లగారు మహారాష్ట్రుల సానే గురుజీ వంటి వారని ఆయన అన్నారు. శ్రీ చౌధరీ తమ అధ్యక్షోపన్యాసంలో శ్రీ నార్లగారు సిద్ధాంతాల కోసం జీవితమంతా పోరాడిన మహా వీరులని, పాతలోని మంచిని గ్రహించాలనే హేతువాది అని అన్నారు. శ్రీమతి నళినీ సాధవే కృతజ్ఞతా వందనాలు చెబుతూ, శ్రీ నార్లగారు గొప్ప వ్యక్తి అన్నారు. వారి ఇంట్లోని గ్రంథాలయం చాల గొప్పదని, దానిని ఒక పరిశోధన కేంద్రంగా రూపొందించదలచినట్లు శ్రీ నార్లగారి సతీమణి శ్రీమతి సులోచనాదేవి తెలిపారని శ్రీమతి నళినీ అన్నారు.

# హైదరాబాద్ నోట్‌బుక్

## స్వప్న వీణ ఆవిష్కరణ:–

"ఎవ్వరివి నీ"వని
నన్నడుగనేల?
చెలీ!!
చెలీ! నేను నీ
మధుర మనోజ్ఞ సుందర మందహాస
చంద్రికా చకోర
పాఠకుడను!!

లాంటి భావాలు గల స్వప్న వీణ అనే కావ్యం ఆవిష్కరణ జూన్ 30వ తేదీన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో సరస ఛలోక్తుల మధ్య జరిగింది. ఆవిష్కరణోత్సవానికి అధ్యక్షత వహించవలసిన డాక్టర్ ఎస్. వి. రామారావు అమెరికాకు వెళ్ళనున్నందున రాలేకపోయినందున శ్రీ తిరుమల రామచంద్ర అధ్యక్షత వహించారు. ఈ కావ్యాన్ని సుప్రసిద్ధ పత్రికా రచయిత, కవి, జానపద వాఙ్మయ మహోద్ధ బిరుదాంచితులు అయిన శ్రీ ఎల్లోరాకు అంకితం. "నిస్పృహల నెండి నీడకై నెమకు కవితతికి సమాదర వృక్షమివె. కుమతుల తలపు కొమ్మలు నరకు గొడ్డలివి నీవె, కాన ఈ పూలలో తావికానూ నీకు" అని కృతి కర్త కవి కౌస్తుభ డాక్టర్ ఆచార్య తిరుమల కావ్యాన్ని అంకితం చేశారు. కావ్యాన్ని ఆవిష్కరించిన డాక్టర్ దాశరథి, డాక్టర్ ముకురాల రామారెడ్డి, డాక్టర్ ఎల్లూరి శివారెడ్డి, శ్రీ చెరుకుమిల్లి భాస్కరరావు స్వప్నవీణ నాదాను నాదాలను వివరించారు. శ్రీ ఎల్లోర సన్మానంతో సహ కావ్యం స్వీకరిస్తూ, "ఈ చిన్ని పుస్తకంలో సుందర కొండంత కావ్య వస్తువును నిక్షిప్తం చేసిన కవి మిత్రుని పిద ప్రేమ మల్లెలు జల్లడం తప్ప ఏం ఇవ్వగలను. అందుకే అక్షరాక్షతలతో ఆశీర్వదిస్తూ, స్నేహానికి జ్ఞాపకంగా ఈ కావ్య కోమలిని నా దాన్ని చేసుకుంటున్నాను" అన్నారు. శ్రీ ఎ. వి. జనార్దనరావు కృతజ్ఞతా వందనాలతో సమావేశం సమాప్తమైంది. శ్రీ ఎ. కన్నారావు తమ మధురకంఠంతో స్వప్న వీణలోని కొన్ని గీతాలను ఆలపించారు.

## ఇస్కాన్ జగన్నాథరథ యాత్ర

రథాలు, రథ యాత్రలు మనకు వేదాలలోనే కనిపిస్తాయి. "ఆ సత్యేన రజసా వర్తమానో నివేశయన్ అమృతం మర్త్యంచ హిరణ్యయేన సవితా రథేన ఆదేవో యాతి భువనాని పశ్యన్"– పవిత్రమైన, సత్యమైన కాంతితో స్వర్గ మనుష్య లోకాలను నింపుతూ, బంగారు రథంపై సకల భువనాలనూ చూస్తూ వస్తున్నాడు – అని ఉదయిస్తున్న సూర్యుణ్ని చూచి ఆనంద తాండవం చేశారు. జగన్నాథుడైన విష్ణువును బ్రహ్మరథోత్సవంలో ఊరేగించడం వల్ల దేవాలయాలలో బ్రహ్మోత్సవాల సంప్రదాయం ఏర్పడింది. కళింగ విజయానంతరం కృష్ణరాయలు హంపీ విరూపాక్షంలో విరూపాక్షస్వామిని, పంపా దేవిని విడి విడిగా రథాలలో ఊరేగించే సాంప్రదాయం ఏర్పాటు చేశాడు. కృష్ణ చైతన్యుడు కృష్ణ సందేశం విశ్వవ్యాప్తమవుతుందని ఐదు శతాబ్దాల కిందటే చెప్పారట. ఆ ప్రకారమో, భగవద్గీతా సందేశం ప్రజలకు నచ్చడం వల్లనో కృష్ణ ప్రేమ విస్తరిస్తోంది. శ్రీ భక్తి వేదాంత స్వామి ప్రభుపాదులవారు ప్రారంభించిన అంతర్జాతీయ కృష్ణ చైతన్యోద్యమం నేడు విశ్వమంతటా వ్యాపిస్తున్నది. ఆ ఉద్యమంలో భాగంగా అంతటా రథయాత్రలు జరుగుతున్నాయి. జూన్ 20వ తేదీన హైదరాబాద్‌లో ఈ ఉద్యమం వారి రథయాత్ర మహోత్సాహంతో జరిగింది. జగన్నాథ విగ్రహాధిష్ఠితమైన రథం ఆబిడ్స్‌లోని రాధా మదన్ మోహన్ మందిరం నుంచి బయలుదేరి, నాంపల్లి క్రాస్‌రోడ్, ఫతేమైదాన్, నిజాం కాలేజి, బషీర్‌బాగ్, లిబర్టీ, లోయర్ టాంక్‌బండ్ రోడ్, బోట్స్ క్లబ్, రాష్ట్రపతి రోడ్, సరోజినీదేవి రోడ్‌ల మీదుగా సికిందరాబాద్‌లో తూర్పు మారేడ్‌పల్లిలో వున్న హరే కృష్ణ మందిరం చేరింది. ఈ యాత్రకు దాదాపు ఆరు గంటలు పట్టింది. రథయాత్రానంతరం జరిగిన ఉత్సవంలో హైదరాబాద్ మందిరాధ్యక్షుడు శ్రీ మహామన్‌దాస్ కృష్ణ సందేశం గురించి ప్రసంగించారు. డాక్టర్ దివాకర్ల వెంకటావధాని కృష్ణ తత్త్వం వివరించారు. సంధ్యారతి తర్వాత నాట్యాచార్యులు శ్రీ రామమూర్తి గారి శిష్య బృందం భరతనాట్యం ప్రదర్శించారు.

## ఉపశ్రుతి:–

స్వప్నవీణ ఆవిష్కరణోత్సవంలో ఆచార్య తిరుమల ప్రసంగిస్తూ, 'దాశరథిగారి పేరు చూచారా, అక్షరక్షరం సార్థకం. దా తీసి వేస్తే శరథి, శ తీసి వేస్తే రథి, ర తీసివేస్తే థి"– అని ఛలోక్తి విసిరారు. డాక్టర్ దాశరథి వెంటనే లేచి "! తీసివేసినా, ఎన్ని తీసివేసినా నిలబడతాను" అని ప్రకటించారు. దాని అంతర్యం గ్రహించిన శ్రోతలు కరతాళధ్వనులు చేశారు.

–తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna, Phones : P. B. X. : 61247, 61248 & 75667.*

